# కలలో కన్పించే కోమలాంగుని షర్టింగులు



ది
**లక్ష్మీ మిల్స్**
కంపెనీ లిమిటెడ్
కోయంబుత్తూరు

ప్రశస్త వస్త్రాలకు చిహ్నం

మెర్సరైజ్డ్ తెల్లనివి,
లేతరంగులు ప్రింటెడ్ చెక్‌లు
డేటోన్...ప్రత్యేకమైన
క్రెస్లిన్ ఫినిష్ కలిగివున్నందున
నూనె మరకలు పట్టదు.

# లక్ష్మీస్ డేటోన్ & డెమోక్రాట్

## కాటన్ షర్టింగ్‌లు

అమ్మకపు ఏజెంట్లు : వెంకటేశ్ వస్త్రాలయ మద్రాసు-1, రామ్‌కో స్వదేశీస్ కోయంబుత్తూర్. రిటెయిల్ షో రూమ్ : 17/93, ఒపనకర వీధి, కోయంబుత్తూర్.

Criterion LM2188TE

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి



# ఆదర్శ కుటుంబం

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు  కథ, దర్శకత్వం: కె. ప్రత్యగాత్మ




నవయుగ

# విజ్ఞానోదయ సాహిత్య పదావళి 5

## వరంగల్లు.2 (ఆ.ప్ర)

రు.
**2300**
తప్పక గెలవండి

భారత ఉన్నత న్యాయస్థాన తీర్పు ననుసరించి
నిర్వహించబడుచున్న సాహిత్య పోటి

ముగింపు తేదీ
**25-6-69**

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి రు **1000** ఆల్ కరెక్టు | | నాలుగవ బహుమతి రు **250** |
| రెండవ బహుమతి రు **500** ఒక తప్పు | | మూడు తప్పులు |
| మూడవ బహుమతి రు **300** రెండుతప్పులు | | లఘుపదావళి రు **250** ఆల్ కరెక్టు |

కూపను ఒక్కొంటికి ఒక రూపాయి మాత్రమే

— ఇది చింపి పంపండి —

చిరునామ:— విజ్ఞానోదయ సాహిత్య పదావళి - 5, వరంగల్లు-2

**సూచనలు** :—(1) ప్రతి ఆధారములోను మీరు తప్పుఅని భావించిన పదము ను సిరాతో కొట్టి వేయండి (2) మీరు నాలుగుకన్న తక్కువ కూపనులు పంపదలచుకున్నచో మిగిలినవాటిని చింపకుండా అలాగే వుంచి ఈ × గుర్తుతో ఈ చివరనుండి ఆ చవరవరకు కొట్టివేయండి. (3) ప్రవేశరుసుము M O. ద్వారా పంపినచో M.O. రశీదు దీనికి తప్పక జతచేయండి. M.O. రశీదులేని కూపనులు పోటీలో చేర్చబడవు. (4) పోస్టల్ ఆర్డరు క్రాస్ చేయకూడదు దానిమీద కేవలం విజ్ఞానోదయ సాహిత్య పదావళి వరంగల్లు 2 అని మాత్రమే వ్రాయాలి. (5) ఆల్ కరెక్టు లేనియెడల తక్కువ తప్పులున్న కూపనుకు మొదటిబహుమతి లభించును. ఆ క్రమము ననుసరించి మిగిలిన బహుమతులుకూడా మారును. (లఘుపదావళి ఆల్ కరెక్టుకు మాత్రమే) మూడు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతి లభించును. (6) విశేతల పట్టిక కావలసినవారు 0–15 పైసల పోస్టేజిపంపి పొందవచ్చును (7) తెల్ల కాగితముపై పదములు వరుసక్రమములో వ్రాసి పంపినను అంగీకరించబడును. (8) మిగిలిన నియమములు మామూలే.

| 1 | | రు 1 |
|---|---|---|
| 1 | ధర్మమే | సత్యమే |
| 2 | ధ్యేయం | ఆదర్శం |
| 3 | ఆదర్శం | వ్యక్తిత్వం |
| 4 | సుఖ | బాగు |
| 5 | బహుమానం | మెప్పు |
| 6 | సంస్కార | సుకృత |
| 7 | ఓరిమిని | కూరిమిని |
| 8 | వేయి | నూరు |
| 9 | కోరిక | ఆశ |
| 10 | అధమ | ఉత్తమ |
| 11 | విభిన్నం | భిన్నం |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |
| 14 | పగలు | ద్వేషాలు |
| 15 | పెళ్ళగించిన | త్రవ్వుకొన్న |

| 2 | | రు 1 |
|---|---|---|
| 1 | ధర్మమే | సత్యమే |
| 2 | ధ్యేయం | ఆదర్శం |
| 3 | ఆదర్శం | వ్యక్తిత్వం |
| 4 | సుఖ | బాగు |
| 5 | బహుమానం | మెప్పు |
| 6 | సంస్కార | సుకృత |
| 7 | ఓరిమిని | కూరిమిని |
| 8 | వేయి | నూరు |
| 9 | కోరిక | ఆశ |
| 10 | అధమ | ఉత్తమ |
| 11 | విభిన్నం | భిన్నం |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |
| 14 | పగలు | ద్వేషాలు |
| 15 | పెళ్ళగించిన | త్రవ్వుకొన్న |

ప్రతి రెండు కూపనులకు ఒక లఘుపదావళి ఉచితము

| 3 | | రు 1 |
|---|---|---|
| 1 | ధర్మమే | సత్యమే |
| 2 | ధ్యేయం | ఆదర్శం |
| 3 | ఆదర్శం | వ్యక్తిత్వం |
| 4 | సుఖ | బాగు |
| 5 | బహుమానం | మెప్పు |
| 6 | సంస్కార | సుకృత |
| 7 | ఓరిమిని | కూరిమిని |
| 8 | వేయి | నూరు |
| 9 | కోరిక | ఆశ |
| 10 | అధమ | ఉత్తమ |
| 11 | విభిన్నం | భిన్నం |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |
| 14 | పగలు | ద్వేషాలు |
| 15 | పెళ్ళగించిన | త్రవ్వుకొన్న |

| 4 | | రు 1 |
|---|---|---|
| 1 | ధర్మమె | సత్యమే |
| 2 | ధ్యేయం | ఆదర్శం |
| 3 | ఆదర్శం | వ్యక్తిత్వం |
| 4 | సుఖ | బాగు |
| 5 | బహుమానం | మెప్పు |
| 6 | సంస్కార | సుకృత |
| 7 | ఓరిమిని | కూరిమిని |
| 8 | వేయి | నూరు |
| 9 | కోరిక | ఆశ |
| 10 | అధమ | ఉత్తమ |
| 11 | విభిన్నం | భిన్నం |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |
| 14 | పగలు | ద్వేషాలు |
| 15 | పెళ్ళగించిన | త్రవ్వుకొన్న |

ప్రతి రెండు కూపనులకు ఒక లఘుపదావళి ఉచితము

| ఉచిత లఘు పదావళి | | |
|---|---|---|
| 4 | సుఖ | బాగు |
| 8 | వేయి | నూరు |
| 10 | అధమ | ఉత్తమ |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |




| ఉచిత లఘు పదావళి | | |
|---|---|---|
| 4 | సుఖ | బాగు |
| 8 | వేయి | నూరు |
| 10 | అధమ | ఉత్తమ |
| 12 | ప్రపంచంలో | జీవితంలో |
| 13 | ప్రపంచంలో | జీవితంలో |

మీ నిబంధనలకు లోబడి ఈ పోటీలో పాల్గొనుచున్నాను. ••• కూపనులకుగాను
రు. •••••••• మనీ / పోస్టల్ ఆర్డరుద్వారా పంపి. నం.........గల రశీదు జతపరచుచున్నాను.
పేరు ••••••••••••••••••••••••••••••••••••••••••
చిరునామా ••••••••••••••••••••••••••••••••••••••••

— ఇది చింపి పంపండి —

ఫలితముల ప్రకటన : 2-7-69

ఆ ధా ర ము లు :

1. సమస్త జగత్తుకూ ధర్మమే/సత్యమే ఆధారము.
2. తెలివితేటలూ యుక్తి వున్నవాళ్ళకి జీవితంలో. ఒక ధ్యేయం/ఆదర్శం ఒక గమ్యం చాలా అవసరం.
3. మనిషి అన్న తర్వాత ప్రతివాళ్ళకి ఒక ఆదర్శం / వ్యక్తిత్వం ఉండాలి
4 నీతి నిజాయితీలకై నిలబడిన మానవుడెప్పుడూ సుఖ / బాగు పడలేడు.
5. ఈ ప్రపంచంలో నేరానికి శిక్ష — మంచికి బహుమానం/మెప్పు వెంటనే లభించదు.
6 మనకు ఈ జన్మలో గల సంబంధములన్నియు పూర్వజన్మ సంస్కార/సుకృత ఫలములు. మనము వాటిని వెంటగొని తెచ్చుకొందుము.
7 ఓరిమిని/కూరిమిని పోలిన కార్యసాధకము మరొకటి లేదు.
8 కర్మబలం మానవబలంకన్న వేయి / నూరు రెట్లెక్కువ.
9. కోరిక /ఆశ అనునది మనుష్యులకు గల బంధనములలో ఆశ్చర్యకరమైనది.
10 మనుష్యునిచేత స్త్రీ సౌందర్యము ఎంతటి అధమ/ఉత్తమ కార్యమైనా చేయిస్తుంది.
11 భిన్న పరిస్థితులలో ఆశయాలు కూడా విభిన్నం/భిన్నం గానే వుంటాయి.
12. మనం ప్రపంచంలో/జీవితంలో అన్నీ సాధించగలమనే దీమా మన అల్ప జ్ఞానానికి చిహ్నం.
13. ప్రపంచంలో/జీవితంలో కొన్ని త్రెంచుకోలేని అనుబంధాలు కూడా.
14. ప్రపంచంలో వున్న మానవకోటికి ఒకరిపై ఇంకొకరికితీరని పగలు / ద్వేషాలు ఉంటాయి.
15. గతాన్ని పెళ్లగించిన/త్రవ్వుకొన్నకొలది పరస్పర వైషమ్యాలు పెంపొందడమేకాని అన్యథా యింకేమీ లాభించదు.

పదావళి 4 కీ సొల్యూషన్

పదావళి 4 కి సొల్యూషన్ 10—6—69 ఆంధ్రపత్రిక డైలీలో ప్రచురించబడును.

**ఏజెంట్లు కావలెను**

వివరములకు వ్రాయండి.

## ముఖచిత్రం

'హాణిశ్రీ' ముఖచిత్రంతో, వెలువడిన ఈవారం సంచికలోని కథలు చాలా బాగున్నాయి. 'భర్తను లొంగతీసుకోవడం ఏలా' అన్నవ్యాసం, వనితలకు ప్రత్యేకమయినా అందరూ చదివే పత్రికగాబట్టి చదవ వలసి వచ్చింది. కేవలం, ఈ వ్యాసం, వన్నీకి వ్రాసేరేమోననిపిస్తుంది. భర్త ఎన్నటికీ భార్యకు లొంగడం అసంభవం, అసాధ్యం, లొంగుతాడనుకోవడం, పరిమాళాసోమేశ్వర్‌గార్ల వంటి వారి భ్రమమాత్రమే—

వి. వి. ఆర్. శర్మ, (విజయనగరం)

* * *

9—5—69 పత్రిక మీది ముఖచిత్రము చాల బావుంది. 25 సం.లు నటనానుభవమున్న నాగేశ్వరరావులా కాకుండా 25సం.లు వయస్సు గల నాగేశ్వరరావులా ఉంది.

యస్. సుభద్ర, (చింతలపూడి)

## కథలు

శ్రీ 'కోడూరి శ్రీరామమూర్తి' గారు రాసిన 'నాలుగోవాడు' అనే కథ చాల ఆకర్షించింది నన్ను. అంతేకాదు. మంచి సస్పెన్సు, సహజంతో మానవుని మనస్తత్వాన్ని చక్కగా చిత్రీకరించి నందుకు రచయితకు నా అభినందనలు.

పి. వి. రమణయ్య, (హిరమండలం)

* * *

ఈవారం పత్రికలో 'స్వయంకృతం', 'నాలుగోవాడు' అన్న కథలు రెండుబాగున్నాయి. 'నాలుగోవాడు' కథ చదువుతుంటే భలే నవ్వొచ్చింది. ఒక వారం విపరీతంలో ఫలాక్కుడు నిజంగా జరిగి నవే రాస్తున్నారా? లేక పూరికినే రాస్తున్నారా? ఎందుకంటే అలా అనిపిస్తోంది మరి.

కుమారి వి. లక్ష్మి (శ్రీకాకుళం)

* * *

'ఎందుకు', 'వాడిగిన గులాబి' చాల సహజంగా బాగ వున్నవి.

కప్పగంతుల వారి 'ఎందుకు' నేటి విద్యార్థుల సమ్మెలను గురించి చాల చక్కగా చిత్రించారు. నిజానికి చాల విద్యార్థులకు సమ్మెలెందుకు చేస్తున్నారో తెలియదు. ఎవరో కొందరి ప్రోద్బలము వలన అందరు సమ్మెలో పాల్గొని బాధలకు గురి అవుతున్నారు. పోలీసు అధికారుల అసహాయ స్థితిని బాగా వివరించారు—వారు సమ్మె చేయువారిని అదుపులో వుంచితే ఒక కష్టం, లేకుంటే మరో కష్టం. ఈ వృత్తాంతము చాల సహజంగా వుంది. అందరికీ కనువిప్పు కాగలదని నమ్ముచున్నాను.

'వాడిగిన గులాబి' లోని అరుంధతి పాత్ర చక్కగా పోషింపబడినది. కావ్యాలలోని నాయికల లాగ చిరం జీవిగా వుండదగినట్లుగా వున్నది. 'ముళ్ళకంపలో చిక్కుకొన్న తన జీవితాన్ని దయానిధి అతికష్టంగా విడిపించాడు, అతను. అదే కంపలో పడ్డాడు. అతను వెలికి రావాలంటే తాను మరల ముళ్ళకంపలో దిగాల్సి వచ్చింది. 'ఒకసారి పతిత అయినా, పదిసార్లు అయినా ఒకటే!. ఒకపతిత మంచి మార్గంలో రావడం ఎంత దుర్లభమో, దానికి సంఘము ఎలా అడ్డుపడునో చాల చక్కగా చిత్రింపబడినది.

హెచ్. ఆర్. శేఖర్, (హైదరాబాద్)

# ఉత్తరాలు

## సీరియల్

పత్రికలో ప్రచురించిన సీరియల్ 'అడ కత్తెరలో మనిషి' చదివాము. ఆ సీరియల్ గురించి రెండుముక్కలు.లేచిపోయి,వేశ్యఅయినతనఅక్కయ్య కూతురుని, మొదటి కోడలు బ్రతికుండగానే కొడుకు కిచ్చి వివాహంచేసేంత విశాల హృదయంవున్న యింటి పెద్ద భవానీ ప్రసాద్, భర్తపోయిన తన కూతురు వేరొకతన్ని గౌరవంగా పెళ్ళి చేసుకుంటే సహించలేదు. క్షమించ లేదు. మొదటి భార్యను మోసం చేసి వేశ్య అయిన తన అత్తకూతురిని మళ్ళీ వివాహం చేసుకున్న భవానీ శంకరం గౌర వంగా పెళ్ళిచేసుకున్న తన చెల్లెలికూతురుని పెద్ద కొడుకు వివాహం చేసుకోడం సహించ లేడు. ఇక అతని కొడుకులు వాళ్ళు వారిష్టం వచ్చిన పిల్లల్ని యిష్టం వచ్చిన రీతిలో వివాహం చేసుకుని తన్ను అనుసరించ బోయిన చెల్లెలికి నీతులు చెప్తారు. ఈ సీరియల్‌లో యింకో విశేషమేమిటంటే అందరూ తమ యిష్టం వచ్చి నట్టు ప్రవర్తిస్తూనే, ఎదుటివారిని పరువు ప్రతిష్ఠలు నిలుపుకోమని హెచ్చరిస్తారు. ఇందులో పరువుగల వాళ్లెవరో మాకర్థం కాలేదు. ప్రతివాడు ఎదుటి వాడికి ధర్మ పన్నాలు చెప్పే వాడే. తను మోసాలు చేస్తూ. మాటిమాటికి రచయిత్రి పరువు ప్రతిష్ఠ అని వాడటం వలన ఆ పదాలు ఈ కథలో పాత్రలకి అతకక పోవడం వలన వాటికి కొత్త అర్థాలు వెతుక్కోవలసి వచ్చింది. ఇందులో బాగున్న పాత్రలు సంధ్య, దుర్గ. ఆ పాత్రల 'పరువు' తీయనందుకురచయిత్రికి మా కృతజ్ఞతలు.

విద్య, దుర్గ, సుగుణ, విజయ, (హైదరాబాదు)

## వ్యాసాలు

'తాజ్‌మహల్'కి సంబంధించిన వ్యాసం ఒకటి 6—6—69 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచు రించాము. కొందరు పాఠకులు దానిని గురించి రాస్తున్నారు. వీటికి ప్రత్యుత్తరాలు ఇవ్వటం వీలుకాదు.'

ఈ వ్యాసం అనువాదంచేసి పంపినదివారు.

శ్రీ అకుండి నారాయణమూర్తి
మక్కువ పోస్ట్
శ్రీకాకుళం జిల్లా.

కష్టమయినవారు వారికే నేరుగా రాయ వచ్చును.

—సంపాదకుడు


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 13—6—'69

శ్రీసౌమ్యనామ సం॥ జ్యేష్ఠ బహుళ చతుర్దశి

సంపుటము : 61 సంచిక : 42

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

# మంత్రులు నిర్ణయాలకి రాలేకపోతే దేశానికే నష్టం!

అమెరికన్ అంతరిక్ష నావికులు చంద్రమండలం చుట్టారు; చిన్ననావలో చంద్రగోళం దగ్గిరగా వెళ్లి తిరిగి పెద్ద నావని చేరుకున్నారు సురక్షితంగా భూగోళానికి తిరిగి వచ్చేశారు.

ఒక మహత్తర కృషి ఫలితం విజయవంతంగా కొనసాగింది. ప్రపంచం అంతా ముగ్గురు అంతరిక్ష నావికులని కొనియాడుతోంది

ఇక రష్యన్లు శుక్రగ్రహానికి సంబంధించిన పరిశోధనలు జరుపుతున్నారు.

భారతీయులు ఏమి చేస్తున్నారు? వారి కృషి కూడా కొనియాడ తగినదే మద్యపాన నిషేధం, గోవధ నిషేధం, హిందీని బలవంతంగా ఇతరుల నెత్తి మీద రుద్దటం, ఖద్దరు ప్రచారం—ఇవీ, భారతదేశం సాధిస్తూ ఉన్న గొప్ప విషయాలు

'పి' ఫారమ్ ద్వారా విదేశయాత్రని నిలిపి వేస్తున్నారు శ్రీ మొరార్జీ దేశాయిగారు

ఎద్దెనిమిదవ శతాబ్దంలో పాశ్చాత్యులు ప్రపంచం నలుమూలల ప్రయాణం చేశారు. 20వ శతాబ్దంలో ఆకాశంలోకి ఎగసి వెళ్లిపోతున్నారు.

## హిందీ-అభివృద్ధి

హిందీవాదులు మాత్రం అభివృద్ధిని దేశంలోకి రాకుండా కాపు లంటున్నారు దీనికి వారి ప్రథమ సాధనం హిందీభాష. గుజరాత్ రాష్ట్రం కూడా హిందీవాదుల వయిపే ఉన్నట్లు తోస్తోంది.

ఇతరంగా చెయ్యాగిన కృషి మద్యపాన నిషేధ ప్రచారం మీద దండగ అవుతోంది

ఎంతో ధనం హిందీప్రచారం మీద దండగ అవుతోంది

రిటరయిన సైనికుల పించన్లు ఒక్క రూపాయి పెంచటానికి డబ్బులేదు కాని హిందీ, ఖద్దరు, మద్యపాననిషేధం కోసం ఎంత డబ్బయినా ఇస్తారు శ్రీ మొరార్జీ దేశాయి. పాశ్చాత్యదేశాలలో 'అభివృద్ధి' అనేమాటకి ఒకరకమయిన అర్థం, భారతదేశంలో అదే మాటకి మరొక రకం అర్థం.

విదేశయాత్ర వల్ల -ఎన్నో విషయాలు తెలుస్తాయంటారు శ్రీమతి గాంధీ, శ్రీ మొరార్జీదేశాయి గారలు ఇద్దరూ భారతదేశం కర్బుతో ప్రపంచాన్ని చూశారు. మేడమ్ గాంధీగారు తమ తండ్రిగారితో వెళ్లిన దేశాలు కాక మేడమ్ గాంధీగారు న్యూజిలాండు, ఆస్ట్రేలియా, లాటిన్ అమెరికా, యూరపులో చాలా దేశాలు ప్రధాని అయిన తర్వాత వెళ్లివచ్చారు. త్వరలో జపాను వెళ్లనున్నారు శ్రీ దేశాయిగారు కూడా విదేశాలు వెళ్లి వస్తూనే ఉంటారు, వాటివల్ల ఆయన దృక్పథం ఏమయినా పరిణామం చెందిందా?

## మియ్యా క్రుద్దీన్ విలాసయాత్ర

ఇక మేడమ్ గాంధీగారి అమాత్యశేఖరులలో ఒకరు మియాన్ ఫక్రుద్దీన్‌ఆలీ అహమ్మద్ (పారిశ్రామికాభివృద్ధి, అంతరంగిక వ్యాపారం, కంపెనీ చట్టం శాఖమంత్రి) గారు పోయిన వారం విదేశ పర్యటన మీద వెళ్లారు బ్రిటన్, సోవియట్ రష్యా, హంగేరీలని చూసి వస్తారు వారు.

వారు బ్రిటన్‌ని ఎందుకు సందర్శిస్తున్నారు? భావిలో భారతదేశంలో నాలుగవ ప్రణాళికలో బ్రిటిషు—భారత సంస్థల సహకారంతో ఏర్పడే కంపెనీల ఆర్థిక అవసరాలని గురించి చర్చలు జరుపుతారుట. భారతదేశంలో ఇటీవల విదేశీ పెట్టుబడిని గురించి ఏర్పడిన ప్రభుత్వాభిప్రాయాలని విడమరిచి చెప్తారుట బ్రిటిషువారికి.

రాజకీయ నాయకులు విలాసయాత్రలు జరుపుతూ ఉంటే ఉద్యోగులు కూడా వారిని అనుసరిస్తున్నారు (కాంగ్రెసు అధ్యక్షులు కూడా అంతే.) ఇటీవలె సప్లయి శాఖ కార్యదర్శి శ్రీ కె. రావ్ ఎరువుల వెల బేరం చెయ్యటానికని బ్రిటన్, అమెరికా, జపాన్ వెళ్లివచ్చారు 'ఇండియా సప్లయి మిషన్' అనే సంస్థ కార్యాలయాలు లండన్, వాషింగ్టన్‌లలో ఉన్నాయి. ఇవి పెద్దకార్యాలయాలు వెల బేరం కూడా ఈ కార్యాలయాలు చెయ్యలేవా?

## మంత్రుల ప్రచారం

మంత్రుల సంగతి వేరు వారగా, లేక వారి భృత్యులు, విదేశయాత్రలకి ఆహ్వానాలు కోరి సంపాదించుకుంటారు. ఇక ఆ మంత్రులు ఏదో ముఖ్యమయిన పని మీద వెడుతున్నట్లు ప్రచారం జరుగుతుంది. తిరిగివచ్చిన తర్వాత ఏదో ఘనకార్యం సాధించి వచ్చినట్లు ప్రచారం జరుగుతుంది ప్రజలని ఇలా ఏమారుస్తున్నారు అందరూ.

మేడమ్ గాంధీగారి లాటిన్, అమెరికా పర్యటన వల్ల వచ్చే సత్ఫలితాలని గురించి పెద్ద పెట్టున పత్రికలలో రాశారు. అసలు వారికి భారతదేశం ఆర్థిక స్థితిని గురించి ఏమి తెలుసు, భారతదేశం ఏ విదేశంతో చేస్తున్న వ్యాపారం గురించి ఎంత మాత్రం తెలుసు? లాటిన్ అమెరికాకి వ్యాపార దళం ఒకటి వెళ్లింది. ఈ దళం సభ్యుల భార్యలు కూడా వారితో వెళ్లారు. ఈ వ్యాపార దళం లాటిన్ అమెరికా దేశాల వ్యాపార దళాలని భారతదేశానికి ఆహ్వానించింది—మేడమ్ గాంధిగారు ఆ దేశాల నాయకులని ఆహ్వానించినట్లే. కొన్నిసంవత్సరాల కింద ఒక ఆర్జెంటైనా వ్యాపార దళం మనదేశానికి వచ్చి ఈ దేశంలో తమ సరుకులు అంతగా అమ్మే అవకాశం లేదని తెలుసుకుని తిరిగి వెళ్లిపోయింది.

## పాకిస్తాన్‌కి లాభమా?

ఇక మియాన్ ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ తమ కీర్తిని ఎలా పెంపొందించుకుంటున్నారు? పార్లమెంటులోపలా, బయటా భారతదేశం పారిశ్రామికాభివృద్ధిని అరికడుతున్న ఆరోపణలు ఆయన మీద ఎన్నో!

గౌ. మంత్రిగారు ఏ నిర్ణయానికీ రాలేరు. అందుచేత ఎన్నో పరిశ్రమలలో ముందంజ వెయ్యటానికి వీలులేకపోతోంది. నిర్ణయానికి రాకపోవటానికి ఏవో కారణాలు చెప్తారు విదేశీ సాంకేతిక విజ్ఞానం అక్కరలేదు కాబట్టి, ఆర్థికబలం కొందరి చేతుల్లో కూడుకుంటోంది కాబట్టి (మానోపలీ)...

ఈ తామసంవల్ల లాభం పొందేది ఎవరు?

పాకిస్తాన్ అని కొందరు.

ఈ మంత్రిగారి పత్రికా ప్రసంగాలకి ఈ విలేఖరి ఎన్నోసార్లు వెళ్లాడు, ఆయన ఏ విధానాన్నీ సరిగ్గా విడమరచి చెప్పటం చూడలేదు.

స్వదేశంలోనే మాట్లాడటంచేతగాని వ్యక్తి విదేశాలలో, అందులోనూ బ్రిటన్‌వంటి దేశాలలో, ఏమి నచ్చ చెప్పగలడు?

పోయినఏడు భారతదేశానికి వచ్చినప్పుడు సర్. నార్మన్ కిప్పింగ్' భారతదేశం అనుసరిస్తున్న పారిశ్రామిక విధానంలో సాంకేతిక విజ్ఞానం బయట పెట్టాలనే షరతు తమకి నచ్చలేదన్నారు. అందువల్ల భారతదేశం—బ్రిటన్‌లమధ్య పారిశ్రామిక సహకారం తగ్గవచ్చు నన్నారు.

ఇంతకిముందే అన్నాను—యుద్ధ సమయంలో 'విమానదళంలో చేరి ప్రపంచం చూడండి' అనే నినాదం ఉండేది. ఇప్పుడు 'భారత ప్రభుత్వంలో చేరి ప్రపంచం—భారతదేశం కర్చుమీద—చూడండి' అనే నినాదం సరిగ్గా ఉంటుంది.

## కృష్ణమీనన్ పొరపాటు

శ్రీ కృష్ణమీనన్ పార్టీకి ద్రోహం చేస్తున్నారనవచ్చునేమో! న్యూఢిల్లీలో మాట్లాడుతూ, ఆయన కాంగ్రెసుపార్టీలో ఉన్న సోషలిస్టులని బయటికి వచ్చెయ్యమన్నారు. ఆవడి కాంగ్రెస్‌లో చెప్పిన సూత్రాలని అనుసరించినట్లు నటించనైనా నటించటం లేదు కాంగ్రెసుపార్టీ, అన్నారు ఆయన.

కాంగ్రెసుని వదిలి ఈసోషలిస్టులు ఏమిచేస్తారు? శ్రీ మీనన్ చెప్పలేదు.

కమ్యూనిస్టు పరిపాలనకిందలేని దేశాలలో కమ్యూనిస్టులు అనుసరించే పద్ధతి అందరికీ తెలిసి

వదే. ముందు అధికారంలో ఉన్న పార్టీలో స్థావరాలు ఏర్పరచుకొనటం, పార్టీతో చీలికలు తీసుకురావటం, ఐయికమత్యాన్ని నాశనం చెయ్యటం.

కేంద్ర మంత్రివర్గంలోనే కమ్యూనిస్టులు ఉన్న సంగతి శ్రీ మీనన్‌కి తెలియనిది కాదు. ప్రస్తుతం ప్రభుత్వాన్ని గందరగోళం పెడుతున్నది వీరే. తప్పుడు నిర్ణయాలు తీసుకొనటానికి కారణం వీరే.

## దిగుమతి పోయిన దిగుమతి

మదరాసు ఎరువుల కర్మాగారాన్నే తీసుకోండి. మొట్టమొదట చేసుకున్న ఒప్పందం ప్రకారం దీనికి కావలసిన బాయిలర్లని అమెరికానుంచే దిగుమతి చేసుకోవాలి. ఒప్పందం అయిన ఎన్నో నెలల తర్వాత భారతదేశంలో తయారయిన బాయిలర్లనే వాడాలని పెద్దలు కొందరు అన్నారు.

ఈ కొత్త తీర్పువల్ల ఎరువుల కర్మాగారం 18 నెలలు ఆలస్యంగా ఉత్పత్తి మొదలు పెడుతుంది.

ఈ పద్దెనిమిది నెలలలో ఎంత విదేశీ మారక ద్రవ్యం ఖర్చు అవుతోంది?

అదీకాక ఒప్పందాన్ని మార్చినందుకు డామేజిలు ఇవ్వవద్దా?

కమ్యూనిస్టులు వారి మిత్రులూ చేసే పని ఇది.

శ్రీ కృష్ణమీనన్ సలహా పార్టీకి నచ్చలేదని వేరే చెప్పనవసరంలేదు. క

శ్రీ చంద్రశేఖర్ ఆ సలహా 'అప్రస్తుతం, అకాలం' అయినదన్నారు. అంటే, సోషలిస్టులు కాంగ్రెసుని వదిలే కాలం ఇంకా రాలేదన్నమాట.

మరొక పురోగమనవాది శ్రీ అర్జున్ అరోరా, 'ఏ సోషలిస్టు, కాంగ్రెసువాదీ శ్రీ మీనన్ సలహాని పాటించరాదు' అన్నారు.

శ్రీ డాంగే ఈ అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవిస్తారు.

శ్రీ కృష్ణమీనన్ సహప్రయాణీకులకి సరయిన సలహా ఇవ్వలేదన్నమాట.

శ్రీ కృష్ణమీనన్‌గారు సోషలిస్టులు. బీదలంటే ఆయనకి ఎంతో అభిమానం. అందుకనే ఆయన పార్లమెంటు సభ్యత్వం పోగొట్టుకున్న తర్వాత కూడా అంతకిముందు ఉంటున్న పెద్ద భవనాన్ని వదలి వెళ్లమన్నారు.

'వెకూనా' ఉన్ని అని ఒకటి ఉంది. అయిరోపా దేశాలలో బాగా ధనవంతులే దానిని వాడుతారు.

శ్రీ మీనన్ ఎన్నో వెకూనా ఉన్ని కోట్లని కుట్టించుకున్నారు. అంతా బీదలకోసమే.

సోషలిస్టుగా ఉండటం ఆయన కేమీ కష్టం కాదు. ●

ఆటలు

# విద్యాసంస్థలు-క్రీడాసౌకర్యాలు

డాక్టర్ టి. పి. థామస్ సూచించిన ముఖ్యమైన సూచన ఒకదానిని గురించి గతవారం రాశాను. ఆయన చేసిన ఇతర సూచనలని గురించి కూడా ఇక్కడ చర్చిస్తాను. స్కూల్‌లో కానీ, కాలేజిలో కానీ ప్రతి 250 మంది విద్యార్థులకీ ఒక ఆటలని నేర్పే ఉపాధ్యాయుడు ఉండాలి. ఇది చాలా ముఖ్యమైనది. చాలా చోట్ల పెద్ద పెద్ద సంస్థలలో ఆటలు నేర్పే ఉపాధ్యాయుడు ఒకే ఒకరు ఉండటం వల్ల ఆతను తన కర్తవ్యాన్ని సరిగా నిర్వహించలేకపోతూ ఉండటం జరుగుతున్నది.

ప్రస్తుతం ఆటల కోసం ప్రతి విద్యార్థి వద్ద నుంచి సంవత్సరానికి రూపాయో, రూపాయిన్నరో ప్రత్యేకంగా వసూలు చేయబడుతూంది. కానీ అది స్కూల్‌కి గానీ, కాలేజికి గానీ కావలసిన క్రీడా పరికరాలని కొనడానికి ఏమాత్రం సరిపోదు. రాష్ట్ర, అఖిలభారత క్రీడలకి సంబంధించిన అధికారి శ్రీ ఎం. ఎ. చిదంబరం ఇటీవల ఆటలకి సంబంధించిన ఒక సమావేశంలో మాట్లాడుతూ కొన్ని పట్నాలలో, పల్లెలలోని సంస్థలకి ఉండాల్సిన కనీస సౌకర్యాలు, పరికరాలు కూడా లేవని అన్నారు. హాకీ, ఫుట్‌బాల్ ఆటలకి కావలసిన 'గోల్—పోస్ట్'లు కొన్ని విద్యాసంస్థలకి లేవన్న విషయాన్ని ఆయన వివరించారు. ఇలాంటి కనీస సౌకర్యాలని కూడా కల్పించకుండా నిధులని ఎలా కేటాయిస్తున్నారన్నది ఆశ్చర్యకరమైన విషయం. అలాంటి అసౌకర్యాలకి ప్రచారం రావడం వల్లనే పరిస్థితి కొంత మెరుగవుతున్నది.

ఈ పరిస్థితిని మెరుగు పరచడానికి డాక్టర్ థామస్ ప్రభుత్వ సబ్సిడీ ఉండాలని సూచించారు, లేబరేటరీ పరికరాలకి గ్రాంట్‌లు ఇస్తున్నట్లే ఆటలకి కావలసిన పరికరాల విషయంలో కూడా గ్రాంట్స్ ఇచ్చే ఏర్పాటుని ఆయన సూచించారు.

తర్వాత అతిముఖ్యమైనది కావలసినన్ని ఆట స్థలాలని ఏర్పాటు చేయడం. పూర్వం ఆటస్థలాలుగా కేటాయించిన స్థలాలు ఆకాశహర్మ్యాలు కట్టడానికి పనికి వచ్చాయి. దీనికి నిదర్శనం మద్రాసులోని ఎస్ప్లనేడ్‌లో ఉన్న యస్ప్లనేడ్ క్రీడాస్థలం, చేపాక్‌లోని పాత ఇంజనీరింగ్ కళాశాల ఆటస్థలం. వీటిని భవనాల నిర్మాణానికి తీసుకుంటున్నారు. ఆఫీసులకి, నివాసాలకి భవనాల నిర్మాణం అవసరం లేదని ఎవరూ అనరు. కానీ ఆట స్థలాలుగా ఉన్న వాటిని బాలబాలికలకి అందుబాటులో లేకుండా చేయడం అన్నది అంత సమంజసంగా కనిపించదు. చాలినంత క్రీడా స్థలం లేని ఏ స్కూల్‌ని నడపడానికి అంగీకరించ కూడదు.

శరీర ప్రమాణాన్ని నిర్ణయించి విద్యార్థులు ఆ ప్రమాణాన్ని అందుకుంటే గానీ సర్టిఫికెట్లు, డిగ్రీలు ఇవ్వకూడదని డాక్టర్ థామస్ సూచించారు. ఈ నిబంధనని ఖచ్చితంగా అమలు జరిపినట్లయితే సాధారణ ప్రమాణంలో తప్పకుండా అభివృద్ధి కనిపిస్తుంది.

అనుభవం కల ఆటలు నేర్పే ఉపాధ్యాయులని గట్టి శిక్షణ పొందడానికి ఎన్నిక చేసి క్రీడా విద్యాసంస్థలకి పంపి మంచి శిక్షకులుగా తయారు చేయాలి. ఇలా చేస్తేగానీ సంస్థల కొరత తగ్గదు.

డాక్టర్ థామస్ సూచనలని ప్రభుత్వం, విద్యాసంస్థలు పరిశీలించి వాటిని సాధ్యమైనంత త్వరగా అమలు జరిగేలా చూడటంవల్ల ఆటలు అభివృద్ధి చెందడానికి అవకాశం ఉంటుంది. తెలివితేటలలో ప్రమాణాన్ని మెరుగుపరచాలనుకోడం ఎంత ముఖ్యమో ఆటల స్థాయిని పెంచాలన్నది కూడా అంతే ముఖ్యం.

—కె. యస్. నరసింహన్



# ఆంధ్ర తెలంగాణా కథాకాలక్షేపం...

1956 జనవరిలో ఈ విలేఖరి (సొంత పని మీద రాజకీయాలకి సంబంధించినది ఏదీ కాదు) మొట్ట మొదటి సారిగా హైదరాబాదుకి వెళ్ళటం జరిగింది. అప్పటికి ఇంకా "విశాలాంధ్ర" ఏర్పడ లేదు. దానిని గురించి ఎందరో ఎన్నో చెప్పారు. అవి అన్నీ ఏమిటో ఇన్ని సంవత్సరాల తర్వాత సరిగ్గా గుర్తు లేవు! ఒక సంగతి మాత్రం ఇంకా మరిచి పోలేనిది; అదేమిటంటే, ఎన్నో గోడల మీద రాసిఉన్న ఒక నినాదం (తెలుగులోనే!)—

"బాపట్లనుంచి బయటికి వచ్చిన బసవరాజుని పారద్రోలండి" అన్న నినాదం. ("ద్రో" అని రాశారో "దో" అని రాశారో అంత గట్టిగా చెప్పడం కష్టం. కాని ఈ చిన్న పొరపాటు జరిగినా ఫరవా లేదేమో:)

ఈ బసవరాజుగారు ఎవరో అప్పుడు ఈ విలేఖరికి తెలియదు. అయితే, వారే నేటి ఆంధ్ర ప్రదేశ్ రెవెన్యూ మంత్రి అని ఇప్పుడు తెలుసు!

టయిమ్స్ఆఫ్ ఇండియా డయిరెక్టరీ, 1968 ప్రకారం, శ్రీ వి. బి. రాజుగారు గుంటూరు జిల్లా లోని వల్లూరులో 1914 లో జన్మించారుట. వారు మదరాసు ఇంజినీరింగ్ కాలేజిలో చదువు పూర్తి చేసుకుని 1934 లో హైదరాబాదుకి వెళ్లారుట. వారు 1948/49 లో హైదరాబాదు ప్రభుత్వంలో మంత్రిగా పనిచేశారుట.

అంటే, తెలంగాణాకి తమ 20వ సంవత్సరంలో వెళ్లిన ఒక ఆంధ్రప్రాంతం వ్యక్తి సుమారు 14 సంవత్సరాలలో "ముల్కీమంత్రి" అయి పోయారు!

మళ్లీ ఆ మంత్రిగారినే 1956 లో సుమారు 9 సంవత్సరాల తర్వాత, పారదోలమని స్థానికులు కొందరు నినాదాలు లేపారన్నమాట....

శ్రీ రాజుగారు 1956—59 దాకా మళ్లీ మంత్రి పదవిలో ఉన్నారుట. ఇద్ది విశాలాంధ్ర, లేక "ఆంధ్రప్రదేశ్" ఏర్పడిన తర్వాత. అంటే నినాదాలు అమాత్య పదవికి అడ్డం రాలేదనే వూహించాలి.

"ముల్కీ" అంటే ఏమిటి? (అర్థం కాదు, అర్హత.)

"కనీసం తాత అయినా తెలంగాణాకి చెందిన వారయితేనే ముల్కీ కావచ్చు" అని ఈ విలేఖరికి తెలిసిన తెలంగాణా అభిమాని అన్నారు.

ఈ నిబంధనని పాటిస్తే ఎందరు తెలంగాణా వారు "శుద్ధ" మయిన ముల్కీలవుతారు?

1934 లో తరలి వచ్చిన శ్రీ రాజుగారి మీద 22 సంవత్సరాలలో నినాదాలు లేచాయి.

1956 ప్రాంతంలో తరలి వచ్చిన ఎందరో చిన్న ఉద్యోగుల మీద ఇప్పుడు, సుమారు 13 సంవత్సరాల్లలో, నినాదాలు వస్తున్నాయి. (వారు మంత్రి అయ్యారు, వీరు ఆ ప్రాంతం నుంచే నిష్క్రమించారు, అదే తేడా...........)

**ఇప్పటి ఉద్యమం [illegible]** 1983 లో తలఎత్తుతుందా? అప్పుడు ఉద్యమానికి గురి అయ్యే వారు ఎవరవుతారు?

హైదరాబాదులో ఉండే ఒక తమిళమిత్రుడు అన్నాడు—ఇప్పుడు ఆంధ్రావాళ్ళు, రేపు అరవ్వాళ్ళ తర్వాత కన్నడం వాళ్ళు, ఆతర్వాత గుజరాతీలు...

* * *

సౌదీ అరేబియా చాలా వెనక బడ్డ దేశం అక్కడ నిరాక్షరాస్యుల, సిఫెలిస్—క్షయరోగుల, గుడ్డివారి సంఖ్యలు వింటే భయం వేస్తుంది. కాని, సౌదీ అరేబియా చాలా సంపన్నమయిన దేశం. సౌదీ అరేబియాలో రాతినూనె లేక పెట్రోలియమ్ ఉంది! దానిని పాశ్చాత్యదేశాల వారు కొనుక్కుంటున్నారు. (ఈ ఆదాయం అంతా ఎవరికి వెడుతూ వచ్చింది.? సౌదీ అరేబియా ప్రజలకా? కాదు, ఆదేశం షేక్‌లకి, వారి ద్వారా తిరిగి పాశ్చాత్య దేశాలకి!)

దీనిని బట్టి ఎవరయినా గ్రహించ గలిగేది ఏమిటి ?

ఒక వెనుక బడిన ప్రాంతంవారి ఐశ్వర్యాన్ని బాగా అభివృద్ధి చెందిన ప్రాంతాల వారు అనుభవించ వచ్చు అని, ఇది పెద్ద రహస్యం ఏమీ కాదు. పాత కాలాలలో భూస్వామ్య వర్గాలవారు చేసిన—ఇంకా కొన్ని చోట్ల చేస్తున్న—పనే ఇది. నేటికీ ప్రపంచంలోని డబ్బున్న దేశాలు ఇంకా బాగు పడుతూ ఉంటే బీద దేశాలు మరింత లేని వవుతున్నాయని పెద్దలు చెబుతూ వుంటారు.

తెలంగాణా ఆంధ్ర ప్రాంతంకన్నా ఇంచుమించు అన్ని విధాలా వెనుకబడిన ప్రాంతమే అని అందరూ ఒప్పుకుంటారు.

1956 ప్రాంతంలో తెలంగాణా ఇంకా వెనుక బడి ఉండేది. రెండు ప్రదేశాల మధ్య తారతమ్యాలు ఇంకా అధికంగా ఉండేవి.

(ఎన్నో లెక్కలు పోయినవారం ఆంధ్రసచిత్ర వార పత్రికలో చూడ వచ్చు.)—

ఈ వారం ఒక కొత్త లెక్క.

1955—56 లో వ్యక్తిగత ఆదాయాలు—

| | |
|---|---|
| తెలంగాణా——— | రు. 201 |
| రాయలసీమ ——— | రు. 225 |
| సర్కార్ ప్రాంతం ——— | రు. 257 |

అంటే తెలంగాణా ఆదాయం ఆంధ్రప్రాంతం లోనే వెనుకబడిన రాయలసీమ ప్రాంతంకన్నా చాలా తక్కువగా ఉండేదన్నమాట.

ఇక తెలంగాణాని "ఆంధ్రావాళ్ళు" దోచుకునే దేమిటి?

వెంటనే సౌదీ అరేబియా ఉపమానం చెప్ప వచ్చు—అని కొందరు అనుకోవచ్చు.

అనుకుంటే చాలా పొరబడిన వారవుతారు.

ఎందుకంటే—

తెలంగాణా 'పారిశ్రామికంగా అభివృద్ధి చెంది వట్లు వ్యవసాయంలో అభివృద్ధి కాలేదు.

**ఆంధ్రప్రాంతం [illegible]** వ్యవసాయంలోనే అభివృద్ధి చెందిన దేశం. ఇది 1969లో ఎంత నిజమో 1955—56 లోనూ అంతే నిజమేనని ప్రముఖ నిపుణులు చెప్తారు.

అంతే కాక, గత 12 సంవత్సరాలలో కేంద్ర ప్రభుత్వం తెలంగాణాలో రు 84.9 కోట్లు పెట్టుబడి చేస్తే అందులో సగంకన్నా కొంచెం తక్కువే ఆంధ్రప్రాంతంలో పెట్టుబడి చేసింది!

సుప్రసిద్ధ మేధావి జాన్ స్ట్రాచీ తమ "ఎండ్ ఆఫ్ ఎంపయిర్"లో బ్రిటన్ భారతదేశం నుంచి తీసుకు పోయిన ధనం కన్నా ఎక్కువే భారతదేశంలో కర్చు చేసిందని నిరూపించారు. అయితే, సామ్రాజ్యం వల్ల బ్రిటన్‌కి వచ్చిన లాభం ఏమిటి? బ్రిటన్‌లో జరిగిన "పారిశ్రామికవిప్లవం" భారతదేశం వల్లనే వీలయింది. అని స్ట్రాచీ విడమరచి చెప్పారు.

తెలంగాణాని ఆంధ్రప్రాంతంవారు వలస ప్రాంతంగా వాడుతున్నారని ఒక ఆరోపణ. ఇది ఎంత సబబయిన ఆరోపణో లోకజ్ఞానం కలవారందరూ తెలుసుకో గలరు !

ఇంకా చెప్పాలంటే, 1955—56 కే తెలంగాణా పారిశ్రామిక ఆదాయం సుమారు రు 41.6 కోట్లు. తెలంగాణాకి 2 రెట్లు జనాభా కల ఆంధ్ర ప్రాంతం ఆదాయం రు 56.7 కోట్లు మాత్రమే! ఆంధ్రప్రాంతానికి ఒకప్పుడు మదరాసు, ఇప్పుడు హైదరాబాదు.......

* * *

ఇంగ్లీషులో "కల్చర్''కి తెలుగులో సంస్కృతి అనే మాట వాడుతున్నారు. సంస్కృతి అంటే ఏమిటి? సంస్కృతంలో, ఉర్దూలో, తెలుగులో కవిత్వం చెప్పటమా? నాటకాలు వెయ్యటమా? అత్తర్లు పూసుకొనటమా? హిందీ సినిమాలు చూడటమా?

ఇవన్నీ సంస్కృతిలో ఒకభాగం కిందనే వస్తాయి. సంస్కృతి అంటే పరిసరాలని అవసరం ప్రకారం మార్చుకొనటమే కదా? కాని, జీవితంలో ముఖ్యమయిన సాంస్కృతిక కార్యక్రమం ఏమిటి? ఆహారాన్ని ఉత్పత్తి చెయ్యటం, నివాసం ఏర్పరచుకొనటం ఇవే కదా? మానవుడి విజ్ఞానాభివృద్ధి వల్లనే సాంస్కృతికాభివృద్ధి కూడా కలుగుతుంది. ఇంజనీర్లు గణిత శాస్త్రజ్ఞులు, రసాయనిక శాస్త్రజ్ఞులు, భౌతిక శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, వృక్ష శాస్త్రజ్ఞులు, కర్షకులు, కార్మికులు, మనశ్శాస్త్రజ్ఞులు—వీరే నిజమయిన సంస్కర్తలు. వీరి వల్లనే కవిత్వం, సంగీతం చదివి, విని, ఆనందించే పరిస్థితి ఏర్పడ గలదు!

(రోమన్ సామ్రాజ్యం అత్యుచ్ఛస్థితిలో ఉన్నప్పుడు అక్కడి జీవితస్థాయి, నేటి జకర్తా జీవితస్థాయిని మించిఉండదని చరిత్రకారులు చెప్తారు. 'స్వర్ణయుగాలేవయినా ఉంటే అవి భవిష్యత్తులోనే' అన్నారు ఒక గొప్ప భారతీయ మేధావి.

'విదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వ కారణం?' అని ఒక గొప్పకవి అన్నారు!')

విశాలాంధ్ర లేక ఆంధ్రప్రదేశ్ ఏర్పడే ముందు తెలంగాణా ప్రజాబాహుళ్యంలో అభివృద్ధి చెందినంతగా సంస్కృతి నిజానికి వారిని పరిపాలించినవారిలో అభివృద్ధి చెందలేదనే చెప్పాలేమో! సామాన్య ప్రజలు వళ్ళువంచి కష్టపడి పనిచేసి ఉత్పత్తి చేసేవారు; వారిని పాలించేవారు ఉల్లాసంగా వీరి కృషి ఫలితాలని అనుభవిస్తూ వర్తమానంతో సంబంధంలేని కళా స్వరూపాలలో మునిగి ఉండేవారేమో అనిపిస్తుంది. (ఒకసారి ఈ విలేఖరి సాలార్‌జంగ్ మ్యూసియమ్‌లో ఒక పెద్ద కత్తిని చూస్తూ ఉంటే అక్కడ ఉద్యోగం చేసే ఒకాయన వచ్చి ఇంగ్లీషులో, 'అది డాల్డా తినకముందు రోజులనాటిది!' అని సగర్వంగా చెప్పారు. డాల్డాకన్నా నెయ్యి గొప్ప అయి ఉండవచ్చు కాని మునుపటి కాలంలో ఎంతమంది నెయ్యి తినేవారు, ఇప్పుడు డాల్డా తిని బతికేవారు ఎంతమంది? పాశ్చాత్య దేశాలలో డాల్డావంటి పదార్థాలని తినే వారందరూ ఏమయిపోతున్నారు? మునుపటి కాలంలో అసలు ఆధునిక విజ్ఞానంతో వచ్చిన ఆరోగ్య సూత్రాలని గురించి ఎంతమందికి తెలుసు? ఎవరో ఒక పెద్ద ఫయిల్వాను ఉండి ఉండవచ్చు నేడు అటువంటివారు ఎందరో ఉంటారు వెనుకబడే వారంతా గతాన్ని తలుచుకుని మురిసిపోతూ ఉంటారు!)

*   *   *

ఒక సమాజంలో ఒక మయినారిటీ లేక అల్పసంఖ్య కలవర్గం ఉందనుకోండి. వారిని అందరూ వింతగానే చూస్తూ ఉంటారు. అంతేకాదు; మెజారిటీలేక అధిక సంఖ్యాక వర్గం వారికి విచిత్రము[illegible] గుణాలు అంటగడుతూ ఉంటుంది. [illegible] తిండికి, వేషభాషలకి సంబంధించినవే కావు 'సెక్స్' లేక కామానికి సంబంధించినవి కూడా అయి ఉంటాయి. 'కూడా' ఏమిటి సెక్స్‌కే సంబంధించి ఉంటాయి అంటారు ఎందరో! దీనికి సంబంధించిన ఉదాహరణలు ఈ ఈ వ్యాసంలో ఇచ్చే ధైర్యం ఈ విలేఖరికి లేదు—కాని, హైదరాబాదులో ఆంధ్ర వనితలని గురించి రాసిన నినాదాలని గురించి విన్న తర్వాత ఇవి తీరని కోరికలకి సంబంధించినవా, అనిమాత్రం రాయకుండా ఉండలేకపోతున్నాడు! శ్రీ మర్రి చెన్నారెడ్డి గారు అదంతా ఆవేశంలో రాసినది, అంతగా పట్టించుకోనవసరం లేదు, అన్నట్టు మాట్లాడారుట వారి విశాలదృక్పథం

# ఆంధ్రపత్రిక

## తుఫాను బాధితులకు సహాయనిధి

మే నెల 16 వ తేదీ నుంచి నాల్గురోజులపాటు నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరులు, ఖమ్మంజిల్లాలు బ్రహ్మాండమైన తుఫాను దెబ్బకు గురియైనాయి. వర్షాలు, వరదలు సంభవించి అపారమైన నష్టం వాటిల్లింది. చేలమీది పంటలు చేలమీదనే దెబ్బతినిపోయినాయి విశేష జననష్టం, పశునష్టం సంభవించింది. ఇళ్లు కూలిపోయినాయి. అనేకమంది నిరాశ్రయులైనారు.

ఈ విధంగా తుఫానువలన బాధ రాష్ట్రాన్నిన్ని ఆవరించింది. ఈ బాధకు లోనైన వారికి ఎవరి శాయశక్తిని వారు సహాయంచేయడం మానవీయమైన ధర్మం అందుకుగాను "ఆంధ్రపత్రిక", తుఫాను బాధితుల సహాయార్థం నిధిని ప్రారంభించింది. బాధలోవున్న తోటి మానవులకు తోచిన రీతిని సహాయంచేయడం పుణ్యకార్యం సకల ఆంధ్రప్రజలేగాక యావద్భారత ప్రజలుకూడా యీ పుణ్యకార్యంలో పాలుపంచుకుని తమ ధర్మాన్ని నిర్వహించగలరని మా విశ్వాసం.

ప్రతి విరాళము పంపినవారి పేరుతోసహా ప్రకటించబడుతుంది. విరాళం మొత్తమును "ఆంధ్రపత్రిక" పేర 7, తంబుచెట్టివీధి, మద్రాసు-1 కి గాని, గాంధీనగరం విజయవాడ-3 కి గాని పంపించవచ్చును.

చెక్కులు, డ్రాఫ్టులు పంపేవారు వాటిపై 'ఆంధ్ర సైక్లోన్ రిలీఫ్ ఫండ్' అని వ్రాసి, వాటిని పెట్టిపంపే కవర్లమీద 'ఆంధ్ర సైక్లోన్ రిలీఫ్ ఫండ్', కేరాఫ్, మేనేజర్ ఆంధ్రపత్రిక, 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1 అని వ్రాయాలని అభ్యర్థన.

ప్రముఖ ఇంజనీరు, పారిశ్రామికవేత్త అయిన శ్రీ బొప్పెన హనుమంతరావుగారు తుఫాను బాధితుల సహాయనిధికి రు 10,000 లు విరాళం యిచ్చారు.

కొనియాడ తగ్గది. వారి సానుభూతి చాలా గాఢమయినది.

తీరనికోరికలతో కలత చెందిన వారి మనశ్శాంతికి వారు తోడ్పడుతున్నారు. (చాలా పాశ్చాత్యదేశాలలో నేరాలు దుష్ట ప్రభావంవల్లకాదు మానసికారోగ్యం చెడి పోవటంవల్ల అనే సిద్ధాంతం ప్రచారంలో ఉంది. మానసికనారోగ్యానికి అపసరణమే

# తెలంగాణా...

చికిత్సా?)

—ఆంధ్రప్రాంతవాళ్ళు మా తెలంగాణా ఉచ్చారణని హేళనచేసి అవమానించారు, అన్నారు ఒక తెలంగాణా అభిమాని (ఈ విలేఖరితోనే!) ఈ హేళనకూడా మానసి కాందోళనవల్ల ఏర్పడినదేనా? ఆంధ్రా వాళ్ళకి తమది అసలయిన తెలుగు కాదని తెలిసి, ఆ తెలియటంవల్ల ఏర్పడిన న్యూనతా భావంచేత చేసే అవహేళనా ఇది?

* * *

ప్రత్యేక తెలంగాణావారు ఓడిపోవటం, తెలంగాణా ఆంధ్రప్రాంతంతో కలవటం తెలంగాణాకే లాభం—అన్నారు 1956లో శ్రీ చెన్నారెడ్డిగారు. ఆ తర్వాత వారు కొన్ని సంవత్సరాలు తెలంగాణా చేరిఉన్న ఆంధ్ర ప్రదేశ్‌కి ఆర్థికమంత్రిగా పని చేశారు. ఆర్థికశాఖవారికి లాభనష్టాలు బాగా తెలియాలికదా? మరి తెలంగాణాకి చివరికి మిగిలింది లాభం కాదు, నష్టం అని తెలియటానికి వారికి ఇన్నిరోజులు పట్టిందా?

పోనీ ఆలస్యంగానయినా తెలిసిందేదో తెలిసింది, అనుకుందామంటే అందుకోసం చిన్నచిన్న ఉద్యోగులని హింసపెడుతూ ఉంటే ఆపటానికి శ్రీవారుకాని శ్రీమరెవరెవరు కానీ చేసిన ప్రయత్నం ఏమిటి? 'నాకోరికలు తీరలేదు. నా ప్రాంతానికి రావలసిన డబ్బుని ఎవరో కర్చు చేసేశారు, అందుచేత ఫలానా ఆయన్ని పెట్రోలు పోసి తగలపెట్టేశాము' అని ఎవరయినా అంటే అప్పుడూ ఆవేశంతో అన్న మాటలు, తెలీక చేసిన పనులు, గుండెమీద బరువు తగ్గింది అదే చాలు; అని సంతోషించాలేమో! (చాలా రోజులకింద 'న్యూస్టేట్స్‌మన్'లో ఒక కార్టూన్ పడింది. ఒక జడ్జిగారితో నేరస్థుడు—'అంతా నా పరిసరాల భావం' అని కన్నీరుపెడ్తాడు. 'నీకు నేను ఉరిశిక్ష వెయ్యటానికి కారణంకూడా నా పరిసరాలే', అని జడ్జిగారు వాపోతారు.)

అందరికీ విడిపోవటం ఇష్టమయితే ఎవరు కాదనగలరు? ఇటువంటప్పుడే గిరీశం చెప్పిన సామెత గుర్తుకి వస్తుంది—పడుపడు అన్న నా సవితేగాని పడ్డ నా సవితి లేదు, అన్న సామెత...

భారతరాజ్యాంగంలో ఒక కొత్త అంశం చేర్చాలి. ప్రతి 10 సంవత్సరాలకి గాని, 15 సంవత్సరాలకిగాని దేశంలో రాష్ట్రాలన్నిటినీ చిన్నచిన్న ముక్కలు చేసి మళ్ళీ బృహత్రాష్ట్రాలుగా మారుస్తూ ఉండాలి, అనే చట్టాన్ని తీసుకు రావాలి. ఇవాళ మదరాసు, రేపు ఆంధ్ర, తర్వాత విశాలాంధ్ర, ఆ తర్వాత సంకుచితాంధ్ర, చివరికి...? (ఒ. వి)

# ముగ్గురు మూర్ఖులు* లిపి - ఉచ్ఛారణ - మహేష్



'ఇంగ్లీషు భాషలో 26 అక్షరాలే ఉన్నాయి. తెలుగుభాషలోకంటే తమిళంలో కూడా తక్కువ అక్షరాలు ఉన్నాయి. తెలుగులోని 'క' 'గ' లకు బదులు తమిళంలో ఒక్క అక్షరమే ఉంది. అలాగే 'బ, 'డ' లు వగైరా. అందుచేత ఆ భాషల లిపిని నేర్చుకోవడం సులభం. తెలుగుభాషలో యెక్కువ అక్షరాలు ఉన్నాయి కాబట్టి తెలుగు లిపిని నేర్చుకోవడం కష్టం, అన్నాడు చిదంబరం.

'నిజమే తెలుగుభాషలో యెక్కువ అక్షరాలు ఉన్నాయి. అందుచేత తెలుగు లిపిని నేర్చుకోవడానికి యెక్కువకాలం పడుతుంది కాని తెలుగు లిపిలో ముఖ్యమైన సౌకర్యం ఉంది' అన్నాడు చూడామణి.

'ఏమిటా సౌకర్యం?'

'ఇంగ్లీషు, తమిళం, తెలుగు యీ మూడు భాషల్లోను ఉచ్చరింబబడే ధ్వనులు ఒకటి రెండు తేడాతో సమానంగానే ఉన్నాయి. ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక్క అక్షరం చొప్పున తెలుగు లిపిలో ఉంది. అందుచేత తెలుగు లిపిని నేర్చుకొన్న ప్రతి వ్యక్తి తెలుగుభాషలో యే పుస్తకాన్నైనా తప్పులు లేకుండా చదవ వచ్చును!' అని అంటూ చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

ఇంగ్లీషులోను, తమిళంతోను అలాగ కుదరదు. తమిళంలో 'క' 'గ' లకు ఒకే అక్షరం ఉందని నువ్వే చెప్పావు కదా! అందుచేత ఏ సందర్భంలో సదరు అక్షరాన్ని 'క' గా పలకాలి? ఏ సందర్భంలో దాన్ని 'గ' గా పలకాలి? అనే ప్రశ్న వస్తుంది. అలాగే 'ట' 'డ' లు, 'త' 'ద' లు వగైరా.

'ఇంగ్లీషులో ఒక్కో అక్షరాన్ని మూడు నాలుగు రకాలుగా కూడా పలకవచ్చును. ఒక్కోపదంలో కొన్ని అక్షరాలను అసలు పలకనే అక్కరలేదు; అందుచేత యీ భాషల్లో లిపి వచ్చినా కూడా ఉచ్చారణలో పొరబాట్లు జరగడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. ఇలాటి పొరబాట్లు జరగడం వల్లనే కదా, ఒక స్కూలుకు పేరు మారిపోవడం, గోపాలన్‌కు ఉద్యోగం పోయే పరిస్థితి యేర్పడడం జరిగాయి!' అన్నాడు చూడామణి.

'స్కూలుకు పేరు మారిపోవడం యేమిటి?' అని చంద్రరావు ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'కాల్డ్‌వెల్ అనే దొర యింగ్లాండు నుంచి ఉద్యోగం నిమిత్తం యిండియా వచ్చాడు. అతను యిండియాకు రాగానే తన జాతకాన్ని జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు చూపించాడు. వారు అతన్ని జాతకాన్ని చూసి, అతని పేరు 'పి ఏ' అనే అక్షరా

లతో కాకుండా, 'సి ఓ' అనే అక్షరాలతో ప్రారంభం అయితే బాగా ఉంటుందని సూచించారు ఇంగ్లీషు భాషలో యే అక్షరాలను యెలాగ అయినా పలకవచ్చును కాబట్టి అతను తనపేరును 'సి ఓ యల్డ్'తో రాయడం ప్రారంభించాను!

'తరువాత అతను తంజావూరుకు కలెక్టరుగా నియమించబడ్డారు. కాల్డ్వెల్ దొర మంచివాడూ, సమర్థుడూ కూడా కావడంవలన ప్రజల్లో అతనికి చాలా గౌరవం ఉండేది కుటుంబ సంబంధమైన కారణాలవలన అతను తంజావూరునుంచి అకస్మికంగా యింగ్లాండు వెళ్లిపోవలసి వచ్చింది. అతను తంజావూరునుంచి వెళ్లిపోయే సందర్భంలో అక్కడి ప్రజలు ఒక స్కూలుకు 'కాల్డ్వెల్ యెలిమెంటరీ స్కూలు' అని పేరు పెట్టి, అతనియెడల తమకుగల గౌరవాన్ని వెల్లడించారు'

'కాల్డ్వెల్ యింగ్లాండువెళ్లి, పెళ్లి చేసికొని, అక్కడే స్థిరపడిపోయాడు. అతనికి కొంతకాలానికి ఒక కుమారుడు జన్మించాడు. అప్పుడప్పుడు కాల్డ్వెల్ తన పేరను తంజావూరులో ఒక స్కూలు ఉన్నసంగతిని భార్యతోను కొడుకుతోను చెబుతుండేవాడు!

'కాల్డ్వెల్ కొడుకు పెద్దవాడు అయిన తరువాత యేదో ఒక పనిమీద ఒకసారి యిండియా వచ్చాడు. తన తండ్రిపేరున ఉన్న స్కూలును చూడడంకోసం అతను ప్రత్యేకంగా తంజావూరు వెళ్లాడు. తండ్రి చెప్పిన గుర్తు ప్రకారం అతను గుడిపక్కను ఉన్న స్కూలువద్దకు వెళ్లాడు. కాల్డ్వెల్ యెలిమెంటరీ స్కూలుకు బదులు అక్కడ 'తంగవేల్' యెలిమెంటరీ స్కూలు అని ఉంది'

'తన తండ్రిపేరు పెట్టిన స్కూలు యిది అవునా? కాదా? ఇదే అయినట్లయితే, తన తండ్రిపేరును తీసివేసి, యీ స్కూలుకు మరొకపేరును యెందుకు పెట్టారు? అనే ప్రశ్నలు కాల్డ్వెల్ కొడుకుకు వచ్చాయి. ఆ స్కూల్లో పని చేస్తున్న వారెవ్వరూ యీ ప్రశ్నలకు సమాధానం యివ్వలేకపోయారు. ఆఖరుకు ఒక ముసలి బంట్రోతు మాత్రం అతనితో యిలాగ అన్నాడు. 'ఈ పక్కవీధిలో వైద్య రామయ్యరు' అని చాలా ముసలా

## ముగ్గురు మహర్షులు

యన ఒకరు ఉన్నారు. అతను చాలాకాలం క్రిందట యీ స్కూల్లో పనిచేశారు. అందుచేత మీ ప్రశ్నలకు అయన సమాధానం చెప్పవచ్చును.'

'వెంటనే కాల్డ్వెల్ కొడుకు వైద్య రామయ్యరు వద్దకు వెళ్లి తనను పరిచయం చేసికొని, తనకు కలిగిన సందేహాన్ని అతనికి తెలియజేశాడు',

'నాయనా! మీ నాన్నగారిని నాకు బాగా తెలుసును. వారికి నామీద చాలా అభిమానం ఉండేది' అంటూ వైద్య రామయ్యరు చెప్పడం ప్రారంభించాడు.

'మీ నాన్నగారి పేరుపెట్టిన స్కూలు యిదే. ప్రత్యేకంగా యెవరూ మీ నాన్నగారిపేరును తీసివేసి యీ స్కూలుకు మరొకపేరును పెట్టలేదు. కాని మీ నాన్నగారిపేరే ఉచ్చారణ భేదంవలన యిప్పటికి యిలాగ మారిపోయింది!

'ఎలాగ మారిపోయింది?' అని ప్రశ్నించాడు కాల్డ్వెల్ కొడుకు.

'ఈ స్కూలుకు మొట్టమొదట 'కాల్డ్వెల్ యెలిమెంటరీ స్కూలు' అనే పేరే ఉండేది. తరువాత కొంత కాలానికి అది 'కాల్డ్వేల్ యెలిమెంటరీ స్కూలు' అయింది. మీ నాన్నగారిపేరు 'సిఓ' అనే అక్షరాలతో ప్రారంభం అవుతుంది కాబట్టి మరి కొంతకాలానికి అది 'కోల్డ్వేల్ యెలిమెంటరీ స్కూలు' అయింది. తమిళంలో 'క' 'గ' లకు ఒక్కే అక్షరం ఉంది కాబట్టి ఆ స్కూలుపేరును తమిళంలో రాయగా, అది 'గోల్డ్వేల్ యెలిమెంటరీస్కూలు అయింది. తరువాత కొంతమంది యిలాగ అనుకొన్నారు 'వేల్' అనేది తమిళ పదం, గోల్డ్ అనేది యింగ్లీషుపదం, సగం యింగ్లీషు సగం తమిళం ఉండడం బాగాలేదు. గోల్డ్ అంటే తమిళంలో తంగమేకదా! అని వారు ఈస్కూలును తంగవేల్ యెలిమెంటరీ స్కూలుగా మార్చివేశారు' అని చెప్పాడు వైద్య రామయ్యరు.'

'చూశావా? ఇంగ్లీషు, తమిళం భాషల్లో ఒక అక్షరాన్ని రెండుమూడు రకాలుగా పలకడానికి అవకాశం ఉండడం వల్లనేకదా ఆ పేరు యిలాగ మారిపోయింది' అని చూడామణి స్కూలు పేరు మారిపోయిన సందర్భాన్ని వివరించాడు.

'ఇది బాగానే ఉంది కాని గోపాలన్ ఉద్యోగంపోయే పరిస్థితి యేర్పడడం యేమిటి?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'మద్రాసులో ఒక యింగ్లీషు యింజినీరింగు కంపెనీ ఉండేది. 'ట్రూమన్ అనే దొర దానికి మేనేజింగు డైరెక్టరు. అతను యింగ్లాండులోనే ఉండేవాడు. ఇండియాలో కొంతకాలంపాటు ఉందామని అతనికి ఒకసారి బుద్ధిపుట్టింది. వెంటనే అతను మద్రాసు వచ్చాడు. అప్పుడప్పుడు అతను కంపెనీ పనులను కూడా చూస్తూ ఉండేవాడు. అతను మద్రాసు రాగానే 'తమిళం యింగ్లీషు స్వయంబోధిని' పుస్తకం కొని తమిళం తనంతట తనే నేర్చుకోవడం ప్రారంభించాడు.

''ట్రూమన్ చాలా కోపంగల వ్యక్తి' అనే విషయం ఆఫీసులో అందరకూ తెలిసింది. అందుచేత అతనంటే అందరూ భయపడుతుండేవారు.'

'ఒకనాడు సాయంత్రం అతను గోపాలన్ అనే ఉద్యోగిని తన గదిలోనికి పిలిపించి, 'డడ'కు వెళ్లావా? అని యింగ్లీషులో ప్రశ్నించాడు.

'డడ' అంటే యేమిటో గోపాలన్కు తెలియదు. అందుచేత అతను 'లేదుసార్' అని జవాబు యిచ్చాడు.

'నువ్వు ఉత్సాహంగా ఉండాలి. ఈ రాత్రికే నువ్వు అక్కడకు వెళ్లాలి.'

'అలాగేసార్!' అంటూ గోపాలన్ ట్రూమన్ గదినుంచి బయటపడ్డాడు. 'డడ' అంటే యేమిటో అతనికి తెలియదు. దీన్నిగురించి తిరిగి ట్రూమన్ను ప్రశ్నించే ధైర్యంకూడా అతనికి లేదు.

'అప్పుడు సాయంత్రం అయిదు గంటలు కావడం వలన ఆఫీసులో పనిచేసే వాళ్లందరూ యిళ్లకు వెళ్లిపోయారు. అందుచేత యెవరినైనా 'డడ' గురించి, అడగడానికికూడా గోపాలన్కు అవకాశం లేకపోయింది' 'డడ' 'అంటే యేమిటా?' అని ఆలోచిస్తూ, గోపాలన్ తమ ఆఫీసుకు పక్కనున్న కాఫీ హోటల్వైపు వెళ్లాడు.

'కాఫీ హోటల్లో అతనికి మురుగన్ అనే తమ ఆఫీసులో పనిచేసే గుమస్తా కన్పించాడు. మాటల సందర్భంలో మురుగన్ గోపాలన్‌తో యిలాగ అన్నాడు.

'ట్రూమన్‌దొర పైకి కోపంగా కన్పిస్తాడు కాని అతను చాలా మంచివాడు. నాటకాలన్నా, సంగీతమన్నా, అతనికి చాలా యిష్టం.'

'మురుగన్ యీమాటలు చెప్పి, కాఫీతాగి వెళ్ళిపోయాడు. 'ఈ పరిస్థితిలో యేమిటి చేయాలి?' అని గోపాలన్ ఆలోచిస్తుండగా పక్కనున్న రేడియోలోనుంచి ఒకపాట వినబడింది. 'లోకపు తీరు తెలియగా లౌకిక జ్ఞానం కావాలిగా డడడా డడడా డడడా డడడా' అనే పాట అది. అది 'జీవితం' అనే సినిమాలో ఉంది.

ఆ పాట వినగానే గోపాలన్‌కు మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. 'ట్రూమన్ చెప్పిన 'డడ' అనే పదానికి అర్థం అంటూ యేదీ లేదు. కాని జీవితం సినిమా పాటలో 'డడ' ఉంది. ట్రూమన్‌కు సంగీతమంటే యిష్టం కాబట్టి ఈ సినిమా పాటను గుర్తుపెట్టుకొన్నాడు. ఈ సినిమాకు వెళ్ళావా?' అని అడగడానికి బదులు 'డడ'కు వెళ్ళావా? అని అతను ప్రశ్నించాడు. 'అందుచేత 'డడ' అంటే జీవితం సినిమాయే అని అనుకొని గోపాలన్ ఆ రాత్రి జీవితం సినిమాకు వెళ్ళాడు.

మర్నాడు ఉదయం ట్రూమన్ గోపాలన్‌ను పిలిపించి 'డడ'కు వెళ్ళావా? అని ప్రశ్నించాడు.

'వెళ్ళాను, సార్! అందులో సంగీతం అద్భుతంగా ఉంది. ఎవరైనా దాన్నిచూసి, విని ఆనందించవలసిందే కాని మాటలతో చెప్పడానికి వీలులేనంత చక్కగా ఉంది' అన్నాడు గోపాలన్.

'ఓ! అలాగా?' అని ట్రూమన్ అనగానే గోపాలన్ అతనితోచెప్పి గది బయటకు వచ్చివేశాడు.

ఆ సాయంత్రం ట్రూమన్ తన కారులో కూర్చొని, గోపాలన్‌కు కబురుచేశాడు. గోపాలన్ వచ్చి కారులో ముందుసీటులో కూర్చున్నాడు. అంతకుముందే ట్రూమన్ చెప్పిన ప్రకారం డ్రైవరు కారును 'తడ' అనే ఊరుకు తీసుకొని వెళ్ళాడు.

'సంగీతం అద్భుతంగా ఉందని మవ్వు అన్నావు కదా! అది యెక్కడ?' అని ప్రశ్నించాడు ట్రూమన్.

'అది జీవితం అనే సినిమా సార్!' అన్నాడు గోపాలన్ తడబడుతూ.

'ఆవేళ ఏప్రిల్ ఫస్టుతారీఖు' అనే విషయం ట్రూమన్‌కు అప్పుడు గుర్తుకు వచ్చింది. తనను 'ఫూల్'ను చేయడానికే గోపాలన్ యీవిధంగా చెబుతున్నాడని ట్రూమన్ అనుకొన్నాడు. వెంటనే అతనికి చాలా కోపం వచ్చింది. 'నిన్ను ఉద్యోగంలో నుంచి తీసివేస్తున్నాను' అని ట్రూమన్ గోపాలన్‌తో కోపంగా చెప్పి, అతన్ని తడలోనే వదలివేసి తను మద్రాసుకు వెళ్ళిపోయాడు.'

అసలు విషయం యిది. తడ అనే ఊళ్ళో ట్రూమన్ తాలూకు యింజనీరింగు కంపెనీ ఒక పనిని ప్రారంభించబోతూ ఉన్నది వెళ్ళావా? అని ప్రశ్నించడానికి బదులు ట్రూమన్ 'డడకు' వెళ్ళావా? అని ప్రశ్నించాడు.

'తడ'కు బదులు 'డడ' అని ట్రూమన్ అనడానికి ఆ భాషలయొక్క లిపియే కారణం. 'తడ' అనే పదాన్ని యింగ్లీషులో 'టిఏడిఏ' అని వ్రాశారు. దాన్ని 'తడ' అనిగాని 'టడ' అనిగాని పలకవచ్చును' ట్రూమన్ మద్రాసు రాగానే తమిళం నేర్చుకోవడం ప్రారంభించాడు తమిళంలో 'ట' 'డ'లకు ఒకే అక్షరం ఉంది కాబట్టి 'ట'ను 'డ'గాకూడా పలకవచ్చును. అందుచేత ట్రూమన్ 'టడ'కు బదులు 'డడ' అన్నాడు. 'డడ'లో సంగీతం బాగా ఉన్నదని గోపాలన్ అవగానే అక్కడ యేదైనా మంచి క్లబ్బు ఉన్నదేమోనని ట్రూమన్ అనుకొన్నాడు.

ఈ విషయమంతా తరువాత గోపాలన్‌కు అర్థం అయింది. అతను తన స్వంత ఖర్చులమీద మద్రాసుకు తిరిగి వెళ్ళాడు; అక్కడ గోపాలన్ మిగిలిన ఉద్యోగస్థులనందర్ని కల్సుకొని జరిగిన సంగతినంతా వారికి వివరించాడు. అప్పుడు ఆ ఉద్యోగస్థులందరూ ట్రూమన్ను కల్సుకొని యీ విషయాన్ని అంతా చెప్పారు.

'తనను అవమానించే ఉద్దేశంతో గోపాలన్ యిలాగ చెయ్యలేదు. కేవలం దీనికంతటికీ యీ భాషల లిపియే కారణం అని ట్రూమన్ గ్రహించి, గోపాలన్‌కు తిరిగి ఉద్యోగం యిచ్చాడు' అని గోపాలి' వృత్తాంతాన్ని చూడామణి చెప్పాడు.

'ఇప్పటికే చాలా ఆలస్యం అయిందినీ అంటూ చంద్రలావు లేవగానే మిగిలిన యిద్దరూ ఆతన్ని అనుసరించారు. ●



# ఆంధ్రప్రజల జీవితంలో భయంకరమైన గాలివాన

సి. కనకాంబరరాజు



బుడమేరు పొంగుతో ట్రాఫిక్ ఆగిపోయిన దృశ్యం

మద్రాసులో తాగడానికి నీళ్ళులేవు ఉత్తర భారతంలో ఎండదెబ్బకు ప్రాణ నష్టం వాటిల్లుతున్నది. ఇది రోహిణీ కార్తె. ఆంధ్రలో రోళ్ళు పగలాలి!

సమయంకాని సమయంలో, పెళ్ళిళ్ళకు ముమ్మరంగా ముహూర్తాలున్న సుముహూర్తం చూసుకుని తుఫాను విజృంభించింది. తుఫాను సంబరంలో నదులు, ఏర్లు పొంగి పొర్లి ప్రజల జీవితంతో చెలగాట మాడాయి. ఫలితంగా ప్రాణనష్టం, ఆస్తి నష్టం అంతా ఇంతా కాదు!

**నూరుకోట్ల రూపాయల నష్టం**

1874 తర్వాత మళ్ళీ ఇంతకాలానికి ప్రజల దుర్భర జీవితాన్ని రుచి చూసింది తుఫాను. తుఫానువల్ల, వరదలవల్ల అయిదులక్షల ఎకరాలకు తీవ్రనష్టం సంభవించింది. నోటిదగ్గర ఆహారం నీళ్ల పాలయ్యింది. నూరుకోట్ల రూపాయల విలువగల పంట సర్వనాశనమై పోయింది. 50 లక్షల మంది నిరాశ్రయులవుతూ సర్వమూ పోగొట్టుకున్నారు. కేవలం గుంటూరుజిల్లాలో గ్రామాలకుగ్రామాలతో సహా 150000 ఇళ్లు నేలమట్టమయ్యాయట! ఇక, మరణాలు మొత్తం మీద 1000 పైచిలుకే అని లెక్కలు చెబుతున్నయి. పశువుల సంగతి సరేసరి. లెక్కకు మించినవి కొట్టుకు పోయాయి.

ఇదికాక, ప్రభుత్వానికి ఎంతో నష్టమయింది. రైల్వేలైన్లు తుడిచిపెట్టుకు పోయాయి. వంతెనలు కూలిపోయాయి. రోడ్లు గళ్ళు పడ్డాయి. కాలువలు దార్లు మళ్ళాయి. ఇవి మళ్ళీ చక్కపడడానికి ఎంతకాలం పడుతుందో, ఏమో!

**నాల్గురోజుల్లో ఏడాది వర్షం!**

ఒక సంవత్సరంలో కురవాలసిన వర్షం తొందరపడి నాల్గురోజుల్లో కురిసేసింది. వరదనీరు ఘెరావ్‌కి నేనుకూడా గురి అవుతానని ముందుగా ఎలా ఊహించగల్గుతాను?

బుడమేరు పొంగింది. ఆ పొంగులో కట్టలు తెంచుకుంది. అంతే, ఏలూరు విజయవాడలమధ్య ట్రాఫిక్ బంద్!

బుడమేరు పాలబడ్డ రైతుల దీనగాథ చెప్ప నలవికాదు. హృదయ విదారకమైన కథలు ఎన్నో వినిపించాయి.

దాళ్వాపంట పూర్తిగా నష్టపోయింది. కోతలు మొదలుపెట్టిన కాలం. కొంత వరి పనలమీద. మోపు యకట్టివుంది. మరికొందరు కుప్పలు వేశారు. నూర్పులు నూర్చుతున్నవాళ్ళూ వున్నారు.

రెండునిలువుల ప్రవాహంలో ఇదంతా కొట్టుకుపోయింది. వరి కుప్పలకు కుప్పలు తేలివస్తుంటే చూడ్డానికి వినోదమేలా



నందిగామ తాలూకా మున్నేరు పొంగులో తేలిన శవాలు-ఒక భీకర దృశ్యం

అవుతుంది.

**నిప్పులుచెరిగే ఎండలు**

తుఫాను వెలియగానే ఎండలు ఆరంభమయ్యాయి ఈ ఎండలు రాను రాను తీవ్రరూపం ధరించి నిప్పులు చెరిగాయి

'ఈ ఎండలే లేకపోతే మేమంతా ఈ వరదల్లో బలవంతాన ప్రాణం తీసుకోవలసి వచ్చేది' అన్నాడొకరైతు.

నీరు తగ్గుముఖం పట్టింది చెట్లల్లోను, పొదల్లోను, అడ్డమయినచోటల్లా చిక్కుకుపోయిన పంటని నీళ్లు తీసిన రోడ్లమీదకి చేరవేసుకున్నారు రైతులు రోడ్లు సిమెంటు రోడ్లనిపించలేదు. వరి పంటతో వేసిన రోడ్లనిపించాయి! మొలకలొచ్చినపంట అది!

'దీనివల్ల లాభమేమిటీ!' అని అడిగినప్పుడు ఒకరైతు ఇచ్చిన సమాధానం ఎంతో ఆశ్చర్యపరచింది.

**తవుడుకోసం ధాన్యం గింజలు!**

'తవుడు బస్తా పదిహేను రూపాయలు అమ్ముతున్నది బాబూ, దేవుడు కరుణించి ఇందులో ఏమైనా ధాన్యంగింజలు దక్కితే సరే,—లేకపోతే తవుడుకింద ఆడించుకోవాలి. తుఫానుపుణ్యమా అని పశుగ్రాసం కూడా పాడైపోయిందిగా' అని వాపోయాడతను.

**ఎకరానికి వెయ్యిరూపాయిల నష్టం**

ఎకరానికి మూడు నుంచి నాలుగు వందలు పెట్టుబడి పెట్టారట రైతులు. ఫలసాయంతో ఇబ్బందులు తీరతాయని చాతకపు పక్షుల్లా కూర్చున్నారు. రాబడి పోతే పోయే పెట్టుబడి కూడా గంగపాలయిందని గోల పెట్టారు. ఎకరానికి వెయ్యి రూపాయిలు నష్టపోయామని రైతుల బాధ. ఈ నష్టం వచ్చే సారవా పంట మీద కూడా వుంటుందని వారి ఏకాభిప్రాయం.

ప్రయాణ సౌకర్యాల గురించి వేరే చెప్పక్కర్లేదు. బస్సుల రాకపోకలు ఆగిపోయాయి. రైళ్లు నిలిచిపోయాయి. వ్యాపారం స్తంభించిపోయింది. ప్రయాణీకులు ఏకాంతవాసం చేయాల్సి వచ్చింది.

ఎండలు అంత తీవ్రంగా వున్నా, తుఫాను తగ్గిన వారంరోజుల దాకా బస్సులు మామూలుగా తిరగలేదు. రైళ్లు ఈవ్యాసం రాసేవరకూ పుంజుకోనేలేదు.

**ప్రయాణీకుల ఇక్కట్లు**

రైళ్లు లేని కారణంగా దూరాలకు వెళ్లవలసిన వాళ్లు విధిలేక బస్సుల మీద ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. బస్సుల మీద దూరప్రయాణం మాటలు కాదు. అదీ, ఆర్టీసి బస్సుల్ని నమ్ముకుంటే చేరలేమని తెలుసు. ప్రయాణం ఇబ్బంది అయినా ప్రయివేటు బస్సులకు మళ్లక తప్పింది కాదు.

ఆయితే, బస్సు ప్రయాణం— తుఫానుకు వరదలకి గురి అయిన ప్రదేశాల్ని తరచి చూడ్డానికి బాగా అవకాశం కల్పించింది. గుంటూరు జిల్లాలో పడ్డ ఒక పెద్దగండి దాటడానికి ప్రాణాలు అరచేతుల్లోనే పెట్టుకున్నారు ప్రయాణికులు దారి పొడుగునా ఒక వింత దుర్వాసన గమ్యస్థానాన్ని చేరుకొని—కళ్లు చెదర్చిన దృశ్యాల వల్లనైతేనేం, అన్నిరకాల గాలులూ పీల్చిన కారణంగా అయితేనేం ఆరోగ్యం చెడగొట్టుకోక తప్పిందికాదు

విజ్ఞానాభివృద్ధి చంద్రుని చేరుకుంటున్నా, ప్రకృతి శక్తి నెదిరించడానికి మానవుడు శక్తిఅశక్తుడని ఈ తుఫాను రూఢి చేసింది!

ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో ప్రభుత్వం ఆదుకుంటూనే వుంటుంది ఎంత చేసినా తీరని నష్టం వాటిల్లింది ప్రజల చేయూత కూడా తప్పక కావాలి సాటి బాధిత ప్రజల దుస్థితిని గమనించి తోచినరీతిగాసాయంచెయ్యడంమనతక్షణకర్తవ్యం ●




**ఎస్. జె, హైదరాబాదు**

మీకు రోజూ ఎన్నిగంటలు తీరిక సమయం దొరుకుతుంది? ఆ సమయంలో మీరేం చేస్తుంటారు?

పనే లేనివారికి తీరికకేం కొదవ సోదరీ, వాకంతా తీరికే కబుర్లు చెప్తూ, పుస్తకాలూ గట్రా చదువుతూ రోజూ టైము సరిపోవడం లేదని ఒకటే యిబ్బంది పడిపోతూ ఉంటాను. దీనికేమైనా విరుగుడుందా?

**ఎస్. పి, జగిత్యాల**

భార్యాభర్తలమధ్య తగాయిదాలు వారి సంతానపు జీవితాలమీద దెబ్బతీస్తాయి అంటారు. ఇది ఎంతవరకు నిజం?

పూర్తిగాను. ఇన్‌సెక్యూరిటీ, అభిమానం కొరవడ్డం, అన్నీ పిల్లల జీవితాల పునాదులను కదలించి వేస్తాయి. సంఘంలో యీ బాల నేరస్థులు, ఈ వ్యర్థులు అంతా ఎక్కడ తయారవుతున్నారంటారు— చక్కని వాతావరణము లేని కొంపల్లోంచే

**ఆర్. ఎస్, జగిత్యాల**

ప్రస్తుత ప్రపంచంలో మానవుడు తన జీవితంయొక్క లక్ష్యం అర్థం మరిచిపోయి, తన జీవనాన్ని సాగిస్తున్నాడంటే మీరేమంటారు?'

తప్పేం చెయ్యడం లేదంటాను.

**వి వి ఆర్. ఎమ్, బొంబాయి**

రామలక్ష్మిగారూ కార్టూనులు కథలు బుక్‌పోస్టులో పంపినా ఫరవాలేదని జవాబిచ్చారు చేతివ్రాత కాగితాలు బుక్‌పోస్టులో పంపడానికి వీలులేదనుకుంటాను.

చిత్తం, పంపించవచ్చు— జతగా ఉత్తరం రాయకపోతే ప్రెస్ వ్రాతప్రతి అని రాస్తే చాలు.

**ఎస్. ఎస్. కె, చిక్కోలి**

అక్కయ్యా అడుగుతున్నందుకు క్షమించండి— కులమత భేదాలపై మీ అభిప్రాయం ఏమిటి?

అని అడగడం తప్పని తెలిసి క్షమించమన్నారు— అదే సంతోషంగా ఉందినాకు... కులమతాల ప్రసక్తే లేదు— మాయింటా వంటా.

**పి. ఎస్. ఆర్, సింద్రీ**

రామలక్ష్మిగారూ, మీ నవలలు నాకు నచ్చకపోయినా మీ నిజాయితీ నచ్చుతుందండి...

థ్యాంక్స్.

**ఎమ్. జె. ఆర్, బొబ్బిలి**

ప్రశ్నలు రాత్రివేళ నక్షత్రాలు జవాబులు తామరాకుపై నీటి బిందువులు, మరి మీరు?

అలవోకగా నీటి బిందువు కింద పడుతుందా పడదా అని ఆడించే చిరుగాలినా? చిరు కెరటాలనా?

**బి, ఆర్. డి, ఒంగోలు**

మీరెంతవరకు చదువుకున్నారన్న ప్రశ్నకు మీరు సరిగా జవాబివ్వడంలేదు. ఏం చదువుకున్నారో చెప్పండి.

చిన్నప్పుడో బడిలో చదువు కున్నాను. అక్కడే నాకూ సూర్యకాంతానికీ స్నేహం. ఇంక చదువేమిటి? ఆగిపోయింది. మా అత్తయ్య (పాపం చచ్చి స్వర్గం చేరింది) అక్షరాలన్నీ వస్తే మా అమ్మాయికి ప్రమోషనివ్వరేం? అంటూ దెబ్బలాడేది. ఓ సారి నే రాసిన బళ్ళు చూపారు, కబోలు...చదువు మానిపించింది.! యింట్లోనే చెప్పాలని. 'దీని కక్షరాలు రావు. మాటలు నేర్పండి.' అని సలహాయిచ్చాడు మా పెద్ద మావయ్య... అందుకే చదువుకోలేదు— మాటలే వచ్చును—కాని యీ సంగతెలా చెప్పను రమాదేవిగారూ, అంచేత అలా డొంక తిరుగుడు సమాధానా లిస్తాను...క్షమించరూ?

**డి. యు. డి, శ్రీకాకులం**

ప్రేమించిన వ్యక్తి శత్రువైతే ఆ స్త్రీ ఏమి చేయకలదు?

అనుభవించ కలదు.

**ఎస్. డి, సికిందరాబాద్**

మీ ఫోటో చూసి మూడువారాలు ఆంధ్రపత్రిక కొనలేదు ... ఒకమ్మాయి ఉంది...

క్షమించు సత్యదేవా, నీవు కోరిన సలహా మరి ఎవరి చేత చదివించు కుంటావు? పత్రిక కొనక పోతే అంచేత ఇవ్వడం లేదు

**ఎ. వి ఎస్. ఆర్, మునగపాక**

ఆడదాని వయస్సు మగవాడి జీతం అడగకూడదంటూ రెందుచేత ?

ఎందుకేమిటి ఒకటి ఎక్కువయితేనూ రెండోది తక్కువ అయితేనూ సిగ్గు పడవలసి వస్తుంది కనుక!

**జి. ఎస్. కె, హిందూపురం**

ఇప్పుడు సంఘంలో స్త్రీకి ఎటువంటి స్థానమున్నది.

సముచిత స్థానమే కలదు సోదరీ!

**కె. ఎస్, చోడవరం**

బాధ్యతలు భయపెడుతున్నాయి.

భయం వేసే పని ఎప్పుడూ ముందుగా చేసేయడమే దానికి విరుగుడు.

**జె. ఆర్. ఆర్, హైదరాబాదు**

ఈమధ్య మీరు మావూరు సంస్థపై యిచ్చిన సమాధానం అన్యాయంగా ఉంది.

నిజం ఎప్పుడూ నిప్పులాంటిది రామారావుగారూ, అది కాలుస్తుంది. లోగడ ఒక చిత్రకళా ప్రదర్శనం స్పాన్సర్ చేసి, ఆహ్వానాలకి స్టాంపు ఖర్చు నుంచి ముఖ్యమంత్రి గారికి వేసిన దండ కర్చుదాకా డబ్బులు వసూలు చేశారు వారు. అప్పుడు 'వారు డబ్బు యిస్తే కార్యక్రమాలు ఏర్పాటు చేసి పెడతారన్న' నిజం చెప్పడం తప్పు కాదే.

**సిహెచ్. బి. ఆర్, రాజమండ్రి**

నాకు పెళ్లిచేసుకోవడం యిష్టంలేదు. అసలెందుకీ వివాహం?

బాగుంది.....'వదిలేయడానికి ఓ భార్యైనా లేని వాణ్ణి' అనుకుంటారు పెళ్లి చేసు కోండి. కనీసం ఐ. పి. పడేద్దామన్నా అస్తంతా పెట్టడానికో భార్య ఉండాలి.

**ఎస్. వి, గంగావతి**

'మనుషులు దూరమైతే మనసులు దగ్గరవుతాయి' కాని మన జీవితంలో ఈమాటకి విలువ లేకపోతున్నది. కారణం?

ఊరుకెళ్లి కూడా ఉత్తరాల్లో సాధిస్తున్నారా ఏం?...పది రోజులు దూరంగా ఉంటే మనిషికి మనిషి విలువ తెలిసి రావడమే కాదు—ఆత్మీయత తప్పక పెరుగుతుంది.

**పి. బి. జి. మొలగవల్లి**

నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్యమైన క్లిష్ట సమస్య ఏమిటి? మీ సలహా ఏమిటి?

నా సలహా చేదుగా ఉండవచ్చు గాని పని చేయవచ్చు. కొన్నాళ్లపాటు 'వనితాలోకాన్ని' మరచి మన గొడవేదో మనం పడ్డమే. 'ఇంటగెలిచి రచ్చ గెలువు' అన్న నినాదం లేవనెత్తాలి మహిళలు అప్పుడేమైనా ప్రయోజనం ఉంటుంది



# అగ్నిపుష్పం

డా॥ అక్కిరాజు రమాపతిరావు

నాకేమిటో ఎప్పుడూ అసంతృప్తి వుంటుంది. అది మనస్సు స్వభావమో, లేక చేతకానితనం వలన కలిగిన అమాయ, తద్వారా అసంతృప్తో మరి. 'నిజంగా మాకేవీ సమస్యలు లేవు. సుఖంగా, తృప్తిగా పితుకుతున్న పాలమీది నురగ పైపైకి పొంగుతున్నట్లుగా బ్రతుకుతున్నామని ఎవరయినా అనగలరా? ఒకవేళ అన్నప్పటికీ అందులో కల్తీ లేని నిజముంటుందా! అసలలాంటి జీవితాలుంటాయా?' అన్నదే నా సమస్య.

నేను నిరాశావాదినంటే నేనొప్పుకోను. కాని లేనిదానిని వున్నట్లు తలచుకొని—మనస్సుని, అనుభూతిని నిద్రపుచ్చి అటూ యిటూ పరిగెత్తమంటే మాత్రం పరిగెత్తలేను. వెనక ఎప్పుడో చాలా రోజుల క్రితం నాక చిన్న నీతికథ లాంటిది చదివాను. దాని సారాంశం 'ఏడుపుగొట్టు మొహానికి హేతువక్కరలేదు. ఒకింట్లో వో పుట్టుగుడ్డి వున్నాడు. పొద్దున లేచినది మొదలు సాయంకాలం వరకూ, వాడు ములుగుతూనే వుంటాడు. తనను గుడ్డివాణ్ణి చేసి, ఎవరూ తనని సరిగా చూడడం లేదనీ, నిర్లక్ష్యం చేస్తున్నారనీ వాడు రోజుతూ వుండేవాడు. ప్రతిరోజూ తిండిదగ్గర తిరణాల చేసేవాడు. నాకళ్ళు కనపడవుగా, మీరేం చేసుకుని ఏంతెంత తింటున్నారో, నాకుమాత్రం వో కబళం మొహాన కొడుతున్నారు—అని గోల. ఇంట్లోవాళ్ళు విసిగి వేసారిపోయి, వో రోజు వో గొర్రెను మొత్తం వండి, వార్చి, వాడిముందు వడ్డించారు. చేతితో తన వడ్డన పదార్థమంతా తడిమి చూసుకుని, వొక్క నిముషం పొంగిపోయాడు. గుడ్డికళ్ళుకూడా వెలగబోయినయ్. కాని ఏం లాభం, ఇంతలోనే వొక్క నిముషం దీర్ఘంగా ఆలోచించినట్లు నిట్టూర్చి వాడన్నాడట—బాగుంది, బాగుంది. ఇవాళ ఏమన్నా పండగా పబ్బమో. నా వంతే యింత వచ్చిందే — మీరంతా ఏంతెంత వడ్డించుకున్నారో—నేనేం పాపం చేశానో, నేను గుడ్డివాణ్ణి—అని మళ్ళీ మామూలు పాట పాడుతూ బుడిబుడి దుఃఖం మొదలు పెట్టాడు. ఇంట్లోవాళ్ళు ఏమనుకున్నారో ఏమైపోయారో మనకక్కర్లేదు.

ఈకథలోని గుడ్డివాడిలాంటివాణ్ణేమీ కాను నేను. మీరు పొరపాటున అట్లా అనుకుంటారేమో, నాకు జీవితం పట్ల గొప్ప ఆదరముంది. వాంఛ ఉన్నది. మరీ ఇరుకైన మనస్సేమీ కాదు. అసూయ ఏమాత్రం లేదనను కానీ, దానివలన ఎవరికీ అపకారం లేదు. నాకు వుండవచ్చును. అది వేరుమాట.

అందమైన వేసవికాలపు సాయంకాలాలు బాగా జన సమ్మర్దం గల నగరపు నడివీధుల కూడలి వద్ద నిలుచుంటే నాకు అసంతృప్తి కలుగుతుంది. మరేం లేదు. వీపుమీద రొమ్ములను వొత్తుతూ, వయ్యట జుంయ్‌మని జెండా కొసలా ఎగురుతూ వుంటే, రకరకాల కేశాలంకరణలతో స్కూటర్లపైన పోయే జంటలను చూసీ, అంతులేని జనసందోహాన్ని చూసి, ఏమిటో కొంప ముంచుకొని పోయేట్లు, వాళ్ళు ప్రదర్శించే వేగాన్ని చూసి, వాళ్ళ చైతన్యాన్ని చూసీ, ఉత్సాహోద్రేకాలను తలచుకొనీ, నాకేమిటో

వింతగా వుంటుంది. నన్ను నేను నిశితంగా పరీక్షించుకుంటాను అసూయా, అని కాదు. మరి ఏమిటో తెలీదు. అట్లానే శీతకాలపు మనోహరమైన ఉదయవేళల వీధిలో నిల్చుంటే కూరలమ్మేవాళ్ళవద్దనుంచీ, ముగ్గులు పెట్టుకుని పరవశించిపోయే కన్నెపిల్లలవరకూ, నా దృష్టిని ఆకర్షించటమేకాక, జీవితంలో వీళ్ళకింత ఉత్సాహం, ఆశా, ఉద్రేకాలూ, అల్పసంతృప్తులూ ఏవిధంగా కలుగుతున్నాయన్న ప్రశ్న నా మనస్సులో మెదలటానికీ, అలా నాకు జీవితంలో చిక్కని మమతాబంధం ఏర్పడకపోవటానికి కారణాలను వెదుకుతూ, అసంతృప్తితో ఆలోచిస్తూ వుంటాను.

అప్పుడు బద్ధకంగా నిద్రలేచి నాకు సహజమైన ఆలోచనలలో పడిపోయాను. అసలన్నిరకాల అర్థం పర్థంలేని ఆలోచనలు, నా మనస్సు నిండా నిండటానికి కారణం ఈశ్వరి. నిన్నసాయంకాలం హఠాత్తుగా ఏమాత్రం అనుకోకుండా ఆమెను సింపోజియంలో చూశాను. అప్పుడే నా కాళ్ళకు వణుకు, కళ్ళకు మసక ప్రారంభమైనాయి. ఆవిడ చిరునవ్వు నన్ను చీల్చివేస్తుంది. ఆమె అంటేనే నాకు భయం. ఎందుకొచ్చిందో మరి. ఏమిటి సంబంధమో ఆమెనుగూర్చి తలచుకుంటూ వుంటే ఆమె వొక అగ్నిపుష్పం అనిపిస్తూ వుంటుంది నాకు.

నగరంలో మేథమేటికల్ కాన్ఫరెన్సులో పాల్గొనటానికి నేను వచ్చాను. శ్రీమతి గిరిజాప్రియవిభూతి స్మారక పాఠశాలలో మాకు బస ఏర్పాటుచేశారు. అన్నివైపులకు పోవటానికీ, పెద్ద పెద్ద హోటళ్ళకూ, ప్రధానమైన రథ్యలకూ, దాపుగా వున్న పెద్దమేడలు ఇది. ఇప్పుడు వేసవికాలపు శెలవులు కావటం మూలాన మాకు బస ఏర్పాట్లు చేయటానికి వీలైంది.

నగరంలోని మధ్యతరగతి కుటుంబాల విత్తావసరాలు, గృహవసతి అన్న విషయంపై నేను పేపర్ ప్రెజెంట్ చేయటమూ, కడమ మూడురోజులూ ఇట్లానే వివిధ విషయాలపై, సమర్థులైనవాళ్ళు చదివిన విషయాలపై చర్చాగోష్ఠుల్లో పాల్గొనటమూ, ఇక్కడ నా పని.

ఈశ్వరి నేను యూనివర్శిటీలో మేథమేటికల్ ఎకనమిక్స్ ఎమ్. ఏ చదువుతూ వుండగా, నా క్లాస్‌మేట్‌గా వుండేది. అయితే ఆమె సబ్జక్ట్ ప్యూర్ మేథమాటిక్స్. స్టాటిస్టిక్స్ క్లాసుల్లోనూ, ఇంకా కొన్నిక్లాసుల్లోనూ మేము కలుస్తూ వుండేవాళ్ళం. గత నాలుగేళ్ళుగా మేమీ మధ్య కలుసుకోలేదు. ఈశ్వరి గురించి ఏం చెప్పాలి—గొప్పఆకర్షణగల నిండైన విగ్రహం, కళకళలాడే, తళతళలాడే వొళ్ళూ, కళ్ళూ. ఆమె కెవరైనా లెక్కలేదు. రాకెట్‌లాటి తత్వం.

చదువుకునే రోజుల్లో ఆమె అందరినీ హడలుకొడుతూ వుండేది. చదువైతే రాదని నాకు బాగా తెలుసు. అందుకే ఆమె థర్డ్‌క్లాసులో బయటపడటమే గొప్ప గగనమైపోయింది. చదువుకునే రోజుల్లో నేను ఫలాని సబ్జక్ట్‌పై రిసెర్చి చేస్తాననీ, అదయిపోతా, ఇదయిపోతానని, గొప్పగా కోతలూ అనీ కోసేది. అయితే వొకవిషయం చెప్పాలి. అరుదైన యోగం అది. అద్భుతమైన కంఠస్వరం ఈశ్వరిది. వినేవాళ్ళు తన్మయులై పోయేట్లు పాటలు పాడేది. యూనివర్శిటీలో ఏ సంబంధమైన సమావేశాలూ, సభలూ, ఉత్సవాలూ జరిగినా, ఈశ్వరిపాటలు వొక 'హైలైట్'. అందుకే ఈశ్వరి అంటే అందరూ పడి చచ్చే వాళ్ళు.

ఆమె చాలా డబ్బుగడించిన, ఇంకా గడిస్తున్న డాక్టరుగారి పెద్దమ్మాయి. ఆ డాక్టరుగారు ముందు మిలటరీలో పనిచేసి,...తరువాత మళ్ళా ఈ ప్రాంతాలకు వచ్చి లక్షలు లక్షలు సంపాదించాడని చెప్పుకుంటారు.

నన్ను పసిపిల్లాడిలాగా ట్రీట్ చేయటం, నాకు చాలా కసిసీ, ఉడుకుబోతుతనాన్నీ ఆమెపట్ల కలిగించక పోలేదు. ఎప్పుడైనా నన్ను మెచ్చుకునే కళ్ళతో చూసి, పసిపిల్లాడి చెక్కిలిపైన మృదువుగా కొట్టే ధోరణిని మాటల్లో కనపరచేది. నేను యూనివర్శిటీ-ఫస్ట్ సంపాదించినప్పుడైనా, ప్రాజ్ఞుణ్ణీ, పురుషుణ్ణీ ఈమె గుర్తిస్తుందో లేదో అన్న ఉద్రేకం కలిగేది నాకు. నాకు ఈశ్వరి అంటే వల్లమాలిన ఆకర్షణ వుండేది. దాన్ని ప్రేమంటే నాకు అభ్యంతరం లేదు. కాని 'ఈశ్వరి కెట్లా చెప్పగలనా మాట—అని మూడు సంవత్సరాలు రోజూ ఆలోచించాను. అటు తరువాత గవర్నమెంటు సర్వీసులో చేరిపోయి ఆ ప్రాంతాన్ని విడిచిపెట్టాను. ఆ చదువుకునే రోజుల్లోనే ఈశ్వరిని గూర్చి చిత్ర విచిత్రమైన కథలు ప్రచారంలో వుండేవి. ఎవరిష్టంవచ్చినట్లు వాళ్ళు చెప్పుకునేవారు. ఇటువంటి కట్టుకథల్లో అసూయా, మాత్సర్యం ఎక్కువ భాగాలని నాకూ తెలుసు. కాని, ఈశ్వరి గూర్చి వచ్చిన వాదులన్నీ ఆ కోవలోనివే కావు.

ఈశ్వరికీ, రామచంద్రరావుకీ సంబంధం వుంటుందని నాకు నమ్మకం. కాని నా బాచ్‌లో ఎవ్వరూ నేను ప్రేమించినంతగా ఈశ్వరిని ప్రేమించి వుండరని నా విశ్వాసం. ఆ రకరకాల కట్టుకథలను, గడ్డునిజాలను, రంపపుకోతలాగా భరించేవాణ్ణి.

అటుతరువాత ప్రధానమైన క్లబ్బుల సహాయార్థం ఆమె పాడటాలూ, రేడియోలో పాడటం, పత్రికల్లో ఫొటోలు, గమనిస్తూ వచ్చాను. తరువాత నాకు పెండ్లి అయింది. ఒకరోజున హఠాత్తుగా, మెరుపు మెరసినంతకాలం, నేనూ నా ఆవిడా, సిటీబస్ పట్టుకునే సన్నాహంలో వుండగా, ఈశ్వరి చూపింది. నా మనస్సెందుకో కలుక్కుమన్నా, ఆవిడ పలకరించటం, నేను మాట్లాడవలసి రావటం, తప్పిపోయింది కదా, అని సంతోషించాను. అటు తరువాత ఎప్పుడో వొకసారి నా స్నేహితుడి బలవంతంమీద కస్తూర్బా హాలులో 'మల్లిక పెళ్ళి' అన్న గేయరూపక ప్రదర్శనకు వెళ్ళాను. ఈ స్నేహితుడికీ రచయితగారు ప్రాణస్నేహితుడట. కాంప్లిమెంటరీ టిక్కెట్లు చాలా మిగిలిపోయాయి. హాలంతా మరీ బోసిగా వుండటం బావుండదనో ఏమో, పనిగట్టుకొని, టాక్సీతెచ్చి ఇంటిముందుంచి, నానా బలవంతంచేసి ఈడ్చుకొని వచ్చాడు. రంగులైట్ల గాబరా, మధురమైన గాత్రం. ఏదో పరవాలేదా నాటకప్రదర్శన. నేపథ్యగాయని ఎవరో నాకు తెలుసు. ప్రదర్శన అయిపోయిన తరువాతకూడా మా శ్రీమతి గారు నన్ను విడిచిపెట్టలేదు. రచయితకు పరిచయం చేస్తానంటూ బరబరా లాక్కుపోయారు. ఆ రచయితగారిముందు నిలబడి,

తెప్పు చివరి గులాబిపూవులా వూగిపోతూ, తన అందమైన పలువరసలాంటి మల్లెపూలు పోయిస్తున్నది ఈశ్వరి. మా శ్రీపతి నన్ను ఈశ్వరికికూడా పరిచయం చేశారు. నా కళ్ళు సోలిపోతున్నాయి. ఒళ్ళు తూలిపోతున్నాది.

నావైపు అలవోకగానూ, నిరాదరంగానూ చూసి 'అయితే మాకెవరికీ తెలీకుండానే పెళ్ళి చేసుకున్నారన్నమాట. భలేవారండీ. పిలిస్తే మేమంతా వస్తామని భయంకాబోలు' అన్నది. రచయితా, నా మిత్రుడూ తెల్ల బోయారు. 'మరింకేమిటండీ, అంత బెట్టు చేశారు పాటకానికి రావటానికి. ఈశ్వరి గారు మీకు బాగా తెలుసునన్నమాట. ఆమె పాట వినేందుకైనా రావచ్చునే' అని శ్రీపతి ఆమెను పొగిడాడు.

'బావుందండోయ్. నేనిక్కడ కనపడతానని, పాడతానని తెలిస్తే బ్రహ్మరుద్రులు దిగివచ్చినా, ఆయన వచ్చేవారు కాదు' అని ముదలకించింది; ఈశ్వరి.

నేను నీళ్ళు నమిలాను. నా పెళ్ళి అవ్యవధానంగా, జరిగిందనీ, శుభలేఖలు పంపే అవకాశమూ లేకపోయిందనీ, సంజాయిషీగా, చిన్నపిల్లాడిలాగా, ఏవేవిటో చెప్పాను. నిజంగా వ్యవధి వున్నా వొక్కనాటికీ ఈశ్వరికి నేను పంపను. అంతేగాక, ఈశ్వరి పెళ్ళి మా ఇంటిముందే జరిగినా నేను వెళ్ళను.

'అందరూ పాడేపాటే అది. ఇవాళ చూశాను రేపు నిశ్చయమైంది. ఎల్లుండి పెళ్ళాడాను అటు తరువాత మా పెద్దాడు.

# అగ్నిపుష్పం

అప్పైన మాపాప. పిల్లలెందరేమిటో?' అని నవ్వింది.

ఈ ఈశ్వరి పాడైతే! నాకేడుపు వచ్చింది.

ఇంకా, అది ఏదో చెప్పబోతుంటే, 'వచ్చేనెలలో ఆ శుభవార్త తెలుస్తుంది. మనమంతా పార్టీకై ఇప్పుడ్నుంచే రెడీగా వుందాము' అన్నారు శ్రీపతి.

'గుడ్ న్యూస్' ఇంకా తల ఎత్తరేమండీ మీరు. ఎప్పుడూ తలఎత్తని వీరులేనా మీరు' అని కిలకిల నవ్వింది ఈశ్వరి. ఆ తరువాత మళ్ళీ మేం కలుసుకోలేదు.

నిన్న సాయంకాలం మళ్ళీ చూశాను. స్లీవ్స్ వున్నాయా లేవా అనిపించే పొట్టి జాకెట్‌లో వీపు చాలాభాగం కనిపిస్తూ వుంది. కొప్పు అందంగా చుట్టి అర్ధ చంద్రాకారంగా పూలు తురిమింది. తుర్రున తూనీగలాగా, అటూ ఇటూ హడావిడిగా కలయతిరుగుతున్నది. ఆమెను చూడగానే నా కాళ్ళలో వొణుకూ, నా గుండెలు వేగంగా కొట్టుకోవటం, నాలికమీద తడి ఆరిపోవటం, నీరసం లాంటది రావటం. నేను పేపర్ చాలా బాగా రాశాననీ, విన్నవాళ్ళందరూ మెచ్చుకుంటారనీ, నిర్భయంగా నిస్సంకోచంగా ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెపుదామనీ వచ్చిన నేను నీరుకారిపోయాను. మొట్ట మొదలే నేను చదవాలి. ఆపేపరు కాపా

వుందని అక్కడనుంచి రూమ్‌కు వచ్చేశాను. దారిలో నన్ను ఆటకాయించి ఈశ్వరి కాఫీ, కిళ్ళీ, అవీ ఇప్పించింది, అతిథులందరికీ, అవి అందించే ఏర్పాటు ఆమెదేమో మరి. 'నా పేపర్ ఎలాగుంది?' అన్నాను నేను ధైర్యం తెచ్చుకుని. దానికి సమాధానం చెప్పదు. అక్కడ వుమెన్స్ కాలేజీలో ఆమెకు లెక్చరర్ ఉద్యోగం ఇచ్చారుట. అందుకే తానూ కాన్ఫరెన్స్‌కి వచ్చిందట. ఈ 'మెస్సింగ్' వ్యవహారాలు చూసుకోవటంతో సతమతమైపోతూ వున్నదట. మళ్ళీ రూముకు వచ్చి, కొన్ని సంగతులు మాట్లాడతాను, అన్నది. నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అక్కడనుండి వచ్చి రూములో పడ్డాను.

వాస్తవ విషయాలన్నీ వదిలేసి, నా ఆలోచనలు ఊహల నాశ్రయించుకొని విహరిస్తాయి 'ఈశ్వరి'ని చూచినప్పుడూ, తలచినప్పుడూ. ఈశ్వరిని నేను పెళ్ళి చేసుకున్నాను. ఆమె సుకుమారంగా నా తల లోకి వేళ్ళు జొనిపి, భావగర్భితంగా పాటలు పాడుతూవుంటే ఆమె వొళ్ళో తల ఆన్చి ఆమె ముఖంలోకి తదేకంగా చూస్తూ వుంటాను. నేను కాలేజీకి వెళ్ళేముందు సుకుమారమైన ఆ చేతులను చెంపకాన్చుకుని ముద్దు పెట్టుకుంటాను. ఆమె నా తలవంచి పెదాలమీద లేత ముద్దు పెడుతుంది. కాని యీ ఆలోచనలు నాకు సంతోషంకన్నా గాఢమైన దుఃఖాన్ని, భరించలేని అసంతృప్తినే కలగజేస్తాయి. ఆలోచనల కేదోవిధంగా అంతరాయం కలుగుతుంది. మళ్ళీ వాస్తవిక ప్రపంచం లోకి వచ్చేస్తాను.

మధ్యాహ్నం భోజనాలదగ్గర ఈశ్వరి కన్పించలేదు. నాకు చాలా విసుగూ, అసహ్యమూ కలిగింది; ఆమె ఉత్సాహోద్రేకాలు తలచుకొని. ప్రపంచంలో ఎంత అన్యాయమైనా, జరగటానికి అవకాశముంది. అసలు అన్యాయమే చేయనివాడెవరూ వుండనే వుండరు. ఈశ్వరికి ఉద్యోగం రావట మేమిటి.

ఆమె అసలు సరిగ్గా చదువుకోనే లేదు. అథవా డిగ్రీ అయినా, పోనీ మంచిది సంపాదించిందా అంటే థర్డ్‌క్లాస్. ఆమె కెట్లా ఉద్యోగం వచ్చింది. సంఘంలో



జరుగుతున్న భూపోరాటాలూ, కుతంత్రాలూ, దుర్మార్గం తలచుకుంటే, చేతగాని తనంతో తల బద్దలు కొట్టుకోవాలని పిస్తుంది. ఆ ఉద్యోగం ఈశ్వరికి ఎలా వచ్చిందో, ఎందరిముందు వెకిలినవ్వులు నవ్విందో, ఎవరు యీమెను చూసి మతి పోగొట్టుకున్నారో—అన్న తలపు వస్తే నాకు వొంటికి కారం రాచినట్లవుతుంది.

సాయంకాలం మళ్లీ ఆవేపు వెళ్లలేదు నేను, సీతాకోకచిలుకలాగా ఈశ్వరి సింగారించుకుని అటూ ఇటూ తిరుగుతూవుంటే చూడలేక. వీళ్లందరి కంట పడకుండా, పోయి 'టీ' తాగిరావాలని వుంది. కాని ఎవరైనా చూస్తే బావుండదు. అడగనూ అడగవచ్చును. అందుకని బద్ధకంగా పడుకుని వుండిపోయాను. ఐదుగంటలకు 'సెషన్' అయిపోతుంది, ఆతరువాత వో అరగంట ఆగి వెళ్లవచ్చును. అనుకుంటూ వుండగా, నా గదితలుపు కొట్టారెవరో, బహుశా 'బాయ్' టీ తెచ్చాడేమోనని సంతోషంతో నేను తలుపు తెరచాను. 'టీ' తెచ్చినమాట నిజమేకాని, 'బాయ్' వెనకాలే ఈశ్వరి కూడా నిలబడివుండటం నాకు తొట్రుపాటు కలిగింది. నాలోని సంచలనాన్ని చిక్కబట్టుకుంటూ ఆమెను లోనికాహ్వానించాను. ఏ మాత్రమూ, కొత్తా, బెరుకూ లేకుండా, ఆమె వెళ్లి నా 'కాట్' మీద కూచుంది. నేను కొంచెం దూరంగా కుర్చీ లాక్కుని కూచుండిపోయాను. 'బాయ్' ఇద్దరికీ 'టీ' ఇచ్చాడు. తరువాత వెళ్లిపోయాడు.

'ఈపూట మీరెందుకావేపుకు రాలేదు?

నేను కొంచెం ధైర్యం తెచ్చుకున్నాను

'అక్కడ మీరు కనపడతారేమోనని'

ఈశ్వరి అందంగా నవ్వింది. 'నన్ను చూస్తుంటనే న్నాప్రాణానికి హాయిగా వుంటుంది.'

'అలా అనలేను నేను.'

ఈశ్వరి కొంచెం విచారంగా చూసింది.

'క్రితంసారి మనం 'మల్లికపెళ్లి' నాటకంలో కలుసుకున్నాం. అబ్బాయా? అమ్మాయా మీకు.'

'అబ్బాయి' -

'నేనమ్మాయియి వుంటుందనుకున్నాను, పరే మీరే గొప్ప. పిహెచ్ డి. చేయలేదా?,

'ఇప్పుడవకాశం వుందని తెలిసింది. చేస్తున్నాను.'

'ఏందుకు మీరెప్పుడూ ఏదో ఆలోచనలతో, దేన్నో వెతుక్కుంటున్నట్లు వుంటారు'....

'.................'

'ఉత్సాహంగా వుండరు.'

వాక్యాంచెం చమత్కారంగా మాట్లాడాలనిపించింది. అదీ కాక ఈశ్వరితో ఇంత చనువుగా, ఇంత దగ్గరగా, మళ్లా మాట్లాడే అవకాశం వుంటుందో, వుండదో నాకు. నా మనస్సు ఆర్ద్రమై పోయింది. ప్రయోజనం వున్నా లేకపోయినా, నాకు ఈశ్వరిపట్ల ఎంత అనురాగ మున్నదో ఆమెకు చెప్పాలి. లేకపోతే ఆమె తెలుసుకునే అవకాశం వుండదు.

ఇట్లా ఉపోద్ఘాతం మొదలెట్టాను.

'లోకంలో ప్రతివ్యక్తి కూడా నాక తల్లిదండ్రుల పుట్టవలసి వుండటం, ఎంత యదార్థమో, ఎంత అగత్యమో, అట్లానే మున్ఫయ్యేళ్ల వయస్సున్న యువకుడికి ఒక ప్రేమకథ అంటూ వుండటం కూడా తప్పదు. అలాంటిదేదో అని ఎందుకనుకోరాదు ?'

ఈశ్వరి ఉలిక్కిపడి చూసింది. తాను నమ్మలేనుగాక నమ్మలేను అన్నట్లు వింతగా మొహం పెట్టింది. నేను చెప్పదలచుకున్నదేదో చెప్పనాకు గట్టి నిర్ణయానికే వచ్చాను మళ్లీ నాకీ అవకాశమైనా కలుగుతుందో కాదో

'ఇంకా ఏం ప్రేమకథ మీకు పెళ్లైంది. బాబుకూడా పుట్టాడు. అందుకని నీరసంగా వుంటారా?' అని ఊరడింపుగా నవ్వింది.

'నవ్వొద్దు.'

'నవ్వనులెండి. పోనీ జాలిపడుతున్నాను. చెప్పండి.' అని బుంగమూతి పెట్టింది.

'నేను చిన్నప్పటినుంచీ చాలా భయస్తుణ్ణి. అందుకని చాలా చైతన్యం వుండి, ఉత్సాహం ప్రదర్శించగల అమ్మాయి భాగ్యస్వామిగా వుండాలని కోరుకుంటూ వుండేవాణ్ణి. కాని ఆ అమ్మాయిని చేసుకోలేక పోయాను'

'నాకు నమ్మకంలేదు, కనీసం ఆ అమ్మాయికి యీ విషయం తెలిసైనా వుండదు. మీరా అమ్మాయితో మాట్లాడైనా వుండరు'

'నన్ను క్షమించండి. నేను చేసుకోవా

# అగ్ని పుష్పం

లను కున్నది మీ...నిన్నే' ఈశ్వరి రెప్పల్లార్చి విచిత్రంగా చూసింది. అలవోకగా నవ్వేసింది.

'ఒకవేళ నేను మీతో, ధైర్యం వేసి, సమయం చూసి, బలమంతా కూడగట్టుకుని చెప్పినా, ఇట్లానే నవ్వేసివుండే దానివవే, నే చెప్పడూ నీముందీమాట తేలేక పోయాను.'

ఈశ్వరిగొంతులో ఏదో విచిత్రమైన మార్పు వచ్చింది.

చూపులను పక్కకు తిప్పుకుని 'ఒక్కటి మాత్రం నిజం చెప్పండి. ఇక నేను మిమ్మల్నియేమీ అడగను.'

'అంటే యీ చెప్పింది నిజం కాదనా! నేనాశించినట్లే నా జీవితంలో జరిగివుంటే ఎంత బావుండేదో! నేను నిజం చెపుతున్నాను ఈశ్వరీ. త్రికరణశుద్ధిగా చెపుతున్నాను. నీకు తెలీదు. నిన్ను రోజూ వోసారి చూడటమే నాకు జీవిత సాఫల్యంగా వుండేది ఆరోజుల్లో. ఓ సారెందుకో ఫైనలియర్‌లో నువ్వు వారంరోజులు కాలేజీకి రాలేదు. మీ ఇంటిముందు కిళ్లీబడ్డీ పక్కనే నిలుచుని ఆ వారం రోజులూ మూడు గంటలసేపు తచ్చాడేవాణ్ణి. నీగురించి అసహ్యమైన విషయాలు, నీళ్లూ, వాళ్లూ మాట్లాడుతూ వుంటే, తల పగులగొట్టుకునో,




గుక్కెడు విషం తీసుకునో చచ్చిపోవాలనిపించేది. రెండేళ్లలో మేథమేటిక్స్ కంటే నిన్నే ఎక్కువ ఆరాధించాను నేను, కాని నేను పిరికివాణ్ణి. ఒకవేళ చేసుకునివుంటే ఎట్లావుండేదో కాని, అప్పటి నీచైతన్యోత్సాహాలకు, స్థాయికి నేను సమీపించలేనన్న భయంతో, వాయివిడిచి, పోనీ, ఏమయితే అదే అవుతుందన్న నిబ్బరంతోనైనా చెప్పలేకపోయాను. నిజం చెపుతున్నాను ఈశ్వరీ! జీవితంలో ఎక్కడ ఏది చూసి, నాకు ఆనందం కలిగినా, అసూయ కలిగినా, ఆర్ద్రతకలిగినా, నీవే గుర్తుకువస్తావు. ఇప్పుడీ మాటలుచెప్పి ఏమీ ప్రయోజనంలేదు'

ఈశ్వరికళ్లు తడికాగలవని నా ఊహకైనా అందని విషయమే.

మేము ఇట్లానే అడ్డదిడ్డంగా మాట్లాడుకున్నాము.

చీకటి ఎప్పుడుపడిందో తెలీదు.

వెళుతూ వెళుతూ నాచేతిని ప్రేమగా తనచేతిలోకి తీసుకుని, సుస్మితంగా నొక్కింది ఈశ్వరి.

'ఈసారి మా ఊరొచ్చి మా శ్రీమతినీ బాబునూ చూస్తాము'.

'తప్పకుండా' అన్నాను పొడిగా వున్నాయా మాటలు.

వెనక్కు తిరిగి చూసింది వెళుతూ.

ఆకళ్లు ప్రజ్జ్వలంగా వున్నాయి.

మళ్లీ వెనక్కు తిరిగి వచ్చింది ఏదో మరిచిపోయిన దానిలా.

ఒక్కనిముషం మౌనంగా నిల్చుంది.

మళ్లీ వెళుతూ; రేపు ఊరెళ్లి పోయే ముందు మా ఇంటికోసారి రాకూడదా, అన్నది. నేను మాట్లాడలేదు. ఈశ్వరి వెళ్లిపోయింది.

ఆ రాత్రంతా నాకు నిద్రపట్టలేదు.

ఈశ్వరిని తలచుకొని ఎందుకో చాలా చాలా జాలి కల్గింది.

విచిత్రమే కాకుండా అపహాస్యమైన సంగతి.

'నాగురించి ఎవరు జాలిపడేట్లు?' ●




సంసారమనేది మహాసముద్రం. ఆ సముద్రంలో పట్టి కొట్టు మిట్టాడుతున్న జనానికి వ్యాపకాలు ఎక్కువ. దైవాన్ని తలచుకోడానికయినా తీరిక ఉండదు. ఉదయాన్ని లేవగానే కాల్యకృత్యాలు తీర్చుకోవడంతో కొంతకాలం గడిచి పోతుంది. నాడు భోజనానికి కావలసిన పదార్థాలు సమకూర్చుకోవడంతో ఉద్యోగానికీ, ఇతర వృత్తికీ వెళ్ళే సమయం దగ్గరౌతుంది. ఏదో తొందరగా స్నానం చేసి, రెండు మెతుకులు నోట్లో వేసుకుని గాని, ఫలాహారం చేసిగాని బయలుదేరవలసి వస్తుంది రాత్రి భోజనం అయే వరకూ తీరిక ఉండదు. పగలంతా పరిశ్రమించడం వల్ల అలసట! భోజనానంతరం నిద్రదేవత ఆవేశిస్తుంది.

ఇదీ సాధారణంగా మానవుని నిత్యకృత్యం.

ఇలాంటి స్థితిలో మనస్సు నిలకడ లేక పరుగెత్తుతునే ఉంటుంది. దేవుణ్ణి స్మరించడానికయినా క్షణం తీరిక యేదీ? ముఖ్యంగా చూడవలసిన వార్తా పత్రిక నయినా చూడడానికి యింట్లో సమయం లేక దాన్ని తమ కార్యాలయానికి తీసుకుని వెళ్ళుతున్న వారికి— మనస్సును ఒకక్షణం పాటయినా కుదుటబెట్టి దైవాన్ని ధ్యానం చెయ్యడం అసాధ్యమే!

అయినా, ధ్యానం చెయ్యదలచుకొన్న వాళ్ళకి అవకాశం లభించక పోదు. ఈ పరిస్థితులను బాగా ఆలోచించే మనవారు ఉదయాన నిద్రలేచేముందు పడకమీదను ఉన్నప్పుడే దైవధ్యానం చేసుకుని ఆ తర్వాతనే లేవవలెనని చెప్పారు. దక్షిణ భారతదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన ఆంధ్ర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు దధివామన స్తోత్రం చదివి భగవంతుని ధ్యానించి, ఆ తర్వాతనే శయ్యనుండి లేచేవాడట!

ప్రత్యూషకాలం చాలా నిశ్శబ్దంగా ఉంటుంది. అదే విద్యార్థుల మననానికి అనుకూలమయినది కూడాను. ఆ సమయంలో భగవంతుని ధ్యానించవచ్చును తెల్లవారు జామున తెలివి రాగానే పడకమీదనే కూర్చుండి భగవంతుని ధ్యానించవచ్చును. భగవన్నుతి రూపాలయిన శ్లోకాలుగానీ, పద్యాలుగానీ రాకపోయినా బాధలేదు. 'ఓ దేవుడా! నా జీవితంలో మరొక దినం ప్రారంభమవుతున్నది. తెలియనందువల్లగానీ, బుద్ధిపూర్వకంగా గానీ నేను తప్పులు చెయ్యవచ్చు. వాటి నన్నిటినీ క్షమించి నన్ను రక్షించాలని ప్రార్థిస్తున్నాను' అని అనుకుని, లేచి, నిత్యకృత్యాలు నెరవేర్చుకోవచ్చు. పగలంతా దేవుని గురించిన ఆలోచన అవసరం లేదు.

ఈ విధంగానే రాత్రి పరుండబొయ్యేముందు తిరిగి భగవంతుణ్ణి ధ్యానించుకోవాలి, 'భగవంతుడా! నేటికి నేను నా శరీర యాత్రను ముగించాను. ఇక విశ్రాంతిగా నిద్రపోతున్నాను. నేను యీ దినం చేసిన పనులలో నాకు తెలిసిగాని, తెలియక గాని ఎన్నో తప్పులు ఉండవచ్చును. నా తప్పులను క్షమించి నా మనస్సు మంచి మార్గంలో ప్రవర్తించేటట్లు చెయ్యి. నన్ను రక్షించడానికి నీ కంటే వేరే దిక్కు లేదు!' అని అనుకోవాలి. ఆపైనే నిద్రించాలి.

ఈ విధంగా అలవాటు చేసుకుంటే ఆత్మకు తృప్తి కలుగుతుంది మనం చేసే పనుల్లోని తప్పులు కూడా క్రమక్రమంగా తగ్గిపోతాయి.

దైవచింతనకు ఇదే సులభమైన మార్గం! ●



# వెలుగు నీడలు



యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్

**జ రి గి న క థ**

**రాజశేఖరంగారి** ఒకే ఒక కూతురు అనుపమ ఆయన మిత్రుని కుమారుడైన మధుని ఆదుకుని తన యింట్లోనే ఆశ్రయం యిస్తారు. మధుమూర్తి అనుపమ అభిమానాన్ని పొందుతాడు. రాధా మాధవీయం నృత్యనాటికతో వారి అనుబంధం మరింత దృఢం అవుతుంది. విదేశాలనించి వచ్చిన అనుపమ బావ విజయకుమార్ వీరి అభిమానాన్ని సహించలేడు. మధుమూర్తి ఊరికివెళ్ళిన అనుపమ అక్కడ మాధవినిచూసి అపార్థం చేసుకుంటుంది. జరిగింది వివరిస్తాడు మధు. విజయకుమార్ బారి నుండి అనుపమ శీలాన్ని రక్షిస్తాడు మధుమూర్తి. అనుపమ మధుల అనుబంధం విడదీయరానిదిగా రూపొందుతుంది. అగ్నిగుండంలాంటి శారద జీవితాన్ని చూసి నివ్వెరపోతాడు మధు.

## 8

ముద్దబంతి పువ్వులా, నిండుగా నవ్వుతూ, లేడిపిల్లలా హుషారుగా గంతులు వేస్తూ చూడ ముచ్చటగొలిపేది యౌవనంలో కనులలో యౌవనలావణ్యం మెరుపులై మెరుస్తూండేది.

సెలయేరులా ఆనందంతో ! తుళ్ళి తుళ్ళి పడుతూండేది. కానీ యిపుడా కనులలో జీవమేలేదు. ఆ కంఠాన మాధుర్యమే వినిపించదు. నిరాశనిండిన ఆ నేత్రాల్ని చూడలేక తలవంచుకున్నాడతడు.

'అక్కా ! దుఃఖంతో హృదయాన్ని దహింప జేయకూడదు ! నీకు చెప్పగలిగినంత అనుభవంలేదీ తమ్ముడికి ! కానీ అక్కమనస్సు నర్థం చేసుకోలేనంత మూర్ఖుణ్ణిమాత్రం గాను ! ఆ పసివాళ్ళ కోసమైనా బ్రతకక్కర్లేదా ... ... ? అమ్మకూడాలేని అభాగ్యుల్ని జేస్తావా వాళ్ళని ?' అతని కళ్ళల్లో గిర్రున నీళ్ళు దిరిగాయి.

దుఃఖాన్ని దిగమింగుతూ అన్నది శారద—

'ఎక్కడో దూరాన వుద్యోగమైనా నెలకు నాలుగువందలు వస్తున్నాయిగదా అని అమ్మ మనస్సు సరిపెట్టుకుని పెళ్ళి జేసింది. నేనూ నా జీవితాన కొరతే లేదనుకున్నాను మొదట్లో—

అందంవుంది ! చదువూ సంస్కారం వున్న మనిషేనని పొరబడ్డాను — కానీ ఆయన హృదయం ఎంత సంకుచితమో చెప్పలేనురా ! మధూ !

ఆఫీసునుంచి వచ్చే టైమ్‌కి వాకిట్లో నిల్చుంటే అదో పెద్ద అపరాధం ! బజారుకి వెళ్ళినపుడు ఆయనవేసే అడుగులోనే అడుగువేయాలి ! ఎవరివంకా, ఎంత విచిత్రం కళ్ళబడినా కళ్ళెత్తి చూశానా మహా పాపినే !

ఆత్మీయంగా రెండుముక్కలు చెప్పుకుంటాను ! వాటికి వేరే అర్థాలు సృష్టించి వాళ్ళ ... ... తదితర బంధువులకీ హరికథలా వినిపిస్తారు.

పరిహాస మాడ్డానికి నోచుకోలేదుగదా ! ఆ నోటికిరాని అపభ్యపుమాటలే లేవు.

ప్రక్కింటి వాళ్ళతో సినీమాకెళ్తే తప్పు ! మంజులకి ఓ ఫ్రాకుకొంటే విసుగు ! కృష్ణుడికి ఓ నిక్కరు కొనాలన్నానా యుద్ధమే యిక !

'వంకాయ పారవేశావే ? ఆ ఫ్రాకు అక్కడెందుకు వుంది ? సంసారివేనా ? లేక పానివా ? ఏమిటా నవ్వులు ? ఎక్కడిదా వుత్తరం ? ఏ మహాశయుడు వ్రాశాడో ? అన్నయ్యేనా ? నిజంగా ? ఏదీ నీ పెట్టె వెతకనీ ? ఎన్ని రహస్యాలున్నాయో ?' ఇదే ధోరణి ఎపుడూ !

మధ్యాహ్నం రానన్నారుగా ? అని అడగడం తప్పు !

ఏవడైనా వున్నాడేమోనని చూడ్డానికి వచ్చాను ! అంటారు! నిజంగా అపుడు ఎంత ఏడుపు వస్తుందో వూహించరా మధూ! అలాంటివి మన యింటా బయటా లేవే ? ఎందుకలా అనుమానాలతో రాక్షసత్వాన్ని పెంచుకుంటారంటావ్ ?

మొన్న ... ... ... నేను !

సాదారిన వేపో తు న్నానం టూ వెళ్ళి పోయారు.

ఇదెక్కడి నాగరికతరా ? అయినా అంత వింత మనస్తత్వ మేమిటి ?' రాను రాను ఆమెగొంతు రుద్ధమైపోయింది.

'అక్కా నాగరికత పెరిగినకొద్దీ సమస్యలూ పెరుగుతున్నాయి. జీవితం చుట్టూ పొలెగూడు అల్లుతోందీ నవనాగరికత! మనిషిని ఖూనీచేసి దానవుడికి స్వాగతం పలుకుతోంది! ప్రపంచం ఏవైపుకు తరలిపోతున్నదో అర్థంగాకుండా వుంది! మరో కురుక్షేత్రానికే అయితే మారణహోమం తప్పదు! ఈ చదువులూ, నవనాగరికతా, సభ్యతా, మానవుణ్ణి ఆలోచించుకోడానికైనా సరైన విజ్ఞానాన్ని అందించవు!

పై మెరుగుల్నీ, ఆడంబరాన్నీ ప్రోత్సహిస్తుందీ నాగరికత,' అన్నాడు మధుమూర్తి బాధగా.

'ఏమోరా! మధూ! పిల్లల కోసమైనా ఊ పద్మవ్యూహంలో నిలబడలేననిపిస్తోందిక! ఈ నీ అక్కలో అంత ఓపిక లేదు! అందుకే...' వెల్లువిరిస్తూన్న దుఃఖాన్ని దిగమింగింది.

'ఒకవేళ ఈ శారదక్కయ్య ప్రాణాలు అనంతంలో విలీనమైపోతే ఆ పసివాళ్ళకే కొరతా రానీయకురా! మధూ! నాకీ ఒక్కమాట యివ్వు చాలు! ప్రశాంతంగా కళ్ళు మూస్తాను.'

'అక్కా!' బాధా తప్తమైన అతని కంఠం వణికింది.

క్షణమాత్రం ఆగి దుఃఖావేగాన్ని వుపశమింప జేసుకుని అన్నాడు వ్యధాభరిత స్వరంతో.

'ఎందుకిలా చిత్రవధ జేస్తావీ తమ్ముణ్ణి! నాదీ హృదయమే! పాషాణం గాదది పగిలిపోకుండా వుండడానికి, ఎంత కఠినా ఘాతాన్నయినా సహించి! బాధలూ సమస్యలూ నాకులేవూ?'

'ఆత్మీయతా, అనురాగం నిన్నలా మెలిపెడుతున్నాయి! కానీ జరగబోయే దాన్నెలా ఆపగలం మనం?' అన్నదామె విరక్తిగా శూన్యంనిండిన స్వరంతో.

'కష్టాలందరికీ వుంటాయి కొత్తగానో, కొన్నిగానో! దుఃఖాన్ని ఎదిరించి మన గలిగినపుడే జీవితాన అర్థమూ, గమ్యమూ వుంటాయి!

బాధలూ, సమస్యలూ కలిసి హృదయాన్ని బంధించివేయగూడదు! హృదయమే వాటిని బంధించాలి. పరిస్థితుల ఒత్తిడికి జీవితాన్ని బలిపెట్టడం అవివేకమే!

అయినా అక్కా! ఒక్కమాట! ఎవరి కోసం వాళ్ళు బ్రతకడంలో అర్థమూ లేదు. ఆనందమూ వుండదు. మరొకరి కోసం జీవించడంలోనే మానవత్వం వుంది. ఇవన్నీ నీకు తెలియనివిగావు! నీ మనస్సులో ఏ పొరలోనో వున్న నగ్నసత్యాలే!' అన్నాడతడు ఆవేశాన్ని అణుచుకుని.

'మధూ! నిజమేరా! ఒప్పుకుంటాను! కానీ నేను చెప్పేదికూడా విను! అందుకేమన్ని సమాధాన మిస్తావోమరి!'......

ఓ నిమిషం ఆగి అన్నదామె తిరిగి—

'మన ప్రక్కయింటి 'రాజ్యలక్ష్మి' నీకూ తెలుసుగదా? పదిహేను కన్నాంత



ఓ అబ్బాయిణ్ణి కొన్నారామె తల్లిదండ్రులు. బుద్ధిమంతుడు, విద్యా గంధం వున్నవాడనీ మురిసిపోయారు మొదట్లో.

కానీ అతడు వ్యసనాలపుట్ట. జూదం, వ్యభిచారం, త్రాగుడూ మొదలైనవన్నీ అతడిని పశువుకంటే హీనంచేశాయి.

ఎంత మూర్ఖుడయ్యాడని చెప్పను?! త్రాగిన నిషాలో 'రాజ్యాన్ని' ఎముకలన్నీ విరిగేట్లు కొడుతూండేవాడు.

ఎవరైనా అడ్డువెళ్తే 'నాభార్యను నేను కొడతాను! చంపుతాను నువ్వెవరి వోయ్? అడగడానికి? అంటూ విదిలించేవాడు.

ఉన్న ఆస్తి హూరేగింది! ఊరిలో అప్పులూ దొరక్కుండా పోయాయి. ... ట్టుకు పెట్టుకోదగిన వస్తువులన్నీ ...ంచుకుపోయాయి.

నలుగురుపిల్లలు! చూడు! పిల్లలకు ...తం కొదువలేదు!

... పసివాళ్ళ శరీరాలు ఎండకు ఎండి ... తడిసిపోయాయి పాపం! 'రాజ్య ...' చిరిగి జీరాకులైన చీరతో ...మానాన్ని కప్పుకునేది! కన్నవారం ... వున్నవాళ్ళు గాదు.

...జ్యానికి ...రుగావచ్చి బ్రతకగల ... విశ్వాసమూ, మనోధైర్యమూ లేవు. ...నిండుగా అన్నం దొరక్క ఆ పసి ...ములు మెలిదిరిగి పోతూంటే బాధతో విలవిలలాడి పోయేదా మాతృహృదయం!

ఎక్కడనుంచి ఓ పిడికెడు బియ్యం తెచ్చి వండిపెట్టాలో అర్థంగాక, దారి దొరక్క అలమటించి పోయింది. ఆ మూర్ఖుడు ఆఫీసుడబ్బు దొగిలించి జైల్లో యిరుక్కున్నాడు!

అభిమానంతో ఎన్నాళ్ళు కడుపునిండుతుంది? 'అమ్మపెట్టదు' అడిగి తిననీయదు!' అన్నట్లు సంఘం ఆ సంసారాన్ని పొడిచివేసింది నిలువునా!

ఏ ఆశతో ఆ పిల్లల్ని చూసుకుని వాళ్ళకోసమైనా బ్రతగ్గలదింకా? బ్రతికి హృదయాన్ని కోసి బిడ్డలకు పంచిపెడుతుందా? ఆతల్లిమనస్సు దగ్ధంగాకుండా ఎలావుంటుంది? పట్టెడన్నంపెట్టలేని ఆ మాతృహృదయం పడే క్షోభ ఎంతని వర్ణించగలం? అందుకే ఓ పుణ్యక్షణాన శాశ్వతంగా కన్నుమూసింది. పిల్లలు ఎవరిదారినవాళ్ళు బిచ్చమెత్తుకుంటున్నారు!

ఇందులో ఎవరు నేరస్థులంటావు? రాజ్యలక్ష్మి పిరికిదనగలవా? అయితే అన్నాళ్ళూ ఎలా భరించిందా నరకాన్ని స్త్రీగా పుట్టడమే మహాశాపమైపోయిందన్పిస్తుంది రాజ్యలక్ష్మిని తలచుకొంటూంటే.' అశ్రుసిక్త నయనాలను తుడుచుకున్నదామె.



'నిజమే! నీతులూ, నియమాలూ వినడానికీ, వర్ణించడానికీ అందంగా వుంటున్నాయి యీరోజుల్లో! ఆచరణలోకి వచ్చేసరికి సర్వం శూన్యం అయి కూర్చుంటోంది...

స్త్రీహృదయాన ఆత్మవిశ్వాసమూ, పరిస్థితుల నెదిరించగల ధైర్యమూ మేల్కొన్ననాడే ప్రపంచాన దుఃఖగాధలు విన్పించవు!' అన్నాడు మధుమూర్తి.

'కానీ! అక్కా! నీకాభయం అక్కర్లేదు! యీ నీ తమ్ముడున్నాడు! నీ కోసం అనుక్షణం పోరాడ్డానికి' అన్నాడు తిరిగి.

ఆమె విరక్తిగా నవ్వి లేచి వెళ్ళింది పిల్లలు గొడవపెడుతూంటే. మధుమూర్తి మనస్సున ఆలోచనలు సాలెగూడులా అల్లుకుపోతున్నాయి. పద్మవ్యూహంలో ఆసంసారంలోని సమస్యలకు పరిష్కారమార్గమే గోచరించటంలేదెక్కడా!

'మాధవి! జీవితాన సుఖమూ, దుఃఖమూ తెలిసికోలేని శాపగ్రస్తురాలు! 'శారద' 'దుఃఖంతో దగ్ధమైపోతూన్న బాధామయి'

'మధుమూర్తి! ఈసమస్యలన్నింటికీ— పరిష్కారం వెదకడానికి నిరంతరం పరిశ్రమించుతూన్న ఆశాజీవి!' అతని వూహాలు ఆతనికే విరక్తినీ, నవ్వునూ కలిగించాయి.

మాధవిలోకమే హాయిగా వుంటుందన్పించిందతని మనస్సుకి. కానీ ఆమె స్మృతిలో మెదలగానే సన్నని బాధావీచిక హృదయాన తారాజువ్వలా లేచింది.

ఆరాత్రి భోజనాలదగ్గర 'మాధవి' గొడవచేయడం ప్రారంభించింది. మధుమూర్తి మాట్లాడితే 'తప్పు! బావా! నా మాటకు నువ్వు అడ్డు చెప్పగూడదు!' అంటుంది.

ఆ రబ్బరు బొమ్మకూడా అన్నం పెట్టించలేదని శివమెత్తినట్లు వూగిపోయింది.

'అది బొమ్మ! అన్నం తినదు!' అన్నాడు మధుమూర్తి.

'అయితే నువ్వెలా తింటున్నావ్ మరి? నువ్వూ బొమ్మవేగా?' అన్నదామె పెద్ద శాస్త్రవేత్తలా.

'అవును! మాధవీ! దానికీ నాకూ భేదమేమిటి నువ్వన్నట్లు? సుఖమూ లేదు! దుఃఖమూ తరగదు నాకు! ఉత్తరాయినే' అమకుంటుందతని మనస్సు బాధగా

# ఉదయమందలి
# తాజాదనము
# గంటల కొలది
# వుండేలా చేసుకోండి...

దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కంను వొళ్లంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం యొక్క తేలికైన పరిమళము వొంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం మండే ఎండలలో, ఉక్కబోసే వాతావరణములో మిమ్మల్ని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సర మంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం!




## పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం —

**ఎంతో మెత్తటి మేలు రకం టాల్కం!**

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

నిట్టూర్చారుసూత్రం.

'రేపు సాయంత్రం డాక్టరికి చూపించుదాం!' అని మాటలతో పసిపిల్లలా బ్రతిమలాడి ఎలాగో తిన్పించగలిగారా రాత్రికి.

అక్కడున్న వారంరోజుల్లో మధుమూర్తి హృదయానవున్న ఆశలన్నీ అడుగంటిపోయినట్లు శూన్యహృదయమే మిగిలింది. ఆ యిల్లు శాపాలకు ఆలవాలమైనట్లనిపించుతోంది అందరకూ.

తల్లికి చెప్పవలసినదంతా చెప్పి ఆరోజునే బయల్దేరాడు.

'ఈ వయస్సున వువ్వుల్లోపెట్టి పూజించవలసిందిపోయి కష్టాలతో నిన్ను నలిపివేస్తున్నానమ్మా!' అన్నాడు బాధగా వెళ్లేముందు.

'మీ జీవితాల్లో వెన్నెల కురిస్తే చాలు నాయనా! ఎన్నికష్టాలైనా భరించగలదీ ఎముకలగూడు' అన్నదా యిల్లాలు.

* * *

మధుమూర్తి ఏలూరు చేరగానే తల్లి పేర మరో వందరూపాయలు పంపించాడు.

ఆనాడే 'రిజల్ట్స్' వచ్చాయి. అనుపమ మనస్సు ఆనందంతో పొంగిపోయింది. తండ్రి ఫోన్‌చేశాడు ఆఫీసునుంచి—

'కంగ్రాచ్యులేషన్స్' అనూ! మొత్తానికి ఫస్టుక్లాసు సాధించావ్!' అంటూ.

'మాస్టార్ని అభినందించాలి నాన్నా! ఈ ఫలితానికి జరిగిన కృషి ఆయనదే' అన్నదామె వినమ్రస్వరంతో.

'కరెక్ట్! కానీ మధుమూర్తి ఆఫీసు పనిమీద యిపుడే విజయవాడ వెళ్ళాడమ్మా! రాగానే తప్పక అభినందిస్తాను. ఆ! మరి సాయంత్రం 'ఓ పార్టీ', ఏర్పాటు చేస్తున్నానని 'విజయ్' వచ్చి చెప్పి వెళ్లాడిప్పుడే. నౌకరితో ఇల్లు కాస్త సర్దించు అత్తయ్యక్కూడా రమ్మని కబురంపించు!' అన్నారాయన.

విందూ, విజయ్ అనగానే ఆమెముఖాన క్రోధచ్ఛాయలు పరుగులెత్తాయి. కానీ తండ్రిమనస్సును నొప్పించలేక మౌనం వహించింది.

కానీ అసలు వుండవలసిన వ్యక్తి లేనప్పుడా వేడుకలంతా - విసుగు అన్పించసాగింది.

నాలుగు గంటలకే విందు ఆరంభమైంది.

తండ్రి స్నేహితులెందరో వచ్చి అభినందించారు. విజయ్‌కుమార్ ఆత్మీయుడిలా 'మా అనుపమ మంచి బ్రిలియంట్, జీనియస్' అంటూ సగర్వంగా అతిథులందరి ముందూ ప్రశంసించాడు.

ఆనాడు అదివరలో వెలిబుచ్చిన పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని ఏమాత్రమూ ప్రదర్శిత మవ్వకుండా ఎంతో జాగరూకత వహించాడు.

అందరూ ఆశ్చర్యంతో చకితులయ్యేట్లు వేషాన్నికూడా మార్చివేశాడు.

తెల్లని గ్లాస్కోపంచె, సిల్కు షర్టు ధరించాడు. అతిథుల్లో కొందరు ఆశ్చర్యాన్ని ఆపుకోలేక ప్రశ్నించారు కూడా. అందుకాతనునుంచి వచ్చిన సమాధానం విని అందరూ విభ్రాంతులయ్యారు.

'భారతీయ సంస్కృతి, వేషధారణ నాకెంతో నచ్చాయి' ఆ సమాధానంలో సత్యం ఎంతవరకువుందో గనీ ఆ చెప్పిన తీరుమాత్రం అందరికీ నవ్వు పుట్టించింది ఆశ్చర్యంతోపాటు.

'పార్టీ' అంతా తనపైనుంచే పోతున్నట్లు అనుపమకూ, అతనికీ ఎంతో గాఢానురాగం వున్నట్లు ప్రవర్తించసాగాడతడు.

ఆ కోలాహలంలో ఆనందాన్ని పంచుకోని వ్యక్తి ఒక్క అనుపమ!

ఎవరికోసమైతే విందు అంత ఘనంగా జరుగుతుందో ఆమె పూర్తిగా నిశ్శబ్దమే అయ్యింది.

అంతమందిలోనూ ఆమె ఏకాకిగానే మిగిలిపోయింది! జీవమేలేని బొమ్మలా ఎక్కడ కూర్చుందో అక్కడే వుండిపోయింది.

ప్రతిక్షణం వెలికిదీసి మనసున అనురాగ నిసంధిని ప్రయోగించిన అభిమానియైన వ్యక్తికోసం ఆమె నిలువెల్లా నిరీక్షించుతోంది.

అతడులేని ఆవిందు ఆమెకేమాత్రమూ ఆనందాన్ని కలిగించడంలేదు సరిగదా విసుగుదల పొడసూపింది మనస్సులో.

ఆపైన విజయకుమార్ అతి చనువుగా కష్టణాలనికివచ్చి ఏదో మాట్లాడించడం ఆమెకు కించిత్కూడా నచ్చలేదు. అతి ప్రయత్నంమీద ఆగ్రహాన్ని అణచుకుని

అసహ్యాన్ని దిగమ్రింగి 'ఆ, వూఁ'లతో జవాబులిస్తోంది.

విందు పూర్తయి అతిథులందరినీ సాగనంపి రాజశేఖరంగారు లోనికి వచ్చే సరికి అనుపమ అక్కడనుంచి లేవలేదు. శిలాప్రతిమలా కూర్చున్న ఆమెను చూడగానే ఆయన ఆశ్చర్యపోయారు.

'అనూ! రామ్మా! చీకటి పడుతోంది!' అన్న తండ్రి పిలుపుతో ఉలిక్కిపడి తలెత్తింది.

ఆ కనులలో పరుపులెత్తుతూన్న నిరీక్షణా, విసుగూ ఎవరికోసమో ఆయన గ్రహించగలిగారు.

'మధుమూర్తి రాలేదనాతల్లీ! బెంగగా కూర్చున్నావు? ! ఎంత పొద్దుపోయినా యీ రాత్రికివచ్చి నీకు కన్పించే వెళ్లమన్నాను!'

అన్నారాయన వాత్సల్యంగా

తన మనస్సును కనిపెట్టినందు కామె సిగ్గుపడి తలవంచుకుంది.

తండ్రిమాటలామె హృదయాన పన్నీటి జల్లులు వర్షించాయి.

రాజశేఖరంగారు పెందలకడనే భోజనం ముగించుకున్నారు. ఏదో సాంస్కృతిక కార్యక్రమానికి అధ్యక్షతవహించమని ఆహ్వానం వచ్చిందంటూ.

వెళ్లేముందు అన్నారు అనుపమతో.

'మధుమూర్తి నీరాత్రికి యిక్కడే వుండమను అనూ! నేను వచ్చేసరికి చాలా పొద్దుపోతుంది! ఆఫీసు విషయాలు మాట్లాడాలి' అని.

ఆయనవెళ్లిన గంటకేవచ్చాడు మధుమూర్తి.

గేటు చప్పుడు వినగానే అనుపమ ఒక్క అడుగులో గుమ్మంలోకి వచ్చింది.

ఆనందంతో పరుగునవెళ్లి మధుమూర్తిని లోనికి ఆహ్వానించింది.

'ఫస్టుక్లాసొచ్చింది మాస్టారూ!' అన్నది ఆనందంతో వూగిపోతూ.

'హార్టీ కంగ్రాచ్యులేషన్స్! అనూ! ముత్యానికి క్లాసు సంపాదించావన్నమాట!' అంటూ అభినందించాడతడు హృదయపూర్వకంగా

అలుపు ప్రయాణంజేసి వడలికతో అలసివుంటాడన్న వూహకూడా రాలేదామె మనస్సున

అతడిని సోఫాలో కూర్చోబెట్టి తానూ ప్రక్కనే కూర్చుని పసిపాపలా వుత్సాహంతో విందు జరిగిందనీ, కానీ అతడు లేనిమూలాన ఆమెకేమాత్రమూ సంతోషం కలగలేదనీ వర్ణించసాగింది. తండ్రి బహూకరించిన చక్కని 'పెన్' చూపించింది.

తర్వాత అన్నది—

'మరి మీరేమిస్తారు? నాకు?'

'నేనా? ఏం కావాలి?

'ఇవ్వాలనుకున్నవాళ్లు అడిగి యిస్తారేమిటి?'

'ఆహా! అయితే! ఇదిగో! నా కానుక!' అంటూ అతడామెను దగ్గరకు తీసికొని నుదుటిపై ముద్దు పెట్టుకున్నాడు మృదువుగా.

సిగ్గుతో, ఆనందంతో నిండిపోయిందామె హృదయం మధురోహాల వూయలలో ఆమె మనస్సు వూగిపోయింది.

కోటివేలభావాలు మల్లెలమాలలై వదనాన్ని వెదజల్లాయి. అనురాగపూర్ణములైన ఆమె విశాలనేత్రాలు ఎంత ప్రయత్నించినా ప్రక్కనేవున్న అతడిని చూడలేకపోయాయి.

'సరే! కాసిని మంచినీళ్లయినా యివ్వగలవా? అనూ!' అన్నాడతడు.

అప్పటికిగాని ఆమెకు స్ఫురించలేదా సంగతి. వెంటనే లేచివెళ్లి భోజనం సిద్ధంగావుంచి పిలిచింది.

అతడు తింటూన్నంతసేపూ ఏదో చెబుతూనే వుంది.

'రేపు మీరు ఆఫీసుకు సెలవుపెట్టెయ్యండి!' అన్నది మధ్యలో.

'ఎందుకూ?'

'ముందుగా చెప్పగూడదులెండి!' అన్నదామె

# వెలుగునీడలు

'అంత రహస్యమా? సరే! చూస్తాం!'

'అహ! చూద్దామంటే కుదరదండోయ్! తప్పక రావాల్సిందే' అన్నది పట్టుదలగా

'ఏమిటివాళ? ప్రపంచాన్నే శాసించేట్లు వూగిపోతున్నావ్ వుత్సాహంతో?'

'మీరున్నారని!'

'ఎక్కడో?'

అనురాగంనిండి వెలుగులు జిమ్ముతూన్న కళ్లతో అతనివంక చూసిందామె

'జవాబు తెలిసిన ప్రశ్నలుంటాయని మా మాష్టారు చెప్పిన గుర్తులేదే?' అన్నదామె ప్రేమరంజితమైన చిరునవ్వుతో.

'మీ మాష్టారు చెప్పింది విన్నంత వినయం ఎప్పుడలవడిందబ్బా?'

'మరీ అంత అందమైన అబద్ధం ఆడకండి!'

'అందమైనవాళ్లు ముందున్నప్పుడు మాలాంటి యువకులకు అబద్ధాలు తప్ప నిజాలు రావు!'

'అయితే మోసపోయానన్నమాట!'

'ఆ మోసంలో కోల్పోవడం లేదులే!'

'ఏమో! పొందడం కూడా లేనట్లే వుంది' అన్నదామె

'అదేమిటి?'

'మరేమంటారో! ఎన్నేళ్లయినా, యుగాలయినా పాషాణంలా వుండిపోయేవాళ్లను?'

'మరీ నవనీతమైనా బాధే అనుపమా! హృదయాన దాచుకోవాల్సి వస్తుందెప్పటికీ' అన్నాడతడు

'అదా! మీ భయం! తెలివైనదొంగలే!' అంటూ నవ్విందామె.

'ఈ రకం దొంగలకు శిక్ష ఏమిటో?'

సిగ్గుతో ముళ్లమొగ్గ అయిందామె హృదయం.

మరునాటి వుదయమే ఆమెతండ్రి ఆఫీసుకు వెళ్లగానే మధుమూర్తితో బజారుకు వెళ్లింది.

ఓ నగలషాపులోకివెళ్లి ఎర్రని రాయి తాపడంచేసిన వుంగరాన్నికొన్నది.

'ఎవరికి?' అన్నాడు మధుమూర్తి.

'మీ కెక్కడుతెంది! మా మాష్టారికి!' అన్నదామె.

అతనికి అప్పటికిగాని అర్థంగాలేదు ఆమెవను ఎందుకీరోజు పిలవుపెట్టమన్నది వెనక రాజశేఖరంగారి ప్రోత్సాహంకూడా వున్నట్లు గ్రహించాడు

మరోషాపుకు వెళ్లింది అక్కడున్న వాచీలన్నీ పరీక్షించింది నచ్చక తిరిగి మరో షాపులోకి వెళ్తూండగా అన్నాడతడు.

'అనూ! నిజంగా మాష్టారి మనస్సు సంతోషించాలంటే యిదిగాదు చేయవలసిన పని'

ఆశ్చర్యంతో 'మరేమిటన్నట్లు?' కనులెత్తి చూసిందామె

'మీ మాష్టారికి వాచీ వుంగరాలు లేనంతమాత్రాన వచ్చిన ఇబ్బందేమీ లేదు'

'మీకేవీ లేకపోయినా యిబ్బందే వుండదు!' విష్కారత ధ్వనించిందామె కంఠాన

'అవును! కానీ నువ్వున్నావు నాకు! అందుకే నేటిపైనా మోజుపోదు' అన్నాడతడు మృదువుగా నవ్వుతూ—

ఆ విశాల నయనాలలో మధురభావాలు మెరుపులై తళుక్కున మెరిశాయి

కనులు క్రిందికి దించుకుందామె అనురాగం సిలువెల్లా నిండి పులకింతలు పెడుతూంటే.

'కానీ నామనస్సు తృప్తిజెందడంలేదు! మౌనంగా మనస్సు నర్పించడంతోనే' అన్నదామె మృదు మధుర స్వరంతో.

'అయితే ఒక్కమాట! అనూ! ఇక ఆనాసేట చాలించెయి! నలుగురు పేదవాళ్లను పిలిచి నువ్విప్వగలిగినంత దానం చెయి! నాకెంతో ఆనందంగా వుంటుందపుడు' అంతేగాని వాచీలూ వుంగరాలూ కొని మరో పెద్ద సన్మానసభ జేసి, వున్నవాళ్లందర్నీ పిలిచి వాళ్లు వద్దంటున్నా ఫలహారాల నందించడం నాకు నచ్చదు. అందుకే నిన్న పిలున్నా రాలేదు నేను! ఆరకం సభలంటే విందులంటే నాకుమంట

లేనివాణ్ణి మరీబాధ పెడుతున్నట్లవుతోంది ఆ విందులతో. వందమంది నెలరోజులు తేలిగ్గా బ్రతకగల ఖర్చుతో ఒక్కవాడు విలాసాల్లో మునిగి తేలడం ఎంతో అన్యాయం, అవివేకం! అదే మనవాళ్లలోవున్న పెద్ద బలహీనత! అవసరాల్ని గమనించకుండా విలాసాల్నీ, విందుల్నీ సృష్టించుకుని

తృప్తిని గౌరవాన్ని కొనుక్కోవాలను కుంటారు'.

'సరే బాబూ! ఇంటికివెళ్దాం పదం డిక ? నలుగురూ యిటే చూస్తున్నారు' అంటూ కారెక్కింది అనుపమ.

కానీ ఆమె మనస్సున ఆతడు ఎంతో వున్నతంగా ఎదిగి కూర్చున్నాడా మాట లతో. అంత విశాలహృదయం, విజ్ఞానం అతని కెక్కడనుంచి అలవడ్డాయా అని ఆలోచించ సాగిందామె.

ఇల్లుచేరిన తర్వాత అన్నది —

'నాన్నగారితో మీ రన్నట్లే చెబుతాను! ఈ ఒక్క వుంగరంమాత్రం దయచేసి తిరస్కరించకండి !'

'మరో సుదీర్ఘ వుపన్యాసం విన్పించ నులే! భయపడకు!' అన్నా డతడు నవ్వుతూ.

అనుపమ స్వయంగా వుంగరాన్ని అతని వ్రేలికి వుంచింది సంతోషంతో వూగి పోతూ.

'ఈ కానుక మన అనుబంధానికి అంద మైన చిహ్నం! అనురాగాన్ని పొదిగి అందించావ్! ప్రతిగా యీ మాష్టారే మివ్వగలరు ?! అనుపమా !'

'మీనుంచి కోరడంలేదు నేనెప్పుడూ! ఈ అనుపమ జీవితాన మల్లెలు నింపండి! చాలు! మనస్సును స్వీకరించండి! మరేమీ కోరను' అన్నదామె మధురస్వరంతో,

క్షణమాత్రం అగి అన్నా డతడు—

'అందుకే ప్రయత్నిస్తు తున్నాను! అనూ! నీ అనురాగ పూర్ణ హృదయాన్నే నాడూ వంచించను. ఆనందాన్ని అందుకో నియ్యకుండా అడ్డా నిలుపను మనసారా నీ జీవితం మల్లెపూలరథం కావాలనే కోరు కుంటున్నాను అందుకు నీకు తోడ్డై నిల వాలనే అనుకుంటున్నాను' అన్నా డతడు వ్రేలినున్న వుంగరంవంకే చూస్తూ.

తృప్తిగా నిశ్వసించిం దామె.

(ఇంకా వుంది)




కొన్ని చెట్లమీద జాగ్రత్తగా మనం గమనిస్తే, 'పుడక'లే నడు స్తున్నట్టు కనబడతాయి సృష్టిలోని విచిత్రాల్లో ఇది ఒకటి అంటే పుడక నడుస్తుందనికాదు ఒకానొక జంతువు తన ఆకారాన్ని పుడక రూపంలోకి మార్చుకోగల్గిందని కొన్ని జాతుల్లో రెక్కలున్నా సాధారణంగా రెక్కలు కూడా వదులుకొన్నాయి, మిడతలకు బంధువులయిన ఈ కీటకాలు శరీర మంతా పొడవుగా, బలపంలా పుడక ఆకారంలో ఉండడమేకాక, సామా న్యంగా ఎండిన పుడక ఆకారాన్నికూడా పోలి ఉంటాయి, కాళ్లుకూడా అలాగే సన్నగా పొడవుగా ఉంటాయి. అయితే చిన్నప్పుడు మాత్రం ఆకు పచ్చగానే ఉంటాయి.

ఈ తాపత్రయమంతా వాటి శత్రువులయిన పక్షుల తొండలనుంచి తప్పించుకోడానికే. పైగా కొన్ని జాతులు భరింపరాని కంపు కూడా కలిగి ఉంటాయి; కొన్ని ప్రావగ్రంథుల ఫలితంగా.

ఇంతకూ వీటికి సంసారం బాదర బందీలేదు. అలా అని పిల్లలే పుట్ట వనికాదు. సంతానాన్ని పెంచడం, పోషించడం లాంటి ఇబ్బందుల్లేవు. పిల్లలకి తల్లిప్రేమ, తల్లికి పిల్లల ప్రేమ ఏమిటో తెలియదు. తల్లులు చెట్లమీదనుంచే గుడ్లను కిందికి వదిలివేస్తాయి ఒక్కొకసారి ఎండిన ఆకులమీద అవి పడుతున్నప్పుడు సన్నని చినుకుల శబ్దంలాగా ఉంటుంది. ఆ గుడ్లనుంచి పిల్లలు వచ్చి క్రమంగా ఎదుగుతాయి,

ఇంకోరకం షట్పత్తులు (కీట కాలు) పుడకలకిబదులు పచ్చని ఆకుల రూపం పొందాయి దానివీపు వెడల్పుగా ఆకు ఆకారం కల్గిఉంటుంది. దాని మీద గీరలు కూడా అలాగే ఉంటాయి. కాళ్ళుకూడా వెడల్పుగా చిన్నచిన్న ఆకుల్లాగే కనబడతాయి ఇలాటి మారువేషగల్లి పట్టడానికి ఎతుడు ఎంతో శ్రమపడాలి కదా !

—ఉప్పు కోనేటిరావు.

# న్యాయం నిద్రపోయింది

వలివేటి నాగచంద్రావతి



సాయంత్రం నాలుగున్నరయింది పగ అంతా జీవకోటిని మలమల మాడ్చి.. ఆఖర్న...వెనక్కి తిరిగిచూసి . అంత దీర్ఘ కోపికాడు కనక.. జాలిపడి.. ఇంత కుంకం పొడి గోరువెచ్చని గాలిలో మెదిపి...చెట్లకి చామలికీ మైపూతలు పూస్తో నిష్క్రమిస్తున్నాడు సూర్యభగవానుడు.

ఒక మధ్యవయస్సావిడ అప్పుడే రిక్షాదిగి, చీరకుచ్చెళ్లు పైకెత్తుకుని, వెంట ఓ ఐదారేళ్ల పిల్ల నడుస్తుంటే ఆ వూరి గవర్నమెంటు ఆసుపత్రిలో అడుగు పెట్టింది.

ఆసుపత్రి మూసే టయిము కావటం మూలాన జనం ఎంతోమంది లేరు. 'బెడ్స'లో వున్న రోగుల బంధువులు మాత్రం 'విజిటింగ్ టైము' అవటం మూలాన ఎడతెరిపి లేకుండా వస్తున్నారు. 'ఓ పి వార్డు' దగ్గరా, మందు లిచ్చే 'డిస్పెన్సింగ్ రూం' దగ్గరా, 'వార్డుల' లోనూ వున్న 'నర్సులూ' 'తోటీ'లూ, అక్కడ వున్న నలుగురైదుగుర్నీ వదల గొట్టుకుని బయట పడాలని తొందర పడుతున్నారు.

ఆవిడ పిల్లని వెంటబెట్టుకుని చీటీ లిచ్చే కిటికీదగ్గర 'క్యూ'లో నిలబడింది. ఎంతోమంది లేని మూలాన చీటీ రాయించు కుందుకు ఎక్కువ టయిము పట్టలేదు.

చీటీ రాయించుకుని, 'ఎన్నో నెంబరు గదికి వెళ్లాలి బాబూ ?' అని అడిగింది. మరో చీటీ రాస్తున్న అతను 'పదకొండో నెంబరు గదికి వెళ్లమ్మా' అని, 'తొందరగా వెళ్లు. ఆస్పత్రి మూసే టయిమయింది. మళ్లీ డాక్టరుగారు వెళ్లిపోవచ్చు' అని హెచ్చరించాడు ఆమె గబ గబా అడుగులు వెయ్యాలని చూస్తోంది గాని, ఆమె కుడి కాలు స్వాధీనంగాక పట్టింది అడుగలు బెట్టుగా వేస్తో, ఈడ్చుకుంటో, చంటిదాని చెయి పట్టుకుని 'రూము నంబరు' చూసు కుంటూ పదకొండో నెంబరు గదిలో అడుగు పెట్టింది.

డాక్టరు మురహరిరావు రోగుల నందర్నీ పంపేసి, 'హమ్మయ్య—ఈ చీమలబారింత టితో సరి', అని వొళ్లు విరుచుకుని వెనక్కి వాలబోతున్నాడు కుర్చీలోకి డాక్టరు మురహరిది పెద్ద వయసు. మొహం తేటగా వుంది

ఆదరా బాదరా వస్తున్న కొత్త రోగిని చూడగానే మళ్లీ సరిగ్గా కూచుని చీటీ అందుకున్నాడు.

'ఏమిటమ్మా సుస్తీ ?'

'పిచ్చికుక్క కరిచిందండీ—మోకాలికి 'ంద' అన్న దామె.

'ఏదీ చూపించు'

కుడికాలు 'స్టూలు' మీదపెట్టి చీర కుచ్చిళ్లు కాస్త ఒక గుప్పెడు తొలగించిం దావిడ. మోకాలిచిప్ప క్రిందుగా కాలికి వెనకాలభాగంలో, నాలుగుపళ్లూ దిగినట్టు స్పష్టంగా గాట్లు కనిపిస్తున్నాయి కరిచి నప్పుడు కాలు విదిలించడంలో కండ బయట పడింది. కరిచి ఎంతసేపయిందో మరి...రక్తం పేరుకుపోయింది. నిర్వి కారంగా ఆ గాయం వంకచూస్తూ,—

'పిచ్చికుక్క అని నీ కెలా తెలుసమ్మా?' అన్నాడు డాక్టర్ మురహరి.

'బజార్లో నడుస్తుంటే వెనకపాటున వచ్చి కరిచిందండి అప్పటికే చాలామందిని కరిచిందట వరసగా అందరిమీదా పడి కరుస్తుంటే, పిచ్చిదని నిర్ధారణ కొచ్చి, అప్పుడే నలుగురూ కర్రలుంచుకుని తరిమికొట్టి సైడు కాలవపక్కని చంపే

కారండి దాన్ని...నేను చూశాను' అని వర్ణించిందావిడ.

ఓపిగ్గా విన్నాడు డాక్టరు మురహరి.

'చూడమ్మా—నీకో చీటీ వ్రాసిస్తాను. అది తీసికెళ్ళి మూడో నంబరు గదిలో ఒక డాక్టరుగారుంటారు...ఆయన కివ్వు... రెండు ఇంజక్షన్లు చేస్తారు కుక్క కరిచినచోట కండ కాల్చి మందువేసి కట్టు కడతారు తరువాత వెళ్ళు. తొందర పడి 'ఇంజక్షన్లు' చేయించుకోకుండా కట్టు గట్టించుకోకుండా వెళ్ళేవు సుమా. చాలా ప్రమాదం! పిచ్చికుక్క! పైగా దారుణంగా కండ వెళ్ళుకొచ్చేలా కరిచింది! జాగ్రత్త!'

ఆవిడ మనస్సులో గాబరా పుట్టింది. కళ్ళల్లో భయం కొట్టాడుంది. 'మరేం భయం లేదుగదా డాక్టరుగారూ ?' అంది హీనస్వరంతో.

'మరేం ఫరవాలేదులే అమ్మా...రోజుకొక ఇంజక్షన్ చొప్పున పధ్నాలుగింజక్షన్లిస్తారు. మానకుండా నాగాలు లేకుండా చేయించుకో, తప్పకుండా నయమవుతుంది.'

గౌరవం నిండిన కళ్ళతో, 'నమస్కారం బాబూ' అని రెండు చేతులూ జోడించి బయటకొచ్చిం దామె.

మళ్ళీ మూడో నెంబరు గది వెతుక్కుంటూ వెళ్ళి దానిలో దూరబడింది. ఆ కుక్క...దాన్ని తగలెయ్య...అనువ్రతి మూసే టయిములో కరిచింది.

డాక్టరు రజనీకాంతరావు తీరుబడిగా కుర్చీకి జార్లబడి కూచున్నాడు. లేడీ డాక్టరు రమ టేబులుమీద మోచెయ్యి ఆన్చి, ఎదురుగావున్న కుర్చీలో కూర్చుని, గెడ్డమూ చెంపా అరచేతిలో ఇమిడ్చి, డాక్టరువంక తల వోరగా వంచి 'రిలాక్స్' అవుతోంది. ఇద్దరు ఖులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. పానకంలో పుడకలా అడుగుపెట్టిన ఆమెని చూస్తూనే మొహం చిట్లించాడు డా॥ రజని.

సరిగ్గా కూచుని 'ఏమిటి?' అని అడిగింది లేడీ డాక్టరు.

డా॥ రజని మొహంలో చిటపటలాడుతున్న విసుగూ, చిరాకూ గ్రాహ్యానికొచ్చి, ఆవిడ చప్పున మాట్లాడలేక బెరుగ్గా చేతిలోవున్న చీటీ లేడీ డాక్టరుకి అందించబోయింది. ఆ చీటీ తను అందుకుంటూ, 'ఏమిటంటే మాట్లాడవేం?' అని కసిరాడు డా॥ రజని.

ఆవిడ గతుక్కుమంది.

మళ్ళీ డ్రాయరుమీదకు తలవాల్చుకుంది లేడీ డాక్టరు, తనకు సంబంధంలేనట్టు.

బిక్కు బిక్కుమంటూ, 'పిచ్చి కుక్క కరిచిందండి కాలుమీద' అంది లోగొంతుక పెట్టి.

'అంతేగదా...వెధవగోల...ఇది పధ్నాలుగోది!' అని మెల్లిగా సణుక్కుంటూ, ఆ చీటీమీదనే ఏదో గిలికి, 'పక్కగదిలోకి వెళ్ళమ్మా—మందువేస్తారు' అంటూనే తుంచేసిన చిరునవ్వుని మళ్ళీ పెదాలమీద అతికించుకుని అటు తిరిగాడు డా. రజని.

భయపడుతూనే, 'అక్కడి డాక్టరు బాబు ఇంజక్షన్లు చేసి కట్టుకడతారన్నారు బాబూ...పిచ్చి కుక్క కాటు...చాలా ప్రమాదమన్నారు' అంది ఆందోళనగా చూస్తూ.

మండిపడ్డాడు డా. రజని. 'ఏ డాక్టరు? ఇక్కడ నేను డాక్టర్ని కానా? ఏది ప్రమాదమో ఏది కాదో నాకూ తెలుసులే...వెళ్ళు వెళ్ళు...' చాలా సీరియస్‌గావుంది ఆయన మొహం. 'పానకంలో వచ్చిన పుడక...ఇదేమీ చిన్నదికాదు' అనుకుంది లేడీ డాక్టరు. 'ఇక లాభంలేదు' అన్నట్టు గాఢంగా ఊపిరి తీసుకుని విసుగ్గా కూచుంది.

ఆమె కదిలింది. పక్కగదిలో 'కాంపవుండర్లూ,' 'నర్సులూ' పకపకలాడుతున్నారు. ఇప్పుడుగాని కదిలిస్తే ఏమి తంటా వస్తుందో! కాని తన ప్రమాదం మాట!!

తప్పనిసరిగా ఆ గోలలోకి ప్రవేశించి, ఏమయితే అయిందని గబగబ తనగోడు చెప్పుకుంది. వాళ్ళు కొస్తనయమే... ఆడుతూ పాడుతూనే ఆ గాయంమీద ఇంత 'అయొడిన్' పోసి దూది వత్తారు.

ఎలాగూ 'ఆడకూతురు ఆడకూతురే' అనుకుందామె...ఇందాక పట్టించుకోని లేడీ డాక్టర్ని మరిచిపోయి...

ఆ గాయం చూస్తున్న ఓ 'నర్సు' 'అబ్బా—పెద్ద గాయమే—కండలేచిపోయింది. ఎక్కడ పడ్డావమ్మా?' అని అడిగింది. అపేక్షగా అడిగిందే చాలన్నట్టు, 'దెబ్బ కాదమ్మా.. పిచ్చి కుక్క కరిచింది... పదకొండో నెంబరు గదిలో డాక్టరుబాబేమో రెండింజక్షన్లు చేయించుకుని కట్టు గట్టించుకోమన్నారు. లేపోతే చాలా ప్రమాదమని చెప్పారు...ఈ గదిలో డాక్టరుగారేమో, ఈ మందు రాయించుకుంటే చాలని చీటీ రాశారు ఏమమ్మా? ఇంజక్షన్ చెయ్యరా?' ఆశగా అడిగిందామె.

'ఆ డాక్టరు రాస్తేమటుకు, ఆ మందు లిక్కడ వుండద్దమ్మా?...ఒకవేళ వున్నా... నాబోటిదానికీ, నీబోటిదానికీ...' తక్కింది నాన్చేసింది 'నర్సు', వెళ్ళిపోతున్న ఆమె వంక జాలిగాచూస్తూ, 'పిచ్చి కుక్క కరిచిందంటే ప్రమాదమే! పాపం' అని నిస్సహాయంగా నిట్టూర్చింది.

ఆమె వస్తాయిస్తూ అడుగులు వేస్తున్నదన్న మాటేగానీ, మనస్సు పీకుతూనే వుంది—ఇప్పుడేమి చెయ్యటమా అని... లేచినవేళ అలాటిది. లేకపోతే దారేపోతూ ఎందరులేరు? తనమీదవేపడి ఆ కుక్క కరవాలి?

కుక్క కరిచిన ప్రతి ఒక్కరూ 'అది తననే కరవాలి?' అనుకుంటే ఇంక అది ఎవరిని కరవాలి!

అది కరిచిన వెంటనే అక్కడున్న వాళ్ళందరూ 'అది పిచ్చి కుక్కమ్మా ఇప్పటికే చాలామందిని కరిచింది. తొందరగా ఆస్పత్రికి వెళ్ళాలి నువ్వు' అని హడల గొట్టేశారు అప్పటికప్పుడు వెదుతున్న పని మానుకుని రిక్షా కట్టించుకుని ఇక్కడి కొచ్చింది తను. కాని ఏంలాభం?

పాపం పదకొండో నంబరు గదిలో డాక్టరు ఎంత మంచి డాక్టరు! ప్రమాదమని మరీ మరీ చెప్పాడాయెను...సరియైన చికిత్స లేకుండా ఇప్పుడు ఇంటికిగాని వెడితే తనకేం ముంచుకొస్తుందో! తను ఒక్క రోజు పడకేస్తేనే గడవనికొంప, రేపు తనేమయినా అయితే?...మరి ఆలోచించలేకపోయిందామె. దీనమైన వాలకాలతో పిల్లలు మనస్సులో మెదిలారు...దిక్కుమాలినబెడద! వాళ్ళకోసమైనా బ్రతికి చావాల్నే! ఇప్పుడెలా?

వెనక్కి తిరిగింది.

కోటు భుజానవేసుకుని 'మెడికల్ బెస్టు' ఊపుకుంటూ చకచకా అడుగులు వేసుకుంటూ 'కారిడార్'లో పోతున్నాడు డా మురహరి.

'బాబూ' అన్న సన్నని పిలుపుతో ఆగిపోయాడు. ఇందాక పిచ్చి కుక్క కరిచిన వామె ... పిల్లతో సహా వుసూరుమంటూ

విల్లుంది!

'ఫ్లీమామ్మ ... ఇంజక్షన్ చేయించు కున్నావా ? మరేం భయంలేదులే— మళ్ళీ ఎల్లుండి వచ్చి ఇంకోటి చేయించుకో ...' బహుశా తను ప్రమాదమని పదే పదే చెప్పినందువల్ల విపరీతంగా భయపడి పోతున్నది గావును అనుకుని అభయమియ్యబోయాడు డా. మురహరి.

'లేదండీ...ఇంజక్షనూ ఇవ్వలేదు ... మరి కండ కాల్చి మందువేసి కట్టుకడతారన్నారు...అదీలేదు. కొద్దిగా 'అయెడిన్' వేసి దూది అంటించారు. అంతే. ప్రమాదంలేదు ఏం లేదు అన్నారండి మూడో నెంబరు గదిలో డాక్టరుగారు. నిజమేనాండి ?' అమాయకంగా చూచిందామె.

'ఆ !' అని ఆశ్చర్యంలో మునిగిపోయి, అంతలో తేరుకుని, 'ఇక్కడందరూ ఇంతే నమ్మా—అలాగే అనేస్తారు. పోనీ 'పాశ్చర్ ఇన్‌స్టిట్యూట్' అని కూనూర్లోవుంది. టెలిగ్రామిస్తే 'వి. పి. పి' ద్వారా తిరుగుటపాలో మందులొస్తాయి. ఏ 'ప్రయివేట్లు డాక్టరి' చాతయినా 'ఇంజక్షన్లు' చేయించుకోరాదూ...ఇక్కడ ఈ కంచె గరుడసేవ ఏమి చెయ్యగలవు తల్లీ ?... అది సరే...ప్రస్తుతానికి 'ఎ టి యస్' ఇంజక్షనని ధనుర్వాతం రాకుండా తీసుకోవాలి మరి .. 'కార్బాలిక్ యాసిడ్'తో కాల్చాలి ... 'స్పిరిట్ స్లాబ్'లో క్లీన్

# న్యాయం నిద్రపోయింది

చెయ్యాలి...ఇదేమీ లేకుండా...' స్వగతంగా నసిగాడు డా. మురహరి.

తలవంచుకున్నదామె.

అర్థం చేసుకున్నాడు డా. మురహరి. అంత ఆర్థిక స్తోమతున్న ఆవిడయితే ఇక్కడి కొచ్చేదేకాదు. శుభ్రమయిన చీరా తీర్చైన జుట్టుముడీ శతవిధాల దాస్తున్నా, మెళ్లో వసుపుతాడూ, చేతులకున్న మట్టిగాజులూ, పట్టు బలవంతాన బైటపెడుతున్న ఆమె దారిద్ర్యాన్ని అవగతం చేసుకున్నాడు డా. మురహరి.

'ప్రస్తుతానికి పోనీ ఏ. టి, యస్. ఇంజక్షనొకటి కొనుక్కోమ్మని డబ్బు ఇవ్వనా' అని దానకర్ణుడు మెదిలాడు లోపల కాస్సేపు. ఇలా ఎంతమంది కని ఇస్తావూ అని అంతరాత్మ ఒక మొట్టికాయ మొట్టింది.

'సరే — నేను చెబుతాను పదమ్మా' వెనక్కి తిరిగాడు డా. మురహరి. కొండంత బలంతో వెనకాల నడిచిందావిడ.

'స్ప్రింగ్‌డోర్' తోసుకుని లోపలికి వెడుతూ, 'గుడీవినింగ్ డాక్టర్స్' అన్నాడు మురహరి.

'గుడీవినింగ్ — గుడీవినింగ్' డాక్టరు రజనీ, రమా కంఠా లొక్కసారి బదులు పలికాయి.

డాక్టరు మురహరి వెనకాల ఉన్నావిణ్ణి చూస్తూనే విషయం అర్థం చేసుకున్నాడు డా. రజని ... ఇందాక ఆవిడ చెప్పిన వద కొండో నెంబరు గదిలో డాక్టరు ఈయనే అన్నమాట...కాని మళ్ళీ ఆవిణ్ణి వెనకాల వేసుకుని రావడంలో ఈయన వుద్దేశ్య మేమిటి ?

చూడండి డాక్టర్ — ఈవిణ్ణి పిచ్చి కుక్క కరిచిందట...మీరు సరిగ్గా చూసి వుండరు...కండ ఊడివచ్చింది కూడానూ ... అలాటప్పుడు కాస్త 'యాసిడ్' వేసి ఒక 'ఎ టి.యస్' పారేస్తే మంచిదేమో ?' అతి మెల్లిగా పెంకెకుర్రాడికి నచ్చజెప్పే ధోరణిలో సూచించాడు డా. మురహరి,

'చూడకేం—చూశాను...ఏమంత పెద్ద గాయం కాదులెండి ... 'అయోడిన్' చాలు' అన్నాడు డా. రజని, కుర్చీకి తగిలించిన కోటు భుజాన వేసుకుంటూ. అతని మొహమ్మీద చిరాకు పొటమరించింది ... వేళ గాని వేళ ... పైగా ఒక లేడీడాక్టరు ఎదురుగా, మరో డాక్టరు పనిగట్టుకుని వచ్చి అన ట్రీట్‌మెంటులో లొసుగులెత్తి తనకి చూపించడమూ, సలహా లివ్వడమూ తన 'డ్యూటీ'లో కలగజేసుకోవడమూ, డా. రజనికి తలగొట్టినట్టయింది.

'చూడలేదు బాబూ — మర్చిపోయారేమో' అని కాలిమీద కుచ్చిళ్ళు వొత్తిగించి చూపించిందావిడ

'అక్కర్లేదు ... చూశాన్లేవమ్మా' అంటూనే అరివిగానికళ్ళు అటు తిప్పాడు డా. రజని మొట్టమొదటిసారి గాట్లు చూస్తూనే గతుక్కుమన్నా.. మరీ పరకాయించి చూస్తే తన పొరపాటు అంతకు కొంత రుజూ అయిపోవచ్చు రమాదేవి సమేతం పరిశీలనకు దిగిందా తను నేరస్థుడుగా తోటి డాక్టరు సమక్షంలో నిలబడాలిసి రావచ్చు. అంచాత ఇబ్బందిగా ఎటో మొహం పెట్టాడు డా. రజని.

'పళ్ళు కొద్దిగా దిగినమాట నిజమే అనుకోండి. అయితే మటుకు అది పిచ్చి కుక్కే అని నిర్ధారణేమిటీ ?' మొండిగా అనేశాడు.

అది బజార్లో అందరినీ కరుచుకుంటూవచ్చిన సంగతీ, అది పిచ్చికుక్క అని నిర్ధారణకొచ్చి కర్రలుచ్చుకుని నలుగురూ తనముందే దాన్ని చంపేసిన సంగతీ పూసగుచ్చినట్టు మళ్ళీ ఏకరువు పెట్ట



పోయిందామె.

డా. రజని చిటపటలాడుతూ, 'చాల్లే పోదీ' అన్నట్టు కసిరికొట్టి, 'బజార్లో అందరి అభిప్రాయాలూ ఇక్కడ పనికి రావమ్మా, తెలిసిందా? కరిచిన మూడో నాడు ఆ కుక్క ఛస్తే అది పిచ్చికుక్కన్న మాట. ఎల్లుండి ఆ కుక్క ఛస్తే ఇక్కడకు రా. ఇంజక్షన్ రాసిస్తాను. ఇప్పటికిది చాలు వెళ్లు' మురహరిమీద కోపమంతా ఆవిడమీద కక్కేశాడు డా. రజని.

ఆవిడ కొయ్యబారిపోయింది. తనముందే చంపారు దాన్ని అని తబిసీలుగా చెబుతుంటే మూడురోజుల తరవాత అది ఛస్తే అప్పుడు రమ్మనమంటాడేమిటీయన? ఇప్పుడు బతికి మళ్లీ మూడోనాడు చావబోతుందా అది...తను పిచ్చికుక్క అని ఈ డాక్టర్లకి రుజువిచ్చేందుకు? ఆమె కర్థం కాలేదు.

'అది పిచ్చికుక్కయినా, కాకపోయినా ఒక 'ఎ. టి. యస్' ఇస్తే వొదిలిపోతుందేమో డాక్టర్' ఇష్టంగా నవ్వాడు డా. మురహరి ... ఎలాగైనా నొప్పించి ఇంజక్షన్ పొడిపించి ఆమెని పంపాలన్న ఆపేక్షలో.

'నాకు మళ్లీ చదువు నేర్పద్దు డాక్టర్ మురహరీ! ఏవో రెండుగాట్లు దిగినంత మాత్రాన కరిచింది పిచ్చికుక్కే అనేసుకుని, ఆవిణ్ణి మీరు వెనకేసుకుని వచ్చి నన్ను విమర్శించకండి మరి...ప్లీజ్...నా నిర్ణయానికి నన్ను వదలండి' అవమానకరంగా తీసుకుంటున్న ధోరణి వ్యక్తమయ్యేలా రుసరుసలాడాడు డా. రజని.

'సారీ...మిమ్మల్ని నొప్పించాలని రాలేదు డాక్టర్— పని తొందరలో ఎవరికయినా పొరబాటు దొర్లవచ్చనీ ... మీదగ్గరవున్న చనువుకొద్దీ' డా. మురహరి తన ఘోష ముగించనేలేదు, వినిపించుకోకుండా, 'స్తెతస్కోపు' మెళ్లో వేసుకుని ఉడాయిం చేస్తున్నాడు డా. రజని.

లేడీ డాక్టరు రమాదేవి ఆ 'డయలాగు' ఎప్పుడు ముగుస్తుందా అని కనిపెట్టుకూచున్నట్టు, బెల్లుకొట్టగానే పుస్తకాలు సర్దుకునే కుర్రాడిలా 'స్తెతస్కోపు' తీసుకుని సీమకుక్కలా అతనికూడా పడింది.

ఆమె కట్టుకున్న ఆరణి పట్టుచీర మిసమిసలాడింది.

'ఈయనెప్పుడూ ఇంతే' అన్నది రమాదేవి.

'తను మహా మంచివాడననిపించుకోవాలని ఘడీఘడీకీ తపన.'

'అంతేనా? దానితోపాటు ఒకళ్ల 'డ్యూటీ'లో వెరుసుతేతే. పనొకటి ఈయనకి!'

డాక్టరు మురహరి వెళ్లిపోతూ, వెనకాలే గంగిగోవులా నడుస్తున్న ఆమెకి మాత్రం వినిపించేలా, 'నేనింకేం చెయ్యలేనమ్మా' అంటూ తప్పొప్పుకున్న మంచి బాలుడిలా తలవంచుకుని గబగబా చక్కాబోయాడు, ఆవిడ ఖర్మానికి ఆవిణ్ణి వదిలి.

* * *

" 'సీరియస్' కేసొకటి వచ్చింది డాక్టర్ ..."మీరు అర్జంటుగా రావాలి" 'కర్చిఫ్'తో మొహమ్మీద చెమట సున్ని

# న్యాయంనిద్రపోయింది

తంగా పొత్తుకుంటూ వచ్చింది 'నర్సు'

'వద' మెడికల్ చెస్ట్ అందుకుంటూ నడిచాడు డా. మురహరి 'కేజువాల్టీ వార్డు'లోకి.

రోగిని చూస్తూనే స్తాన్నడిపోయాడు డా. మురహరి. మొన్న పిచ్చికుక్క కరిచి నామె!

అంతకు క్రితమే అక్కడికి వచ్చివున్న డా. రజనీకాంత్ కళ్ళల్లోకి చూశాడు అర్ధవంతంగా. కళాకాంతీ లేవతని మొహంలో. మురహరి చూపుల్లో చూపులు నిలవలేక పక్కకి తిప్పుకున్నాడు రజని.

ఆమె దవడలు బిగుసుకుపోయాయి. ఉండి ఉండి శరీరం కంపించిపోతోంది. ధనుర్వాతం! ఇద్దరు నర్సులు అదిమి పట్టినా ఆగక గింగిరాలు తిరిగిపోతోంది. పిచ్చికేకలు వేస్తూంది. విలువంపుగా శరీరం వంకరలు పోతోంది.

ఆమె పక్కగా పదిహేనేళ్ళ ఆడపిల్లా పన్నెండేళ్ళ మగపిల్లాడూ మొహాలు వేళ్ళాడ వేసుకుని దీనంగా నిలబడి వున్నారు. తేప తేపకూ ఆపద్బాంధవులయిన డాక్టర్లవంక ఆశగా చూస్తున్నారు.

మట్టూ మూగివున్న డాక్టర్లకి వాళ్ళ గోడంతగా పట్టదు. వాళ్ళ ఆపత్తుని గుర్తించే తీరికగాని, ఓదార్చే ఓపికగాని వాళ్ళకి లేదు. పరిస్థితి అలాంటిది.

వాళ్ళ ప్రస్తుత కర్తవ్యం ఎగిరిపోతున్న ఆమె ప్రాణాన్ని ఎలాగైనా పట్టుకుని నిలవడం. ఆ ప్రయత్నంలో అక్కడున్న డాక్టర్లందరూ, రజని సమేతూ, మన స్ఫూర్తిగా పాల్గొన్నారు.

కాని వాళ్ళ ప్రయత్నం వమ్మయి పోయింది. పక్షి ఎగిరి పోనే పోయింది. రోగి పూర్తిగా విశ్రాంతి తీసుకున్నది.

తోటీ మొహమ్మీద తెల్లదుప్పటి కప్పేశాడు.

ఆమె బిడ్డలు శవంమ్మీదపడి హృదయ విదారకంగా విలపిస్తున్న దృశ్యం చూస్తూంటే తన వృత్తిమీద తనకే చెప్పరాని అసహ్యం కలిగింది డా. మురహరికి. కసిగా మెడలోవున్న 'స్టెతస్కోపు'ని వూడలాగి భుజానవేసుకొని బయటకు నడిచాడు.

పిచ్చి కుక్కకాటుని అశ్రద్ధచెయ్యడం వలన మరణం సంభవించిందని 'కేస్‌షీట్' మీద 'రికార్డు' చేశాడు 'ఇన్‌ఛార్జిడాక్టరు'. అశ్రద్ధచెయ్యబడింది ఆ ఆస్పత్రిలోనే అన్న చిదంబర రహస్యం అతి లౌక్యంగా అడుగునపడిపోయింది.

* * *

సాయంత్రం ఏటిఒడ్డున పచ్చిక బయలు మీద వెల్లకిలాపడుకుని గాలిమేస్తున్నాడు రజనీకాంత్. దూరాన ఎక్కడో రేడియోలోనించీ లీలగా ఒకపాట వినిపిస్తోంది. సంగీతం లేకుండా విస్పష్టంగా ఏడుస్తున్న ఇద్దరి అమాయక వదనాలకు 'బ్యాక్ గ్రవుండ్ మ్యూజిక్'గా వినిపిస్తున్న ఆగానంలోని విషాదచ్ఛాయలు అతని మనస్సు అంతరాంతరాలలో దాగివున్న పశ్చాత్తాపాన్ని చురకత్తిలా బైటికిదూసి అతని గుండె పొరల్ని పరపరా కోస్తున్నాయి. ఆ వెనువెంటనే విధీ విరామంలేని రోగుల మూలుగులూ, అంతూపొంతూలేని వాళ్ళ సొదా, విసుగు పుట్టించే వాళ్ళ ధోరణీ గుర్తుకొచ్చి, 'ఛట్—స్వర్గానికొచ్చినా సవితి పోరు' తప్పలేదు. ఇక్కడికొచ్చినా వాళ్ళ జ్ఞాపకాలు జలగల్లా పట్టుకుని వదలటల్లేదు' అనిపించి తనమీద తనకే విసుగు పుట్టింది రజనికి.

అంతలో ఆ విషాదగీతం మారి విలాస గేయం మొదలయింది. అది 'రాక్—యన్—రోల్' కదనులో సాగిపోతోంది. దాని లయకు అనుగుణంగా రజనీకాంత్ హృదయం కూడా కులాసాగా స్వప్న లోకాలలో 'ట్విస్ట్‌డాన్సు' చెయ్యబోయింది.

'హలో' అన్న పిలుపుతో భూలోకంలోకి వూడిపడ్డాడు రజని. ఎట్టఎదుట డా. మురహరి 'పాంట్' జేబుల్లో చేతులుంచుకుని గంభీరంగా నిలబడి వున్నాడు. అతని వదనంలో విషాదచ్ఛాయలు దోబూచులాడుతున్నాయి.

'ఓహ్—మీరా? షికారుకి బయల్దేరారేమిటి?' చిరునవ్వు పెదవులమీద తెచ్చిపెట్టుకుంటూ అడిగాడు రజని.

'హు—షికార్! మాబోటి వాళ్ళ కది పడదులెండి. ఒక పేషెంటు ఇంటికి వెళ్ళి వస్తున్నాను మీరిక్కడ కనబడితేనూ, ఆగాను.'

'ఓహో! సైడ్ బిజినెస్సా?' రజని

కాంత్ కంఠంలో వ్యంగ్యం ధ్వనించింది.

'విూదయవల్ల అలాంటిదేమీ లేకుండానే రోజులు వెళ్ళ మారిపోతున్నాయి లెండి నాకు' కటువుగా అన్నాడు డా. మురహరి.

'మరి ఆపేషెంట్ మీబంధువా డాక్టర్' అని ఆంతరంగికంగా అడుగుతూ తనే ఎత్తుకొచ్చాడు రజని.

యథాలాపంగా నవ్వి,డాక్టర్లకి 'పేషెంట్లందరూ బంధువులే అంటాను డాక్టర్. ప్రస్తుతం నేను మధ్యాహ్నం మన ఆస్పత్రిలో మరణించిన 'పేషెంటు' ఇంటి దగ్గరనుంచీ వస్తున్నాను' అన్నాడు డా. మురహరి గంభీరంగా మొహంపెట్టి.

ఓ—అలాగా...వాళ్ళు మీకేమైనా...'

ఇప్పుడే చెప్పానుగదా—డాక్టరన్నవాడికి రోగులందరూ చుట్టాలే అని. వాళ్ళు దీనావస్థలో ఉన్నప్పుడు మరీ అప్తుల్లా కనపడతారేమో...మీకు ఆ అనుభూతి అప్పుడప్పుడు కలిగేవుండాలి మరి... అందుకే మనస్సాగక వెళ్ళాను.'

'అవునవును. మీ మనస్సు మహా సుతిమెత్తన...నాకు తెలియంది కాదు గదా... ఇంతకీ వాళ్ళు చాలా బీదవాళ్ళు కాబోలు నేం?' ఏదోవినాలన్న కుతూహలం ఉయ్యాల లూగింది రజనిలో. ఏపాత సంపర్కమో... ఏచీకటి వ్యవహారమో... మహా బుద్ధిమంతసంగా 'పోజు'లిచ్చేవాళ్ళ చరిత్ర కాస్త కెలికితే కొన్ని అనుకోని విడ్డూరాలు బయట పడవచ్చు!

రజనీకాంత్ ఊహలు అంతకన్న శుభ్రమైన మార్గంలో పయనించవు.

'బీదవాళ్ళేకాదు—దౌర్భాగ్యులు కూడాను' నిట్టూర్చాడు డా. మురహరి.

'పాపం' అన్నాడు రజని తప్పనిసరిగా.

'అయితే మన 'డ్యూటీ' మనం సజావుగా నిర్వర్తించిననాడు ఏది ఎలా జరగనీండి మనం చింతించాలిసిన పనివుండదు—అవునంటారా?' ఆగాడు మురహరి.

'మీరా రోజు ఏ కాస్త జాలి తలిచి సరియైన 'ట్రీట్‌మెంటి'చ్చినా ఒక నిర్భాగ్యురాలికి ప్రాణదానం చెయ్యడం కాదు, ఒక కుటుంబాన్ని మీకు తెలియకుండానే నిలబెట్టి వుండేవారు. ఇప్పుడు, రజనీకాంత్!, ఆమె ఒక్క మరణంతో ఆసంసారం నడివీధిన పడింది. ఆమె భర్త ఒక త్రాగుబోతు. తన బిడ్డలైనా మర్యాదిగా బ్రతకాలన్న పేరాశతో 'ఎలిమెంటరీ స్కూల్లో' 'టీచరు'గా పనిచేస్తోందావిడ. ఈ వేళటితో ఆమె కట్టుకున్న ఆశలగూడు బూడిద ప్రోగయింది...ఆ ఆడపిల్లలికా పెళ్ళిళ్ళు కావు. పెళ్ళికాని ఆడపిల్లలు ఎక్కడ దుకాణాలు తెరుస్తారో విూ వూహకందనిది కాదు. మగపిల్లలు దక్షతలేక అగమ్మకాకులవుతారు. రికామీగా తిరిగే కుర్ర కుంకలు సాగించే చీకటి వ్యాపారాలు మన సినీమాలు చూస్తే తెలుస్తోందిగదా.'

రజనీకాంత్‌కివినుగ్గా వుంది. డా.మురహరి హితోక్తులు ఉపన్యాస ధోరణిగానూ, ఉపదేశ ముద్రాంకితంగానూ ఉన్నాయి. కోపగించుకునేందుకుగాని, దురుసుగా ఎదురుదెబ్బ తీసేందుకుగాని వీలుగా లేవు. అదీ వచ్చిన అసిస్టెంత. మేస్టారిముందు విద్యార్థిలా తను ఉండిపోవాలిసొచ్చింది కాస్సేపు.

ఉన్నట్టుండి, 'దీనికంతటికీ కారణమెవరంటారు?' అని మెదలకుండా ఊరుకున్నాడు డా. మురహరి.

'ఎవరంటారు?' నొసలు చిట్లించాడు డా. రజని.

'మీరు కాదా డాక్టర్?' రెట్టించాడు మురహరి.

ఇక నిగ్రహించుకోలేకపోయాడు రజని.

'రోగమూ బాధా చూడగానే మీకు మల్లే మంచల్లే కరిగిపోయే దౌర్బల్యం నాకు లేదనుకోండి...అంతమాత్రాన నేను దానవుణ్ణి మీరు దేవదూతలూ అనుకునేంత వరకూ అహంకారాలు పోకండి మరి... ఎవత్తో చచ్చిందీ? దానికి నేను బాధ్యుణ్ణా...కాస్త నాలిక సంబాళించుకుని అదిరిపాటి నిర్ణయాలకి హఠాత్తుగా వచ్చే అలవాట్లు తగ్గించుకోండి డాక్టర్' దబాయించాడు రజని.

అతని మొహం ఎర్రబడింది. ముక్కుపుటాలు అదరిపోతున్నాయి.

ఎన్నడూలేనిది మురహరీ రెచ్చిపోయాడు. కంఠస్వరం హెచ్చించి తలపంకిస్తూ హేళనగా సవాలుగా—

'ఎందుకు సార్ అనవసరంగా ఆవేశం తెచ్చుకుంటారు? ఆవేళ నేను హెచ్చరించినప్పుడయినా కాస్త ఆలోచించారా మీరు? మీ నిర్లక్ష్యానికి కాదా బలయిపోయిందామె ఈనాడు? కాదని గుండెలమీద చెయి వేసుకుని చెప్పండి చూదాం' సవాల్‌చేసి రివ్వునలేచి నిలబడ్డాడు డా. మురహరి.

తమాయించుకున్నాడు డా. రజని. ఇప్పుడు తొందరపడి లాభంలేదు.

కాస్త తగ్గి సమాధానంగా గొంతు మార్చి, 'మీరు ఊరికే అపోహ పడుతున్నారు డాక్టర్. ఎవరి కర్మ కెవరు కర్తలంటారు? ఆవేళ ఆవీధిలోనే పిచ్చికుక్క కరిచిందన్న వాళ్ళు పదముగ్గురికి అయొడిన్ వేసి పంపాను...వాళ్ళందరికేమూడిందంటారా?.. ఇది ఈ విడ చేసుకున్న కర్మ—అంతే.



జడ్జిమెంటి'చ్చాడు రజని.

వింతగా చూచాడు డా. మురహరి. అదిరి పోయింది అతని గుండె. పిచ్చి కుక్క కరిచిన పదముగ్గురికి అయొడిన్ వరసగా పట్టాలుగుర్చి కరిచిన కుక్క పిచ్చి కుక్క కాకపోవచ్చంటాడు!... ఇతగాడు డాక్టరా? పిచ్చాసుపత్రికి పంపాలిసిన 'మెంటల్ పేషెంటా?'

'మైడియర్ సార్...డాక్టర్లై వుండి ఖర్మ గిర్మ అని ఒదిలేసి ఊరుకోవడం తప్పు సార్...ఇకపోతే, మీకు తెలీదేమో మీరిప్పుడు వల్లిస్తున్న వేదాంతం నాకు తెలీయదనుకోండి మరి. కనీసం మీకన్న ఎక్కువ తెలుసు...ఒకడు చేసిన ఖర్మకి ఫలితం పడ్ మంది అనుభవించేందుకు ఆస్కారముంది. అది మీకు తెలుసా అని. ఆనాడు మీరుచేసిన దుష్కర్మ ఆ నిర్భాగ్యురాలి ప్రాణం తీసింది...మళ్ళీ అంటున్నా ఆవిడ ఖర్మ అని మీ అంతరాత్మని జోకొట్టుకుంటూ నన్ను మభ్య పెట్టాలని చూడకండి. ఖర్మ!...అదే నేను ప్రస్తావిస్తుంటా ... మీరుచేసిన దుష్కర్మని గురించి...మీరుచేసిన పనికి నేనూ రమాదేవి ప్రత్యక్షసాక్షులుగా వున్నాం... అది మరిచిపోకండి' చరచరా వెళ్ళిపోయాడు మురహరి.

తేరుకోడానికి చాలాసేపుపట్టింది రజనీకాంత్‌కి.

రమాదేవిట! ఆవిడ సంగతి తనకి తెలిసుదా...ఆపరేషన్ చెయ్యాలిసిన పురిటి

# న్యాయంనిద్రపోయింది

కేసుల్ని చేతొత్తి లాగేయ్యడం తను స్వయంగా చూచాడు. ప్రాణమ్మీదకొచ్చిన కేసులు గూడా నిర్లక్ష్యంగా నర్సులమీద వొదిలేసి నిశ్చలంగా కూచోడం తానెరుగును... ఓయబ్బ!...ఆవిడగారు ఈయనకి సాక్ష్యంట! అయినా రమాదేవి తనకి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తుందా? ఫరవాలేదు. స్వగతంగా పీపుచరుచుకున్నాడు డా. రజని.

మరి ఇతని సంగతేమిటి? 'డి యం.వో'కి మిగతా ఆఫీసర్లకి ఇతని మాటంటే గురి తన పీకలమీద కేమీ తీసుకురాడు గదా! ఈఆలోచనలతో అప్పటిదాకా హుషారువున్న అతని మనస్సు వుసూరుమంది.

మొత్తానికి డా. మురహరిరావు జాలి గుండెకల వ్యక్తి. అది యథే. అంతేనా తనపనిని తాను సక్రమంగా చేసుకుపోయే మనిషి! 'డాక్టర్లకి ముఖ్యంగా ఉండవలసింది జాలి...పూర్తిగా ఉండకూడనిది నిర్లక్ష్యం. అతను అడపాతడపా వల్లించే సూక్తి ముక్తావళికి ఇవి కొన్ని మచ్చుతునకలు ఈ విడ్డూరాలు చాలవూ అతనంటే ఎవరికీ కిట్టక పోయేందుకూ, అతనంటే నలుగురూ హడిలిపోయ్యేందుకూ! ఇవన్నీ 'డి యం.ఓ'ని కాకా పట్టేందుకు మంచితనపు పెత్తాలని సర్జన్లు, నర్సులూ ఇష్టాగోష్టిలో అతని వెనకాల అనుకోవడమూ కద్దు. 'డి.యం.ఓ' మట్టుకు అలా వెలకట్టలేదు మురహరిని. ఒక ఉన్నతమైన ఆదర్శానికి అందివచ్చే డాక్టరుగా అతన్ని పరిగణిస్తూ వచ్చారు. 'డి.యం.ఓ'తో అంత చనువుగా, అంత కలుపుగోరుతనంగా, అంతా ఇష్టగోష్టిగా...ఇంచుమించు సమాన ఫాయాలో మాట్లాడగల స్తోమతు ఆసుపత్రిలో మరెవరికీ లేదు ఏమో, ఎవరు చెప్పగలరు ? 'డి యం ఓ'తో ఏ పిచ్చాపాటీలోనో... చాడీ చెప్పినట్టు అగుపించకుండానే...'స్టోర్స్'లో ఫలాని మందులు మాయమయ్యాయనీ,... ఫలాని 'వార్డు'లో. ఫలాని డాక్టరువల్ల ఫలానికేసు ఉపేక్షించడం జరిగిందనీ... లీలగా ఊదినా ఊదవచ్చును.

దొంగాడికి తన నీడే మనిషిలా అపిస్తుంది.

ఈ ప్రమాదాలని ఊహించి, లోపల కసిగా వున్నా డా. మురహరితో అందరూ పైకి ప్రీతిగావుంటూ ఆయనతో ఘర్షణకి దిగేదాకా పోవటం లేదు.

ఆస్పత్రిలో రోగుల ముక్కులూ, మూలుగులూ వినలేక విసుక్కునే డాక్టర్లూ, పేషెంట్లని దాటేసి కాస్త టైము మిగుల్చుకుందామని తాపత్రయపడే నర్సులూ కొందరున్నారు అందులో తనూ ఒకడా? అనుమానం సోకింది రజనికి.

దానికితోడు డా. మురహరి తనకంటపడినప్పుడల్లా ఏదో అదురుతుంది గుండె... దొంగాడికి సందుమలుపులో ఎర్రటోపీ ఎదురైనట్టు. అయినా తెల్లవారిన దగ్గర నించీ రోగులమధ్యా, రోగాలమధ్యా సతమతమవుతూ ఏదో కాస్సేపు నవ్వుకోకా పేలుకోకా ఎలా చచ్చేది!

ఈసారి దిక్కుమాలిన గొడవొచ్చి పడింది. డా. మురహరితో వాగ్వాదానికి దిగకుండానే దాటవేదామనుకున్నాడు. కాని కుదిరి చావలేదు.

*  *

నిజానికి డా, మురహరి ఆ రోజు ఆ 'పేషెంటు' ఇంటికి వెళ్ళనే లేదు. కాని అతని మాటలన్నీ అబద్ధాలు కావు. చనిపోయినామె తనకుమార్తె స్వర్ణ 'స్కూలు టీచరే' నని దరిమిలా తెలిసిందతనికి. ఆమెపోయిన రోజున స్వర్ణకి సెలవిచ్చారు. దేనికి సెలవు అని ఆరా తీయగా బైటపడ్డ వివరాలు స్వర్ణ ముఖతామూ, భార్య ముఖతామూ అతను తెలుసుకోడం జరిగింది,



బాధపడ్డాడు. 'ముందే తెలిసివుంటే...' అని ఏమేమో అనుకున్నాడు.

తలవని తలంపుగా ఏటిఒడ్డున రజనీకాంత్ తారసిల్లాడు. ఉండబట్టలేక పోయాడు. అతనితో మాటా మాటా పెరిగింది. మెత్తగా తెలియజెప్పా లనుకున్నాడు. కాని సాధ్యంకా లేదు. రజనిచేసిన వితండ వాదంతో తనూ పట్టాలు తప్పాడు. ఆఖర్న తన బెదిరింపుతో రజనీకాంత్ చలించిన మాట నిజం — అనుకోకుండా గద్దించాడు తను.

ఆ మాత్రం మోతాదులో వుంటేనే గాని రజనిలాంటి బద్ధకస్తులకి ఏపాటి హితబోధా పనిచెయ్యదని అతని వుద్దేశ్యం.

* * *

'డి. యం. ఓ' మారటంతో ఆస్పత్రిలో తనకుగల గౌరవం తగ్గినట్టు తెలుసుకున్నాడు డా. మురహరి. అంతేకాక కొంతమంది కొత్త 'డి. యం. 'తో కలిసి తనమీద ఏదో గూడుపుఠాణీ చేస్తున్నట్టుగూడా విన్నాడు.

దాని కతను భయపడలేదు.

తన 'డ్యూటీ' తను సవ్యంగా నిర్వర్తించి నన్నాళ్ళూ తనకెవరి భయమూ లేదన్న భరోసామీద వున్నాడు. మంచివాడికక్కడే ప్రమాదం! ముందూ వెనకా గోతులు కనబడవు. నిజానికి అతనెన్నడూ 'డి. యం. 'తో వాళ్ళమీద వీళ్ళమీద చాడీలుచెప్పి దొంగదెబ్బలు తియ్యలేదు. అది అతని మనస్తత్వానికే వ్యతిరేకం.

ఒకనాడు తన డ్యూటీ ముగించుకుని ఇంటికి వెళ్ళిపోతూ అలవాటుగా 'వాష్ బేసి'న్లో మొహం కడుక్కుందుకు 'బాత్ రూం'లోకి వెళ్ళివస్తున్న మురహరికి తన గదిలోనించీ బయటకు వెడుతున్న రజనీకాంత్ కనిపించాడు.

ఇన్నాళ్ళూ మొహం తప్పిస్తున్న రజనీకాంత్ ఈవేళ తన 'రూం' లోకి ఎందుకు వచ్చినట్టు?

ఆలోచిస్తూ కోటు భుజాన వేసుకుని ఆస్పత్రి దాటుతున్న డా. మురహరిని అటు ఇద్దరూ, ఇటు ఇద్దరూ వచ్చిన వ్యక్తులు, 'ఆగండి' అంటూ నిలేశారు.

పట్టపగలు నడిరోడ్డుమీద బందిపోటా? దిగ్భ్రాంతిలో మునిగివున్న మురహరితో 'మేము 'సెంట్రల్ ఇన్‌టెలిజెన్సు ఆఫీసర్లం' మీరు ఆస్పత్రిలోనించి 'మెడిసిన్స్' ఇంటికి జారేస్తున్నట్టు మాకు 'రిపోర్టు'లు వచ్చినై. మిమ్మల్ని 'చెక్' చెయ్యాలి' అని అటకాయించారు.

'యువర్ సనద్ ప్లీజ్' అని మురహరి చెయ్యి జాపాడు. తమ అధికార పత్రాలను చూపారు.

ఆ అయోమయ స్థితిలోనే 'ఓ. యస్— చెక్ చేసుకోండి' అన్న మురహరికి చటుక్కున తన 'రూం'నుంచి జారుకుంటూ కనిపించిన రజని తళుక్కున మెరిశాడు. అప్పుడు తన కోటు కుర్చీకివేళ్ళాడుతోంది.

'ఆగండి' అన్నమాట తెలీని నోటా వుండగానే, 'ఇదిగో' అంటూ అతని కోట జేబులోంచి తీసిన 'ఇంజక్షన్ బాటిల్స్' అతని కళ్ళముందుంచారు.

నిర్జీవంగా నవ్వుకున్నాడు డా. మురహరి.

కొన్ని క్షణాలలో కొత్త 'డి. యం. ఓ' ముందు దోషిగా నిలబడ్డాడు డా. మురహరి.

మర్నాడు 'సస్పెన్షన్' ఆర్డరు వచ్చింది.

ఎట్టయెదుట శిలావిగ్రహంలో గాంధీ గుండుదెబ్బ తిన్నట్టు మొహం పెట్టాడు.

న్యాయం నిద్రపోతోంది!

అన్యాయం ఒళ్ళు విరుచుకుంది!!



# వారఫలం

## 13-6-1969 శుక్రవారం మొదలు 19-6-1969 గురువారం వరకు

**మేషం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**వృషభం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడుతాయి... మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో తిరిగి అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం** అన్ని వ్యవహారాల్లోనూ గౌరవ ప్రాబల్యాలు ఉంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు — సంతోషకరమైన వార్తలను వింటారు. పోటీవారితో గౌరవం బాగా ఉంటుంది.

**తుల:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడుతాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం:** భాగస్వాములతోకలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. అధికవ్యయం జరుగుతుంది.

**ధనుస్సు:** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** వృత్తిలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో మాటపట్టింపులు తగవు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కుంభం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్

# బ్రూక్ బాండ్ బ్రూ ఇన్‌స్టెంట్

## క్షణంలో తయారు! కప్పులకొలది సంతృప్తి!

బ్రూ చెయ్యడం అతి సులభం! వేడినీళ్ళు, రుచికై పాలు, పంచదార కలపండి అంతే. నిజమైన కాఫీ చికరి సువాసనతో మీకు హాయి కొలిపే బ్రూ క్షణంలో తయారవుతుంది!

జ్ఞాపకం ఉంచుకోండి, హడావిడి గాని, గొడవ గాని, వడపోయటంలో సమయనష్టం గాని బ్రూ తో లేదు.

అదీ గాక మీ రుచికి తగినట్లుగా, కప్పుకి కొంత హెచ్చుగా గాని తక్కువగా గాని కలిపి తగురీతిగ చేసుకోవచ్చును.

బ్రూ కొరకు అడగండి— కాఫీ చికరి ఎలా రుచించాలో తెలిసిన బ్రూక్ బాండ్ నిపుణులచే, జాగ్రత్తగ కలుప బడినది.

ఇది క్షణంలో అయ్యేది!
సమయం మిగిలిస్తుంది!
డబ్బు ఆదా చేస్తుంది!



సీరియల్



# బ్రతుకు బాట

పి. సత్యవతి

**2**

'మీరెక్కడుంటారు?' అన్నది ప్రక్క కుర్చీలో కూర్చున్న అమ్మాయి.

ఆ అమ్మాయి తెల్లగా సన్నగా సన్నజాజిపువ్వులా వుంది. చక్కగా నవ్వుతుంది.

సుమిత్ర జవాబుచెప్పి ఆ ప్రశ్నే మళ్ళీ అడిగింది.

'నాన్నగారు బ్యాంక్ ఏజెంట్ - మేం గాంధీనగరంలో వుంటాం. ఈ వూరు కొత్తగా వచ్చాం' అన్నది కుముదిని.

క్లాసు అయిపోయాక చనువుగా భుజం మీద చెయ్యివేసి, 'రండి మా కారులో గాంధీనగరం దగ్గర డ్రాప్ చేస్తాను' అంది.

**మూడురోజుల తరువాత వాళ్ళిద్దరూ 'మీరు' అనుకోడం మానేసి పేర్లతో పిలుచుకుంటూ చెట్టాపట్టాలేసుకు తిరగడం మొదలుపెట్టారు.**

**స్కూలు వదలిపెట్టిన రెండేళ్ళనుంచీ ఇంట్లోనే వుంటూ ఒకవిధమైన మందకొడితనానికి అలవాటుపడ్డ సుమిత్ర కి, మళ్ళీ కాలేజి జీవితం ఉత్సాహాన్ని చైతన్యాన్ని కలుగజేసింది.**

'మా కారులో మా ఇంటిపరకు వచ్చి అక్కడ బస్సెక్కి వెళ్ళరాదూ, సగం దూరం తగ్గుతుంది' అన్నది కుముదిని, **జాలాపడ్డ.**

వెంటనే వొప్పుకుంది సుమిత్ర.

ప్రొద్దున గబగబ పన్లు పూర్తిచేసుకొని తొమ్మిదిగంటల కంతా కుముదిని ఇంటికి వచ్చేది సుమిత్ర. అక్కడనుంచి ఇద్దరూ కలిసి కాలేజికి వెళ్ళేవారు.

తన బస్సు ఖర్చులకోసం వుంచుకున్న డబ్బులో సగం మిగిలిపోయింది ఆ నెలలో. కుముదిని ఇంటిదగ్గరే వున్న టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరింది వెంటనే సుమిత్ర.

రఘు పంపుతున్న డబ్బు తన ఖర్చులకీ, అమ్మ మందులకీ పోగా ఇంకా వదో, పాతికో మిగులుతూనేవుంది.

ఒకనెలలో పిల్లలకి బట్టలు కుట్టించింది. తరువాతోమాటు వదినెకీ తనకీ చీరెలు తీసుకుంది. రఘు పంపేడబ్బు సుమిత్ర పేరునే కాలేజి ఎడ్రస్‌కి వచ్చేది, **ఆమె కోర్కె ప్రకారం.**

**తల్లికి మందులవీ సుమిత్రే కొనడంతో కొంత ఊపిరి వచ్చింది మాధవరావుకి. అంతక్రితం ఏనెలకానెల గడవడం చాలా** కష్టం అయ్యేదతనికి. గృహిణి పొదుపరితనంవల్ల ఎలాగో నెట్టుకువచ్చేవాడు.

తను కుదిర్చిన సంబంధం చేసుకోలేదనే కినుక కొంచెం సడలసాగింది.

ఏ సంఘటనకైనా కాలక్రమేణా ప్రాముఖ్యం తగడం జీవనసహజంకదా!

**అందుకనే రఘు వివాహం విషయం ఆ ఇంట పాతబడిపోసాగింది.**

**కానీ** అన్నపూర్ణమ్మగారి హృదయంలో గాయంమాత్రం మానడం లేదు. అది విస్తరిస్తూనే వుంది. మంటలెత్తిస్తూనే **వున్నది. అప్పుడప్పుడూ కొడుకూ కోడలూ, కూతురూ పలికే సాంత్వన వచనాలవలన మనస్సుకి కొంత ఊరట కలిగినట్లు అనిపించినా, మళ్ళీ హృదయంలో గాయం పలవరింతలు** పెడుతూనే వున్నది.

'ఈ మాత్రలు రోజుకి రెండువేసుకోవాలని డాక్టర్‌గారు చెప్పారుగా? మరి వేసుకోలేదేం?' అని సుమిత్ర మందలిస్తే,

'శరీరజాడ్యాలకు మందులూ మాకులూ పనిచేస్తాయి. నా జబ్బుకీమందులేవీ పనిచెయ్యవు—నన్ను విసిగించక నీపని నువ్వు చేసుకుపో!' అనేది ఆవిడ.

'మానసిక జాడ్యాలకూ మందులున్నాయమ్మా! శరీరం ఆరోగ్యంగా వున్నప్పుడు మనస్సుకికూడా కొంత విశ్రాంతి చిక్కే మాట అబద్ధం కాదు' అని చెప్పేది సుమిత్ర.

చిన్నతనంనుంచీ రఘుమీద వెర్రి మమకారం ఆవిడకి.

దానికి కారణం లేకపోలేదు.

**మాధవరావుకీ,** విమలకీ వయస్సు తక్కువే తేడావుంది, కానీ విమలకీ రఘుకీ మధ్య ఏడేళ్ళ వ్యత్యాసం వుంది. మళ్ళీ రఘుకీ సుమిత్రకీ అయిదారేళ్ళ తేడా వుంది. మాధవరావూ, విమలా తనదగ్గర ఎక్కువ చనువుగా పెరగనేలేదు అప్పుడు అత్తమామలు బ్రతికివుండటం మూలంగా వాళ్ళే పిల్లలను గారంగా చూసుకుంటూ తన దగ్గరకి రానిచ్చేవాళ్ళుకారు. ఆ పిల్లలిద్దరూ బడికిపోవడం మొదలుపెట్టాక రఘు పుట్టాడు. అప్పుడు మామగారు **లేడు. అత్తగారుకూడా మంచాన పడిపోయింది.**

**ఇంట్లో** పనులన్నింటికి **మనుష్యులు** వుండేవారు. బట్టలు ఉతికే చాకళ్ళు, వంటకి అవ్వగారు, పాలేళ్ళు కావలసినంత మంది తనకి ఇంట్లో పనేమీ వుండేది కాదు రఘుతో ఆడుకోడం, వాడి పనులన్నీ స్వయంగా చూడడం, యిదే రోజంతా సరిపోయేది. దానికి తగ్గట్టు వాడు ముద్దుగా

బొద్దుగా వుండేవాడు. మొదటినుంచీ పెద్దపిల్లలిద్దరిమీదకన్న రఘు మీదనే ఎక్కువ ప్రేమగా వున్నట్లనిపించేది తనకీ. సుమిత్ర పుట్టేసరికే ఆ ఇంటి పరిస్థితులన్నీ తారుమారయ్యాయి. విమలకి జరిగినంత ముద్దు సుమిత్రకి జరగనే లేదు

సుమిత్రకి పదినెలలవయస్సు వచ్చేసరికి అన్నపూర్ణమ్మగారు భర్తృవిహీన అయింది. కుటుంబభారం మాధవరావు పైన పడింది. భర్త పోయిన చిరాకు, దుఃఖం అన్నీ కలసి సుమిత్రని విసుక్కునేటట్లు చేసేవి.

సుమిత్రకి ఒకళ్లతో పనిలేదు. తనకి తనే ఏ మట్టిలోనో చెట్ల చాటునో, నీళ్లదగ్గరో ఆడుకుని ఆకలి అయినప్పుడు ఇంట్లోకి వచ్చేది. పెట్టిన ఆహారం గుట్టుగా తినేసి నిద్రపోయేది. కానీ రఘు అలాకాదు. తినడానికి నిద్రపోవడానికి అన్నింటికీ పేచీలే. అంత దుఃఖంలోనూ వాడిని బ్రతిమిలాడి అన్నం తినిపించేది తను. వాడు చాలా తెలివికలవాడనీ, అదృష్టవంతుడనీ, పెద్దచదువు చదివి పెద్ద ఉద్యోగం చేస్తాడనీ, ఏదో గుడ్డినమ్మకం వుండేది తనకి మొదటినుంచీ. జీవిత శేషభాగాన్ని చిన్నకొడుకు దగ్గర గడపాలనే కల ఈనాటిది కాదు. ఇరవైఏళ్లుగా హృదయంలో దాగిన కల అది. ఈ నాటికి కరిగిపోయింది. బాగా చదువుకున్న అందమైన యువతిని కోడలుగా తేవాలని, వాళ్ల దగ్గర తానుండాలనీ ఎన్నో ఆశలుండేవి. అవి అణగారిపోయాయి. ఈ నాటికి ఆవేదన ఎలా చల్లారుతుంది? అది ఆరని జ్వాల.

మతాలూ, కులాలూ ఈనాటివికాదు ఆయా మతాలకూ, ఆయా కులాలకూ వుండే ఆచార వ్యవహారాలూ, నియమ నిష్ఠలూకూడా ఈనాటివి కాదు. వాటిని అతిక్రమించడం తాను సహించలేదు. తనలో ప్రవహిస్తున్న సనాతన హిందూరక్తం, తన ఇంట్లో అన్యకులస్థులు అడుగుపెట్టి తమలో ఒకరుగా కలిసి పోవడాన్ని అంగీకరించదు. సాంఘిక నియమాలను ఉల్లంఘించడాన్ని సంతోషంగా సమర్థించదు. ఆచారానికీ, అనురాగానికీ మధ్య జరుగుతూన్న సమరంలో ఆచారమే నెగ్గింది. హృదయం శిలకావాలి. అంతే!

నవనాగరికంగా అలంకరించుకుని కారులో కాలేజికి వచ్చే కుముదినిమీదకూడా ఆవిడకి సదభిప్రాయంలేదు.

'ఇంత డబ్బుండీ హాయిగా పెళ్లి చేసుకోక ఈ చదువు ఎందుకు? ఈ షోకు లెందుకూ?' అంటూ వుండేది.

క్యాలెండర్లో నాలుగు కాగితాలు చిరిగిపోయాయి. దీపావళి వెళ్లిపోయింది. చలి ప్రవేశించింది.

ఒకరోజు ఉదయమే మాధవరావుని నిగ్ర



# బ్రతుకు బాట

దేసింది అన్నపూర్ణమ్మగారు.

'ఒరే! మాధవా! నాకిన్ని మందులు తెస్తున్నావు! సుమిత్రని చదివిస్తున్నావు. పిల్లలకీ మీ ఆవిడకీ ఈమధ్య బట్టలు కొన్నావు! ఈ డబ్బంతా ఎక్కడిది రా నీకు? ఇంత సంపాదిస్తూ చెల్లెలి పెళ్ళిమాట తలపెట్టవెందుకని? నాకివాళ ఏ సంగతీ చెప్పిగానీ కదలకు!' అంటూ మొండికేసుకుని కూర్చుంది.

ఆవిడకీ మధ్యకాలంలో చాదస్తం ఎక్కువైందని అందరూ అంటూనే వున్నారు. ఉన్నట్టుండి తల్లి వేసిన ప్రశ్నకి తడుముకోకుండా సమాధానం చెప్పలేకపోయాడు మాధవరావు.

అతను జవాబుకోసం వెతికే సమయంలోనే అతని పెద్దకొడుకు విశ్వనాథం రంగంలో ప్రవేశించి, 'నా మాటంటే బామ్మకి నమ్మకం లేనేలేదు. చిన్నత్తకి బాబాయి డబ్బు పంపుతున్నాడని నిన్ననేగా బామ్మకి ఋజువు చేశాను. చిన్నత్త అలమార్లో బాబాయి వ్రాసిన ఉత్తరాలు, రశీదులు నాకు దొరికాయికదా!' అనేశాడు.

వంట ఇంట్లో స్టౌదగ్గర కూర్చుని కాఫీ కలుపుతూన్న ఇందుమతి కొడుకు వంక కోపంగా చూసి, 'ఏయ్ విస్సూ, ఇలా రా ఓసారి' అని పిలిచింది.

ఆ అబ్బాయి అదేమీ వినిపించుకోకుండా ''బాబాయి ఎంత మంచివాడు, చక్కగా చిన్నత్తకి బోలెడు డబ్బు పంపుతాడు! నాకోసం డిక్షనరీకూడా పంపిస్తానన్నాడూ!' అంటూ గంతులు పెట్టడం సాగించాడు.

టూత్ బ్రష్ నోట్లో పెట్టుకుని పెరట్లో నుయ్యిదగ్గర శిలలా నిలబడిపోయింది సుమిత్ర.

తల్లి ఎదుట పడడానికి భయపడింది క్షణం.

'ముసలిదాన్ని చేసి అందరూకలసి నన్ను ఏడిపిస్తున్నారా! మీరందరూ ఒకటే— నేనొక్కదాన్నే వేరు. మీవన్నీ మీనాన్న గుణాలే—ఈ కొంపకి సగం అనర్థం ఆయన తెచ్చారు? మిగతా సగం మీరు తెచ్చారు—నేనెంత ఏడిస్తే ఏం లాభం! అంతా జరిగిపోయాక!' కళ్ళు తుడుచుకుంటూ, హీనకే కంఠంలో ఆయాసంతో అన్నది అన్నపూర్ణమ్మగారు.

'ఊరుకో అమ్మా! నేను చెప్పేది సావధానంగా విను!' అన్నాడు మాధవరావు, ఆవిడ ప్రక్కన కూర్చుంటూ.

'నువ్వేం చెప్పక్కర్లేదు నాయనా! నాకన్నీ తెలుసు! ఇల్లు అమ్మితే నీకు వుండడానికి కొంప వుండదని నువ్వు అమ్మనియ్యవు— కులంలో దాన్ని చేసుకుంటే అమ్మా, చెల్లెలూ వచ్చి తనింట్లో వుంటారేమోనని వాడీపనిచేసి నెలకి పాతికో పరకో పంపి చెయ్యి దులుపుకుంటున్నాడు వాడు! ఈ పిల్లకి ఆడబ్బుతో చదువుకుంటే గాని నిద్రపట్టదు—రేపొద్దున ఉద్యోగం చేసి ఇదికూడా ఎవర్నో చేసుకుపోతుంది. ఇక నువ్వూ నేనూ ఇక్కడే ఇలాగే వుండిపోదాం!' వెక్కిళ్ళు పెడుతోంది ఆవిడ.

'చూడమ్మా—నీవాళ్ళు మంచిదిగాక—ఊరికే ఆవేశపడకు—అక్కకి పదిహేనేళ్ళకి పెళ్ళిచేసి పంపించావు—ఏడుగురు పిల్లలతో అదిప్పుడు ఎంత అవస్థ పడుతోందో నీకు తెలుసా! చాలీచాలని సంపాదనతో వాళ్ళు ఎలా వున్నారో ఊహించగలవా? ఈ రోజుల్లో నా వయస్సు పెళ్ళికింకా మించిపోయినట్లు అనుకోకూడదు— కొంచెం ఆలోచించమ్మా!' తల్లి భుజం మీద చెయ్యివేసి నెమ్మదిగా, అనునయంగా అన్నది సుమిత్ర...

'రఘు మనకి పరాయివాడా ఏమిటండీ! తల్లికీ చెల్లెలికీ అతనెంతో ప్రేమగా డబ్బు పంపుతున్నాడు. ఈ రోజుల్లో ఎంత మందికి వుంటున్నాయి అలాంటి ఆపేక్షలూ. సుమిత్రకి చదువుకోవాలని వుంది. చదువుకుంటోంది. ఆ అమ్మాయి చాలా తెలివికలది. వివేకంలేనిపని ఒక్కనాటికీ చెయ్యదు. మీ పిల్లలమీద మీకే నమ్మకం లేకపోతే పరాయివాళ్ళకుంటుందా!' అన్నది ఇందుమతి కాఫీగ్లాసుతెచ్చి అత్తగారి ప్రక్కనపెట్టి.

'కాఫీ తీసుకో అమ్మా — అనవసరంగా బాధపడకు—కాలానుగుణంగా ఆలోచించడం వివేకవంతుల లక్షణం. జీవితంలో అడుగడుగునా మనకిష్టమైన సంఘటనలే జరగవు—సంతోషాన్నీ దుఃఖాన్నీ సమానంగా ఆహ్వానించడం నేర్చుకోవలసిన వయస్సు నీది' అన్నాడు మాధవరావు గ్లాసు తల్లి నోటిదగ్గర వుంచి.

రెండు నిమిషాలు మౌనంగావుండి, గ్లాసు తీసుకుని తన మంచం దగ్గరకి నెమ్మదిగా వెళ్ళిపోయింది ఆవిడ, బరువైన హృదయంతో.

* * *

'మీ అమ్మగారు చాలా బలహీనంగా వున్నారు. అసలు జబ్బేమిటే!' అన్నది కుముదిని ఓరోజు సుమిత్ర ఇంటికి వచ్చినప్పుడు ఇద్దరూ కలిసి డాబామీద కూర్చుని నోట్సు వ్రాసుకుంటూ వుండగా.

'అమ్మ జబ్బుని గురించి చెప్పాలంటే



చాలా చెప్పాలి వినే ఓపిక నీకు వుంటే!' అని నవ్వింది సుమిత్ర.

'నువ్వు చాలా గంభీరమైన మనిషివి. అందుకే నువ్వంటే నాకు చాలా యిష్టం. నిన్ను గురించి ఎంత చెప్పినా నాకు వినాలనే వుంటుంది—' అన్నది కుముదిని మెచ్చుకుంటూన్న కంఠంతో.

పడమటి ఆకాశంలో మారుతూన్న రంగులని చూస్తూ.

'జీవితంలో కష్టాలూ, బాధలూ మనుష్యులకి అనేక పాఠాలు చెప్తాయి—వీటిల్లో నుంచీ వివేకాన్ని సంతరించుకోగలవాళ్లూ వుంటారు, డీలాపడిపోయి మరింత కృంగిపోయేవాళ్లూ వుంటారు. వజ్రానికి సాన పడితే మెరుపు పెరిగినట్లు బాధలవలన వ్యక్తిత్వం మరింత గట్టిపడుతుందనుకుంటాను నా జీవితం అలాంటిది కుముదినీ—' అన్నది సుమిత్ర.

'నువ్వు చాలా పెద్దమాటలు మాట్లాడతావు. ఇవన్నీ ఎలా నేర్చుకున్నావో! ఇంతకీ అమ్మగారి సంగతి చెప్పావుకాదు—'

'ఎస్సెల్సీ ప్యాసయినాక రెండేళ్లు ఇంట్లో వుండిపోయాను. అప్పుడు వీలైనన్ని పుస్తకాలు చదినాను — అదృష్టవశాత్తూ అవి మంచిపుస్తకాలు — సరే అమ్మసంగతి అడిగావుకదూ! చెప్తాను విను—'

'చెప్పు—'

'అనగా అనగా నాకో అన్నయ్య—ఎం. బిస్సీ. చదివాడు. ప్రస్తుతం వైజాగ్‌లో మంచి ఉద్యోగంలో వున్నాడు. వాడికి పెళ్లి చేసి, వచ్చేకట్నంలో నాకూ చేసెయ్యాలని అమ్మ అనుకుంది. కానీ అన్నయ్య రాధ అనే అమ్మాయిని చేసేసుకున్నాడు. కట్నం కొరతవలన నా పెళ్లి ఆగిపోయింది. నన్ను చదువుకోమని అన్నయ్య డబ్బు పంపుతున్నాడు, అది అమ్మ కిష్టంలేదు. కోడలు కులం వేరని మరోక బాధ. క్లుప్తంగా యిదికథ. యివ్వాళ్టికి యిది చాలు. అమ్మకి బ్లడ్ ప్రెషర్‌వుంది. పెరాలిసిస్ వచ్చే ప్రమాదం వుందని డాక్టర్ అన్నాడు—ఆవిడ ఇంకెలావుంటుంది మరి!' అన్నది సుమిత్ర బాధని దాచుకోడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ ...

'ఒక్కొక్కసారి అనిపిస్తుంది. ఆమె వింత బాధపెట్టి చదువుకోకపోతేనేం?

అని— కట్నం తక్కువయిచ్చి ఎవరో ఒకర్ని పెళ్ళాడి అమ్మని సుఖపెడదామా అనిపిస్తోంది. కాని ఆ వూహకి నేను చాలా భయపడుతున్నాను కుముదినీ. అంత త్యాగం నేను చెయ్యలేకుండా వున్నాను. అమ్మబాధ చూడలేకుండా వున్నాను— ఒక్కొక్కరోజు అమ్మ నిద్రపట్టక చాలా బాధపడుతూంటుంది. ఎంత బ్రతిమిలాడినా స్లీపింగ్ టాబ్లెట్ వేసుకోదు కావాలనే నన్నలా శిక్షిస్తుందేమో తెలీదు—' అన్నది సుమిత్ర మళ్ళీ.

'పెద్దవాళ్ళతో వచ్చిన చిక్కే అది!' అన్నది కుముదిని.

'పెద్దవాళ్ళమీదవుండే గౌరవంకొద్దీ మన ఆశలనీ భవిష్యత్తునూ తెగగొట్టుకోనూలేము, వాళ్ళు బాధపడుతూవుంటే చూస్తూ వుండనూ లేం. నా పరిస్థితి ఇలా వుంది!' అని నిట్టూర్చింది సుమిత్ర.

'ఆవిడ ఉద్దేశ్యాలలో మార్పుకోసం ప్రయత్నించి చూడకపోయావా?'

'అదీ చూశాను. క్రొత్తలో నామాటలకి ఆవిడ కోప్పడేది—తరువాత వినుక్కుని నన్ను వెళ్ళిపొమ్మనేది ఇప్పుడు ఏమీ అనదు—విని ఊరుకుంటుందంతే...'

'అంటే ఆవిడలో పరివర్తన కలుగుతోందన్నమాట!' అన్నది కుముదిని—

సంధ్యాకాశంలో రంగులు చీకటి తెరల వెనక్కి తప్పుకున్నాయి. ఆకాశంలో నక్ష

# బ్రతుకు బాట

త్రాలు మొలుస్తున్నాయి. డాబానిండా నిరాశలాంటి చీకటి అలుముకుంటోంది.

'వెడదాం పద — మీ కారు వస్తున్నట్లుంది.' అన్నది సుమిత్ర దూరంగా కనిపించిన వెలుగు వంక చూసి.

ఇద్దరూ మెట్లు దిగి వచ్చారు—

కుముదిని కారు కదలగానే వెనక్కి తిరిగి వచ్చి వరండాలో కుర్చీలో కూలబడింది సుమిత్ర.

తల బరువుగా వున్నట్లుంది.

వారం రోజులుగా అమ్మ ఆరోగ్యం ఏమీ బావుండలేదు. నీరసం ఎక్కువైంది. ఆవిడ ఆరోగ్యం మరీ దిగజారి పోవడానికి కారణం తనూ, తను అన్నయ్యా యిద్దరేనేమో!

పరీక్షలు దగ్గర కొచ్చేశాయి. ఇంత కాలం కష్టపడి చదువుకున్న చదువు ఎలా వొడ్డున పడుతుందో! చదవాలని పుస్తకం తీసుకుంటే, అందులో దీనంగా చూస్తున్న అమ్మ బొమ్మే కనపడుతూంది.

కాలం పరిగెడుతోంది. దానితో పోటీ పడి మనుష్యులూ పరిగెడుతున్నారు. కానీ తమ జీవితాలలో ఏదో స్తంభన ఏర్పడుతున్నట్లనిపిస్తోంది.

'స్నానం చేయకపోయావా?' అన్నది ఇందుమతి వరండాలో లైటు వేసి. సుమిత్ర ఏమీ మాట్లాడ లేదు.

'అట్లా దిగాలు పడి కూర్చుంటే ఎలాగమ్మాయ్! పరీక్షలు నెలైనా లేవు —లేచి స్నానం చేసి చదువుకో! హాయిగా వుంటుంది. కాఫీ కావాలంటే యిస్తానులే —' అన్నది ఇందుమతి మళ్ళీ బోధ చేస్తున్నట్లు.

విశ్వం, సావిత్రి, చిట్టి, పుస్తకాలు తీసుకొనివచ్చి చాపమీద కూర్చున్నారు.

'నువ్వూ రా అత్తయ్యా!' అని పిలిచింది సావిత్రి.

సావిత్రికి అత్తయ్యంటే చాలా ఇష్టం. అత్తయ్య చదివేది చాలా పెద్దచదువు అనీ, తనూ అలా చదవాలనీ కలలు కంటూ వుంటుంది.

'వస్తానుండు సావిత్రీ!' అని గభాలున లేచి వెళ్ళిపోయింది సుమిత్ర.

స్నానంచేసి అలమారలో పుస్తకాలు తీసుకుంటూ. మంచంమీద పడుకున్న తల్లి వంక ఒకసారి చూసింది. వెలుగులేని కళ్ళతో ఇంటి కప్పుకేసి చూస్తూ పడుకుంది ఆవిడ.

'ఇక్కడ ఉక్కగా వుంది. నీ ప్రక్క వరండాలో వేయనా?' అని అడిగింది ఆపేక్షగా ఆమెమీదకి వంగి.

'ఇలా కూర్చో!' చెయ్యిపట్టుకుని నెమ్మదిగా అన్నది అన్నపూర్ణమ్మగారు. ఆవిడ తనని అంత ప్రేమగా పిలిచి చాలాకాలమైపోయింది. ఒక్కుమ్మడిగా పొంగిన ఆ ప్రేమవాహిని సుమిత్ర కళ్ళల్లో అట్టడుగు పొరల్లో దాగిన నీటి జలని పైకి చిమ్మింది.

ఇష్టులైన వారినుండి దూషణ తిరస్కారాలను తట్టుకోడం ఎంత కష్టమో! ఒక్కొక్కసారి ప్రేమాభిమానాలకు తట్టుకోడం కూడా అంత కష్టమే!.

'చెప్పమ్మా!' అన్నది సుమిత్ర చీర కొంగుతో కళ్ళు తుడుచుకుని.

'నువ్వంటే నాకేం కోపంలేదు— బాగా చదువుకుని పరీక్షలో నెగ్గు—దిగులు పెట్టుకోకు! వెళ్ళు!' అనేసి గోడవైపు తిరిగి పడుకుంది ఆవిడ, ఇంకేమీ మాట్లాడడం యిష్టంలేనట్లు.

అయిదునిమిషాలు అలాగే మంచంమీద కూర్చుని లేచి వెళ్ళిపోయింది సుమిత్ర.



సుమిత్ర చదువుకోడం పూర్తిచేసి, భోజనం కానిచ్చుకుని ప్రక్కమీదకి చేరేసరికి పదకొండుగంట లౌతుంది. వరండా అంతా మల్లెపూలు వెదజల్లినట్లు వెన్నెల పరచుకుంది. తల్లిని నెమ్మదిగా లేవదీసి ఆమె మంచం తన ప్రక్కనేవేసి పడుకోబెట్టి స్లీపింగ్ డోస్ యివ్వబోయింది సుమిత్ర.

'ఒక్కొక్కళ్ళకి జ్ఞానోదయం కావడం చాలా ఆలస్యం అవుతుంది చిన్నమ్మాయ్! కాలాతీతమైన ఈ కనువిప్పువల్ల ప్రయోజనం శూన్యం!' అన్నది అన్నపూర్ణమ్మగారు.

తల్లి కళ్ళల్లోకి ప్రశ్నార్థకంగా చూసింది సుమిత్ర. ఏదో చెప్పాలనే ఆరాటం అంతులేకుండా వుంది ఆ వృద్ధమూర్తి కళ్ళల్లో, ముడతలు పడిన వదనంలో!

'నువ్వు చెప్పింది మొదట్లో నాకు అర్థం కాలేదు— ఇప్పుడిప్పుడు అవుతోంది. నేనూ పురాణాలు, భారత భాగవతాలూ చదివాను. కానీ వాటిలో వుండే భావాన్ని అవి చాటి చెప్పిన సత్యాన్నీ జీర్ణించుకోలేక పోయాను' ఆయాసంతో ఆగిపోయింది.

ఇంత విజ్ఞానయుతంగా ఆవిడ మాట్లాడడం సుమిత్ర ఎప్పుడూ వినలేదు—

దీపం ఆరిపోబోయే వేళకు ఒక్కసారి గుప్పుమని కాంతి విరజిమ్మి, చటుక్కున ఆరిపోయి పూరుకుంటుంది.

'వాడు చేసిన తప్పేమీ లేదు. నాకు వాడిని చూడాలనుంది, రేపు టెలిగ్రాం యిప్పించు—' అన్నది ఆవిడ చివరికి.

సంభ్రమాశ్చర్యాలతో అమ్మ వంక చూసి, 'నిజంగా?!' అన్నది సుమిత్ర.

'నేనింకా ఎక్కువ కాలం బ్రతకను—నా జీవితమంతా వేదనతోనే గడిచిపోయింది. చివరికైనా ప్రశాంతంగా, సంతోషంగా పోవాలనుంది చిన్నమ్మాయ్! మాధవుడితో చెప్పి రేపు రఘునీ కోడల్నీ రమ్మని టెలిగ్రాం యిప్పించు—'

స్లీపింగ్ టాబ్లెట్ వేసుకుని కళ్ళు మూసుకున్న తల్లికి మెడ వరకూ దుప్పటి కప్పి విడిన జుత్తు ముడి వేసింది సుమిత్ర. ఆవిడ ముఖంలో గాంభీర్యం కనపడింది ఇన్నాళ్ళకి.

సంతోషం పెద్ద జబ్బులకైనా ఔషధమే. కానీ ఇంత నీరసం మీద అమ్మ సంతోషాన్ని కూడా భరించలేదు — ఆమె శరీరంలో ఏ మాత్రం బలం వున్నా ఈ జ్ఞానోదయమనే దీపం సహాయంతో రుగ్మతల చీకట్లను పారద్రోం గలిగి వుండేది. ఆమె చెప్పినట్లు అంతిమ దినాలు సమీపించిన మాట నిజమే!

రఘుని ఆహ్వానించడానికి పెద్దన్నయ్య ఏమంటాడో!

వియత్పథంలో ప్రయాణంచేస్తూ జరిగి జరిగిపోతున్న తెల్లని మబ్బుతునకలనూ, చంద్రుడినీ చూస్తూ పడుకున్న సుమిత్రకి నిద్ర రాలేదు. తెల్లవారడం కోసం నిరీక్షిస్తూ వుండిపోయిన సుమిత్రకి తల్లి జీవితం కళ్ళకి కట్టింది. ధనవంతులైనా, ఛాందసుల కోడలుగా పదిహేనేళ్ళకే అత్తవారింట అడుగుపెట్టింది అన్నపూర్ణ.

ధనంతోపాటు, అది సమకూర్చే వ్యసనాలన్నీ వున్నాయి ఆ ఇంట్లో పురుషులకు. బంగారంపండే భూములూ, విశాలమైన లోగిళ్ళూ కల ఉమ్మడికుటుంబం. మాధవరావు పుట్టుకతో నాలుగు చీలికలైంది. భూమీ ఇల్లూ కూడా నాలుగు చెక్కలైనాయి. వృద్ధుడి మరణంతో. అన్నపూర్ణ భర్త సుబ్బరామయ్యగారంటే జరీ అంచు ధోవతీ, సిల్కులాల్చీ, కళ్ళజోడూ కల ఆరడుగుల విగ్రహం అని ఎవరైనా చెప్పేవారు. పేరుకి భార్య అన్నపూర్ణ.

కానీ పెట్టిందంతా ఆయనకి కావల్సిన వడలులే. స్త్రీలోలత్వం, జూదం ఆయనకు ఉగ్గుపాలతోనే జీర్ణమైపోయాయి. తండ్రి మరణంవల్ల తన పరమైన ఆస్తిని విక్రయించేసి విజయవాడ పట్టణంలో ఇల్లు కొనుక్కుని కాపరం మార్చేశాడు ఆయన కొన్ని రోజులకి. అప్పటికే ముగ్గురు పిల్లలు. ఒంటరి కాపురంవలన అనేక బాధ్యతలు అన్నపూర్ణ నెత్తిన పడ్డాయి. విరిగిపోయిన నిండిన మనస్సుతో, ఏవిధమైన అనుభూతులూ లేని హృదయంతో సంసారం లాక్కువచ్చింది అన్నపూర్ణ సుమిత్ర పుట్టే సరికే పల్లెటూళ్ళో భూమి కరిగిపోయింది.

సుబ్బరామయ్యగారి శరీరం అనేక వ్యాధులకు నిలయమైపోయింది.

ఇంటర్మీడియట్ చదువుతూన్న మాధవరావునెత్తిన సంసార బాధ్యతవదిలి నిశ్చింతగా వెళ్ళిపోయాడు మహానుభావుడు. సంసారం సాగడం కోసం అడ్డమైన ఉద్యోగాలూ చేసి చేసి చివరికి ఇందులో స్థిరపడిపోయాడు మాధవరావు — అతని పెళ్ళి అక్క పెళ్ళి ఒక్కనాటే జరిగిపోయాయి. ఇందుమతి తల్లిదండ్రులిచ్చిన కట్నంతో విమల పెళ్ళి అయిందనిపించేశాడు మాధవరావు— అప్పటికీ ఇప్పటికీ అదే సమస్య! ఆడపిల్ల పెళ్ళి!!

(ఇంకా ఉంది)



# భర్తను లొంగదీసుకోవడము ఎలా?

పరిమళా సోమేశ్వర్

ఇక పాశ్చాత్యదేశాలలోని కవులుగాని, మన ఆధునిక కవులుగాని ప్రేయసిని గురించి పద్యాలల్లేరుగాని కట్టుకున్న భార్యమీద కవిత్వం చెప్పిన మహానుభావుడొక్కడూ లేడు. అంటే భార్యను ప్రేమించే సంప్రదాయం అటు పాశ్చాత్యదేశాల్లోనూ యిటు ప్రాచ్యదేశాల్లోనూకూడా అంతంతమాత్రంగానే ఉందన్నమాట!

బ్రౌనింగు అనే ఆయన, ఆయన భార్య యిద్దరూ గొప్పకవులు. ఇంగ్లీషులో ఎంతో అందమైన కవిత్వం వ్రాసేరు వీళ్ళ జీవితకాలంలో ఒకే ఒకసారి విడిపోయేరట. ఆ సమయంలో వాళ్ళు వ్రాసుకున్న ప్రేమ లేఖలు ఆంగ్లసాహిత్యంలో ఒక విశిష్టమైన స్థానాన్ని అలంకరించినవిట.

వీళ్ళు కనుక మరో రెండు, మూడు సార్లన్నా విడిపోయి ఉంటే ఆంగ్ల కవితా సుందరికి మరిన్ని అలంకారాలు, అందాలు అందించేవారని కొందరు విమర్శకులు అభిప్రాయపడతారు

కాని ఎంతసేపూ ఆ విమర్శకులు సాహిత్యపరంగా మాట్లాడతారు కాని సంసారపక్షంగా ఆలోచించినట్లు కనపడరు జీవితాంతం ఒకరినొకరు అంటిపెట్టుకుని ఉండే భార్యాభర్తలమధ్య రొమాంటిక్ లవ్ ఉండటం చాలా అరుదు దానికి అవకాశం కూడా లేదు.

ఎంతసేపూ పిల్లల చదువు సంధ్యలని గురించి, చాకలిపద్దులను గురించి, అవకాయ పచ్చడినిగురించి ఆలోచిస్తూండే వాళ్లకు ప్రేమా, రొమాన్సు మొదలైన వాటిని తీరుబడిగా అమలులోపెట్టాలంటే కష్టమెక్కడిది?

అందుకే కృష్ణశాస్త్రిగారి వంటి కవులంతా 'ఊర్వశి'లాటి ఊహాసుందరితో ప్రణయకలాపాలు సాగిస్తూ వాస్తవిక జీవితంలోని 'మొనాటనీ'నుండి తాత్కాలికంగా తప్పుకోవటానికి ప్రయత్నించేరు




ప్రఖ్యాత ఆంగ్లరచయిత మిల్టన్ కూడా నిజజీవితంలో ముగ్గురు భార్యలను చేసుకున్నాడట రస్కిన్ పెళ్ళికాక ముందు ఒకామెను ప్రేమించేడు కారణాంతరాలవల్ల ఆమెను చేసుకోలేకపోయేడు. చివరికి తన ప్రేయసి చనిపోయిందన్న వార్త విని గుండె జబ్బు తెచ్చుకుని ఆయన కూడా చనిపోయేడట!

ఇవన్నీ చూస్తుంటే ఆడదాన్ని గాఢంగా ప్రేమించే పురుషులు కొందరన్నా ఉండవచ్చు కాని కట్టుకున్న పెళ్ళాన్ని మాత్రం అంత గొప్పగా, పూర్తిగా ప్రేమించే మగవాళ్ళు నూటికి, కోటికి ఒకరన్నా ఉండరని తేలిపోతోంది.

ఇవన్నీ ఎందుకు ఏకరువు పెట్టవలసి వస్తోందంటె మీకు దేశకాలాలతో నిమిత్తం లేకుండా ఎన్ని అన్యాయాలు జరుగుతున్నాయో సోదాహరణంగా వివరిస్తే అప్పటికైనా మీరు మేల్కొనవచ్చు. ఝాన్సీ లక్ష్మి, నాగమ్మ మొదలైన వీరనారుల రక్తం మీలో పరవళ్ళు తొక్కవచ్చు. అలా జరిగేట్లు చెయ్యటమే నా ధ్యేయం.

తరతరాలుగా అణగ ద్రొక్కబడిన ఒక జాతి మేల్కొవాలంటే దానికి జరిగే అన్యాయాలు, అక్రమాలు శృతిమించిపోవాలి. పైగా వాళ్లకు జరుగుతున్నవి అన్యాయాలని చెప్పగల వ్యక్తి ఒకడు కనీసం యుగానికో సారైనా పుడుతుండాలి.

మన ఆంధ్రదేశంలో రెండు మూడు శతాబ్దాల క్రితం వెంకటచలం అనే ఆయన స్త్రీల స్వాతంత్ర్యం కోసం ఎంతో పోరాడేడు. వాళ్లకు కలుగుతున్న అవమానాలను అన్యాయాలను ఎంతో తీవ్రంగా ఖండించేడు. ఆడవాళ్ళు కూడా మనుషులేనని, పురుషులు చెప్పినట్టల్లా ఆడటానికి వాళ్లేం తోలు బొమ్మలు కాదనీ నొక్కి చెప్పేడు.

కాని లాభం అంతగా లేకపోయింది. ఆయన వల్ల భావనా ప్రపంచంలో కొంత సంచలనం విప్లవం బయల్దేరినప్పటికీ ఆయన చూపిన పరిష్కార మార్గాలు కంటకావృతంగా ఉండటం వల్ల ఆ బాటనే నడవటానికి సాహసించలేక పోయేరు స్త్రీలు కాబట్టి ఏ పక్షానికి నొప్పి కలగకుండా, సాఫీగా, ప్రశాంతంగా సాగిపోతూ భర్తల దౌర్జన్యాన్ని అణచివేసే సుగమ






మార్గాన్ని మీముందుంచ దల్చుకున్నాను నేను

ఒక్కసారి మీ యింట్లో జరుగుతున్న తంతేమిటో చూడండి మీరు కట్టుకునే చీరనుండి మీరు చదివే పుస్తకాలవరకు మీ భర్తల అభిరుచులనుబట్టే నడుచుకుంటున్నారు మీరు

చలం పుస్తకం చదవకూడదు అన్నారో మీ శ్రీవారు, యింక మీ యింటి చుట్టుప్రక్కల కూడా చలం పేరు వినబడటానికి వీల్లేదు **పోతే ఆయన ఆఫీసుకు పోయేక** పక్కింటి బాబును పంపి లైబ్రరీనుండి చలం పుస్తకాలే తెప్పించుకుని, సాయంత్రం ఆయన వచ్చేలోపుగా చదవటం పూర్తిచేసే **స్త్రీలు కొందరు మీలో ఉంటారని నాకు తెలుసు.**

**కాని అలా దొంగచాటుగా చదవవలసిన పరిస్థితి ఎంత అవమానకరమైనది!** మిమ్మల్ని ఈ చౌర్యానికి, వికృతమైన మానసిక స్థితికి తీసుకువచ్చింది తనేనని మీ శ్రీవారికి ఎంతకీ అర్థంకాదు మనిషి చెడిపోవటానికి కారణం అజ్ఞానం, చంచల స్వభావం అంతేకాని చలం పుస్తకాలను చదివినంతమాత్రాన స్త్రీలు చెడిపోతారనీ, అందువల్ల మిమ్మల్ని కట్టడిలో ఉంచాలని ఆయన భావించటం హాస్యాస్పదం!

'చలం అన్నీ బూతు కథలు' వ్రాస్తాడు, అందువల్ల నిలాటివాళ్లు చదవకూడదు' లంటాడు మీతో. దాంతో మీరు కూడా భయపడి చదవటం మానేస్తారు. కాని ఆయనన్నది అబద్ధం. చలం పుస్తకాలు మిమ్మల్ని ఆలోచింపజేస్తాయ్. ఆలోచన **ద్వారా యుక్తాయుక్త వివేక్షత, పరిశీలనా** శక్తి మొదలైన సద్గుణాలు ఏర్పడతయ్. దాంతో మీలో తిరుగుబాటుతనం బయల్దేరే అవకాశం కూడా ఉంది అందుకే ఆ పుస్తకాలను చదవనీయరు మిమ్మల్ని అంత్య నిష్కారంకంటె ఆది నిష్కారమే మేలని మొదట్లోనే మీకు ఆలోచించే శక్తిలేకుండా మిమ్మల్ని మూఢురాలిగా చేసి తన అధికారాన్ని కొనసాగించుకోవాలని చూస్తాడు మీ భర్త

కాని స్వేచ్ఛలో స్త్రీ ఎంతో అందంగా, ఆరోగ్యంగా పెరిగే అవకాశాలు చాలా ఉన్నాయన్న సంగతి గుర్తించుకోండి ఒక మొక్క ఏపుగా పెరగటానికి భూమి, నీరుతోపాటు కాంతి, గాలికూడా ఎంత అవసరమో అలాగే స్త్రీ ఆరోగ్యకరంగా ఎదగటానికి గృహజీవనం వివాహ వ్యవస్థలేకాక మానసికమైన స్వేచ్ఛ, స్వతంత్రతా పూరితమైన ఆలోచనా శక్తికూడా అంతా అవసరం.

అలాగే ముప్పాళ రంగనాయకమ్మగారి రచనలను మీ ఆయన మెచ్చుకుంటూండగా ఒక్కసారైనా విన్నారా? ఆవిడ రచనలను మీరు చదవటానికి అభ్యంతరం చెప్పరు కాని 'ఆవిడ ఎప్పుడూ వన్‌సైడెడ్‌గా వ్రాస్తుంది అందుకే నాకిష్టం ఉండవు ఆవిడ రచనలు' అంటాడు. ఇక్కడ 'వన్ సైడెడ్' అంటే అర్థం 'ఎప్పుడూ మగవాళ్లను దుయ్యబట్టటమే కాని, ఆడవాళ్లను ఏమాత్రం విమర్శించదూ' అని. తెలిసిందా? అలాగే షాపింగుకి వెళ్లినపుడు ఓ ముదురాకు పచ్చరంగు చీర, ముదురు నీలంరంగు బ్లౌజుపీసు— తీసికొనమంటాడు మీ ఆయన 'ఆ రెంటికీ మాచ్ 'కుదరదండీ' అన్నారో యింకా నాల్రోజులుదాకా మీ పాతివ్రత్యా హీనతని చెప్పుతూనే ఉంటాడు ఈపవిత్ర భారత దేశంలోపుట్టి, మొగుడు కొనమన్న చీరని కొనని స్త్రీ, తద్వారా మొగుణ్ణి ధిక్కరించిన స్త్రీని నువ్వొక్కదానివే కదా

(64వ పేజీ చూడండి)



# చెప్పాలని వుంది!

కొడవంటి కాశీపతిరావు



చిదంబరానికి టాటా చెప్పేసి, ఉత్సాహంగా లల్లల్లా అని రాగం తీస్తూ, చెంచెంగున మెట్లమీద గెంతుతూ, చెదరిన ముంగురులూ, నలిగిన చీరా, కదిలిన భావాలూ, భర్త వచ్చేసరికి సరిచేసికోవటాని కని డ్రాయింగ్ రూములోకి అడుగు పెట్టింది ప్రమీల. ఎదురుగా ఉన్న అద్దపు తలుపులలో నుండి అవతల ఉన్న బెడ్ రూమ్‌లో... ఏవో మధుర స్మృతుల్ని జ్ఞాపకం చేస్తున్నట్లుగా అడ్డ దిడ్డంగా వున్న దుప్పటీ, ఆ ప్రక్కనే బల్లమీద తినలేక పారేసిన ఆపిల్ ముక్కలూ, తిన కూడని బత్తాయి తొక్కలూ. ఆరిపోయిన అగరొత్తుల మసి... కంటబడగానే అంత వరకూ తీస్తున్న రాగం ఆపేసి కొత్త పెళ్ళికూతురిలా సిగ్గుపడింది మళ్ళా బెడ్‌రూమ్‌లోనికి వెళ్ళి అవన్నీ సర్దేసింది నిమిషంలో. తిరిగి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి మరోసారి అద్దపు తలుపుల్లోంచి బెడ్ రూమ్‌ని చూసి తృప్తిగా నవ్వుకుంది ప్రమీల డ్రాయింగ్ టేబిలుమీదున్న పుస్తకాల దొంతి చూసి టక్కున ఆగిపోయింది ప్రమీల నవ్వు.

ఆ పుస్తకాలక్కడికెలా వచ్చాయ్? సమాధానం చెప్పుకోడానికి ప్రమీల మనస్సు జంకింది.

చకచకా వెళ్ళి చూసింది తను దర్తను తెమ్మన్న పుస్తకాలే! మీది పుస్తకంలో నుండి తెల్లకాగితం తొంగి చూస్తూ రెప రెపలాడింది ప్రమీల మనస్సులోని భయం లాగానే.

వణకుతూన్న చేతిలో మెల్లగా తీసి చదివింది. మరేం లేదూ .. 'నువ్వు అడిగిన పుస్తకాలు సంజీవరావుగారిచేత పంపిస్తున్నాను. నేను రావటం కొద్దిగా ఆలస్యం కావచ్చును — సత్యానందం' అని వుంది. కాని... కాని ఆ ఒక్క మొదటి వాక్యం పిడుగుపాటులా తోచింది ప్రమీలకు. ఆ పిడుగుపాటుకు ఆపాదమస్తకమూ ఒక్క సారిగా లతలా వణికిపోయింది

అంటే యిప్పుడు సంజీవరావు గారు వచ్చి వెళ్ళారన్నమాట. డ్రాయింగ్ రూమ్ లోనికి వచ్చి పుస్తకాలు పెట్టి .. ఎదురుగా అద్దపు తలుపుల్లోంచి బెడ్ రూమ్ ... పచ్చి నిజం అంత వగరుగా వుంటే మరి మింగుడుపడక ఆలోచించలేక పోయింది ప్రమీల.

వెంటనే సత్తిగాడిమీద అపరిమిత కోపం వచ్చేసింది.

విసుగ్గా... ఆ కోపాన్నంతా ... కింద నున్న హాలంతా గింగురుమన్నట్టుగా కాలింగ్ బెల్‌మీద చూపింది. ఏం మునిగిపోయిందో నని సత్తిగాడు రెండేసి మెట్లకొక అంగ చొప్పున మీదికి పరిగెత్తేడు.

డ్రాయింగ్‌రూమ్ గుమ్మం దగ్గరే చేతులు కట్టుకుని... అమ్మగారి చేతిలో నలిగిపోతున్న కాగితంవంక భయంభయంగా చూస్తూ... 'ఏటండమ్మగోరూ' అన్నాడు.

'నీకు ఏవని చెప్పేను?' డ్రాయింగ్ రూమ్ అదిరిపోయినట్టుగా అడిగింది ప్రమీల. సమాధానం చెప్పలేక తలవంచుకుని నిలబడ్డాడు సత్తిగాడు.

'నే నిక్కడ మేడమీద మాట్లాడుతూంటే ఎవర్నీ మీదికి రానివ్వద్దన్నానా?... ఇప్పుడెవరొచ్చారు ఊరుకీ...?' అంది ప్రమీల.

'సంజీవరాపుగోరు...' మెల్లిగా నోరు విప్పి చెప్పేడు సత్తిగాడు.

'ఆయన మీది కొస్తుంటే మెట్ల

ప్రక్కనేవుండి మిడిగుడ్లేసుకుని చూస్తూ కూర్చున్నావా? కళ్ళు మూసుకుపోయాయా?'

నిజంగానే కళ్ళుమూసుకు పడుకున్నాననీ, సంజీవరావుగారు పుస్తకాలు మేడమీద పెట్టానని అమ్మగారితో చెప్పమని చెప్పడానికి లేపేరనీ ... చెప్తే అమ్మగారే వంటారోనని నోరుమూసుకున్నాడు సత్తిగాడు. వాడు అలా నిశ్శబ్దంగా ఉండిపోవడంతో మరింత రెచ్చిపోయింది ప్రమీల.

'కళ్ళుమూసుకుపోయాయా అంటే నోరుమూసుకుంటావేం రా ... ఇంతవరకూ చేసినపని చాలుగాని ... వెళ్ళి గుమస్తాగారి నడిగి నీ జీతం తీసుకుని ఫో ... మరి గుమ్మం తొక్కకు...గెటౌట్...' అంటూ గట్టిగా పిచ్చిగా కేకేసింది ప్రమీల.

ఆ వెంటనే ఉధృతంగా వరదలా ఏడుపు ముంచుకొచ్చేయటంతో టేబిలు మీద తల వాల్చేసింది భోరుమంటూ.

ఇప్పుడెలా? సంజీవరావుగారు చూసేరు. చూసింది చూసినట్టు ఆయనతో చెప్తారు. ఇంతవరకూ తాము ఆడిన నాటకం క్లైమాక్సు చేరుకుంది, ఇక ముగింపే... ఎలా వుంటుంది? పుట్టింటికి పంపేస్తాడా తన భర్త... అందరిలో అవమానిస్తాడా? 'వద్దు భగవాన్...వద్దు' అంటూ మళ్ళా భోరుమంది ప్రమీల.

'అమ్మగోయా ... అమ్మగోరూ...' అంటూ సత్తిగాడు పిలుస్తున్నాడు ఎర్రగా ఉబ్బిన కళ్ళనెత్తి ... ఆశ్చతగా తనను చూస్తున్న సత్తిగాడిని ఏవిటన్నట్టుగా చూసింది... 'ఏటండమ్మగోరు ఏడుస్తున్నారు... ఆ సీటీలో ఏటుంది...' అంటూ అడుగుతున్నాడు అంతవరకూ తిన్నతిట్లను మర్చిపోయి...పూర్ ఫెలో... వీడినా తను గెటౌవుట్ అంది? అనుకుంది ఒకగడియ...అయినా ఇలాంటి విషయాలు ఏవని చెప్పుకుంటుంది?...

'ఏంలేదుగానీ నువ్వెళ్ళి కాఫీపట్రా...' అని పంపేసింది సత్తిగాడిని.

వాడైతే వెళ్ళిపోయాడుగానీ... మనసులోంచి ఆలోచనలూ, ఆరాటం, ఆవేగం వెళ్ళనంటున్నాయి. వాడినన్నట్టు వీటిని గెటౌట్ అనగలదా? ... అంటే వెళ్ళిపోతాయా?

ప్చ్. ఆలోచించలేకుండా వుంది. కాని తప్పడంలేదు. 'ఈ లోకంలో దేన్ని తప్పించుకుని అయినా దాగుడుమూత లాడచ్చుకాని మనస్సుని తప్పించుకోలేమేమో! బలవంతాన నిద్రపోదామా అంటే నిద్రరాదు...పోనీ ఆయన పంపిన పుస్తకాలు చదువుదామా అంటే...అదోక ఆలోచనలపుట్ట...ముట్టుకుంటే ఆలోచనలు మరింతవచ్చి కుట్టేస్తాయ్. అన్నిటికీ మూలకారణం అదే... ముట్టుకోకపోయినా అవి చుట్టుముట్టేస్తున్నాయ్...

తనెవ్వరినీ ఇష్టపడలేదు ప్రేమించలేదు. పెళ్ళి ...పెళ్ళి ... అని జీవితం, సుఖం అంతా అందులోనే వున్నట్టుగా చిన్నా పెద్దా అంతా ఊరికే బలవంతం చేసేరు 'నే పెళ్ళి చేసుకోను' అని ఖచ్చితంగా చెప్పినా, 'ఏంపెళ్ళి పోనిస్తూ' అని దాటేసినా, 'వీరు చేసుకుని ఎంత సుఖపడిపోతున్నారూ...' అని హేళన చెయ్యబోయినా ఏమీ లాభంలేదని తెలుసుకుని తల్లిదండ్రుల మాటమీద యాంత్రికంగా ఒప్పుకుంది పెళ్ళికి. అప్పటికీ పెళ్ళికొడుకుల్లో వంకపెట్టి తిరగొట్టింది కూడా...ఒప్పుకోక పోవటానికి సత్యానందంలో ఏ వంకా లేదు. ఒప్పుకుందన్నమాటేగాని ... పీటలమీద తన ప్రక్కన కూర్చున్న సత్యానందంని చూసి ఇతనితోనా తాను కాపురం చేయవలసింది అనిపించింది తనకు అవును తప్పదు అని సమాధానం ఇచ్చింది మనసు అలాగే మనసు మొట్టికాయపెడితే బాధతో తల వంచుక్కూర్చుంది. అబ్బ! పెళ్ళికూతురి కెంతసిగ్గో అన్నారంతా. పొంగిపోయి తాళిగట్టేసాడు సత్యానందం.

లోకంలోని ఆఫీసర్లందరూ ఇలాగే కష్టపడి పోతున్నట్టు ... ఈయనగారెప్పుడూ ఆఫీసు పనిలోనే ఉండేవారు. ఆ ఫైళ్ళూ...గట్రా చుట్టూ ఉంటే ఆయనకి రంభా ఊర్వశిలమధ్య ఉన్నట్టుండేదేమో! సత్తిగాడూ, గుమస్తాగారూ, పనిమనిషీ ఉన్నా బిక్కు బిక్కుమంటూ ఇద్దరే వున్నట్టుగా వుండేది. సత్యానందంతోనే భోజనం చేసేది తను. తరువాత ఆయన ఆఫీసుకూ, ఈవిడ మేడమీదకూ. పనీ పాటా లేకుండా పడుకున్నంతసేపూ పడుకోవటమూ...తరవాత ఇల్లంతా కలయ తిరగటమూ.

బాగా చీకటిపడిం తర్వాత మెల్లిగ ఇస్సురని ఇల్లు చేరేవాడు సత్యానందం. ముట్టుకుంటే కస్సు మంటాడేమోనని అంటీ ముంటనట్టు ప్రవర్తించేది తను— ఆయనగారి విసుగు చల్లారేసరికి తన వేడీ చల్లారేది,

అప్పుడు మెల్లిగా ప్రక్కకి చేరేవాడు.

'ప్రేమీ! సినిమాకు వెళ్దామా?'

కోపం మెల్లిగా నసాళాని కెక్కేది తనకు. ఏదో పనిచేస్తున్నట్టుగా నటించేది మాట్లాడకుండా.

'కోపంవచ్చిందా ప్రేమీ?'

కోపంకాదు ... ఒళ్ళు మండిపోతోందని గట్టిగా అరవాలనిపించేది. కాని ... 'ఇప్పుడేం సినిమాకి వద్దు...చాలా అలిసిపోయి వచ్చారు ... హాయిగా పడుకోండి.' అని చెప్పి లోపలికి వెళ్ళిపోయేది.

'ఆహా ప్రేమీ ఎంత మంచిది...' అనుకునేవాడు సత్యానందం.

అంతే. మళ్ళా ఉదయం లేవడం...ఆయనకి నీళ్ళుతోడడం.. వంటచేసి, భోజనం వడ్డించడం తన డ్యూటీగా తీసుకొని చకచక చేసేది. అంతేగాకుండా పగలంతా పని ఉండేది కాదేమో ... ఆ ఒక్కక్షణం పని తగలగానే చురుకుదనం వచ్చి చకచక చేసేది. మొగుడంటే ఎంత ఇదమ్మా ఈవిడకి అనుకునేవారు ఇంటికొచ్చే చుట్టాలూ పక్కాలూను. భోజనాలవరకూ ఊపిరిసలపనంతపని. తరువాత ఒక్కసారిగా తీరుబాటు. ఆ తీరిక దొరికేసరికి ప్రక్కనెవరూ ఉండరు ఇన్నాళ్ళుగా జరుగుతున్న సంగతిది.

చిదంబరం మెల్లిగా రంగంలోకి దిగాడు...

సత్తిగాడొచ్చేసరికి ఆలోచనలనుండి బయటపడిం దొక్కసారి. 'అమ్మగారూ! అయ్యగోరొచ్చేతలికి శానా ఆలిసెం అవుద్దట...పోనొచ్చింది...' అన్నాడు. టైము చూసుకునేసరికి ఆరు కావస్తోంది. సూర్యుడు కనుమరుగైపోయాడు — మీదికొస్తున్న చీకటి చేతుల్లోంచి తప్పుకొని సూర్యుణ్ణి ఆఖరిసారి చూద్దామా అన్నట్టుగా పక్షులు తపతప రెక్కలు కొట్టుకుంటున్నాయి. ప్రమీలనీ అలాగే ఆలోచనలు కప్పేస్తున్నాయి. చీకటిలాగా ముంచెత్తుతున్న భయంతో నెలవంక వెలుగులా తోచింది...ఆ నెలవంకను మబ్బులు

# చెప్పాలనివుంది!

చూసేసరికి మళ్ళా మామూలే...భయం...చీకటి...ఆలోచనలు ...

ఆ వేళకూడా ఈ సత్తిగాడే ఇలాగే కబురు చెప్పాడు.

ఆ మర్నాడు ఆయన్ని అడిగితే తన స్నేహితు డొకడు ఫారిన్‌నుండి తిరిగొచ్చాడనీ...రిసీవ్ చేసుకుందికి వెళ్ళాననీ చెప్పాడు సత్యానందం.

ఆ ఫ్రెండే చిదంబరం!

తరువాత ఇంట్లో పార్టీ ఇప్పించాడు సత్యానందం. ఏ ముహూర్తాన చిదంబరం వచ్చాడో గాని...అప్పటి నుండీ ప్రమీల ప్రమీల కాదు. మొదటిసారి చూసినపుడే ఏదో భావం కలిగింది తనకు. ఆ వెంటనే తనను తాను సంబాళించుకుంది. తాను వివాహమైన స్త్రీ. పైగా గౌరవంగా బ్రతుకున్న కుటుంబానికి చెందినది. అలాంటి భావం కలిగినందుకు తనను తానే అసహ్యించుకొంది ప్రమీల.

కాని చిదంబరం ముందు తన మీద అసహ్యమూ, తన గౌరవమైన కుటుంబం మీాద కాంక్ష, వివాహమైందనే భయం అన్నీ మర్చిపోయింది ప్రమీల. అతనితో మాట్లాడినపుడే మొట్టమొదటిసారిగా అందమంటే ఏమిటో కొద్ది కొద్దిగా తెలుస్తూ వచ్చింది. అప్పుడే నిజానికి తన మనసు వికసించ నారంభించిందేమో!

చిదంబరం మాట్లాడుతూన్న కొద్దీ వినాలలనిపించేంత చక్కగా మాట్లాడుతాడు. అలా! మాటలతోనే కొత్తవాళ్ల దగ్గరా...వాళ్ళూహించనంత చనువు తీసుకుంటాడు. అలాగే తన దగ్గరా చనువుతో పాటు మనసూ తీసుకున్నాడు. అతను లేనిదే తనకి మనువు లేదనిపించేట్టు చేసాడు. ఇప్పుడు తను సత్యానందం చాటునున్న చిదంబరం తాలుకు మనిషి.

ఇన్నాళ్ళూ ఎవరకీ తెలియలేదీ వ్యవహారం.

కాని...కాని ఇప్పుడు సంజీవరావుగారు చూసేసారు. కళ్ళారా చూసారు. చూసిందంతా చెప్తారు. ఎలా...? ఎలా...? చుట్టూ భయం నిద్రమత్తులా చిక్కబడుతోంది, చెమటలుపట్టాయి...ఆభయంలో... ఆ చెమటలో... ఎప్పుడో ఎలాగో నిద్ర పట్టింది ప్రమీలకు.

లేచేసరికి మనసు కొంచెం తేలికయింది. పనుల్లో మునిగింది. సత్యానందం లేచినట్టు అన్పిస్తే...ఛ...ఇంత మొద్దునిద్ర పోయానేమిటి అని సిగ్గుపడుతూ అతని గదిలోనికి తొంగి చూసింది ప్రమీల. ఎన్ని గంటలకు లేచాడోగాని సత్యానందం పక్కమీదనే మఠం వేసుక్కూచున్నాడు. అలా శూన్యంలోకి చూస్తూ ప్రియమైనదేదో పోయినట్టు సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. అతన్నలా చూసేసరికి...ప్రమీలకి మర్చిపోయిన భయం ఒక్కసారిగా ఎగదన్నింది.

ప్రమీలను చూడటంతో మెల్లగా లేచి ఏమీ మాట్లాడకుండా బాత్‌రూమ్‌లోనికి నడిచాడు సత్యానందం. మళ్లా ముభావంగానే వచ్చి ఈజీఛైరులో కూర్చున్నాడు సత్యానందం. దోషిలా తల వంచుకుని కాఫీ ఇచ్చింది ప్రమీల. ఏమైనా అంటాడేమోనని ఎదురుచూసింది. మౌనంగా తీసుకుని కాఫీ త్రాగేసి...కప్పు క్రిందని పెట్టేసాడు సత్యానందం.

ఏమీ మాట్లాడడేం? తొందరగా ఏదో తిట్టేస్తే తనకి భయం, భారం ఉండవు. పోనీ తనే చెప్పేస్తే ... చెప్పగలదా?... చెప్పి?...విడాకులు తీసుకోవాలా?...ప్చ్... తను చెప్పలేదు...చెప్పదు ... చెప్పాలనే ఉన్నా...

ఇద్దరి మనసులూ భారంగా ఉన్నాయ్.

ఆఫీసు టైమైనా కుర్చీలోనుండి లేవలేదు సత్యానందం. 'ఆఫీసుకు వెళ్ళరా' అని అడుగుదామని వచ్చి ... తిరిగి వెళ్ళిపోయింది...వంటాగింటా పూర్తి చేసుకుని భోజనానికి పిలవమని సత్తిగాణ్ని పంపింది. భోజనం చెయ్యరుట అని కబురు తెచ్చాడు సత్తిగాడు.

ఒక్కసారిగా కోపం వచ్చింది ప్రమీలకు. సంజీవరావుగారు చెప్పిందేదో తనని అడిగేస్తే...తను ఏదో జవాబిస్తుంది కదా... తను ఏదో చేసిందని ఆ పవిత్రత అంతా భోజనంలో కలసదు కదా ... చెయ్యకపోటానికి. ఉపవాసాలు చేస్తే పవిత్రులమైపోతామా? చరచరా సత్యానందం దగ్గరకు వెళ్ళింది.

'భోజనం చెయ్యనన్నారుట.'

'అవును.'

'ఎంచేతనో?'

'ఏమీ లేదు'

'ఉదయంనుండీ చూస్తున్నాను మీ వాలకం...కడుపులో ఉన్నదేదో చెప్పెయ్యరాదూ ... మీలో మీరెందుకలా అయిపోతారూ...' అంతవరకూ ఏదో ఆవేశంతో అనేసింది ... వెంటనే ఆవేశం జారిపోగానే వణకు ప్రారంభం అయింది ప్రమీలకు.

'ఏమీ లేదు ప్రేమీ ... నిన్న పుస్తకాలు తెచ్చారు జ్ఞాపకముందా ... సంజీవరావుగారని...'

'ఆఁ' పాలిపోయిన ముఖంతో అంది ప్రమీల.

'నీకు పుస్తకాలిచ్చిన తర్వాత ఆఫీసుకు నాలుగైదుసార్లు ఫోను వచ్చింది...'

'ఏమని?' కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు ప్రమీలకు. ప్రేలబోతోన్న టపాకాయ చప్పుడుకు సిద్ధంగా ఉన్నాయి చెవులు.

'నాతో ఏదో చెప్పాలని వుందంటూ... తీరికలేక వెళ్ళలేకపోయాను తీరా సాయంత్రం వెళ్ళేసరికి.. పాపం...ఆయన హార్టుఫెలయి చనిపోయారంట అంతకు గంట క్రితమే... ఏవిటో ప్రేమీ ..చెప్పాల్సింది చెప్పకుండానే పోయారు...' ●



## ఆవేశం-హత్య

18 ఏళ్ళ ధనకోటి అమ్మాళ్ అనే ఆమె తన మామగారికి అన్నం పెడుతూ, పక్కన మంచినీళ్ళు పెట్టడం మర్చిపోయిందట. దాంతో ఆయన నానా మాటలూ అంటే ఆమె కూడా యథాశక్తి సమాధానం చెప్పి తన భర్త కుప్పన్ తంతాడనే భయంతో పక్కింటికి వెళ్ళి కూర్చుంటే అత్తగారొచ్చి మామగారు పిలుస్తున్నారందట. తప్పనిసరై లేచి వెళ్ళేసరికి కుప్పన్ ఆమెను చితకబాదాడట. దెబ్బలు భరించలేక మళ్ళా పక్కింటికి పారిపోబోతే కూడాపడి గుండెల్లోనూ, మెడ మీదా కత్తితో పొడిచి చంపేశాడట ఆమె భర్త కుప్పన్... ఇది మద్రాసుకు సమీపంలో వున్న [illegible] అనే చోట జరిగింది.

## భలే అమ్మాయి

మా అమ్మాయిని మేం చేసుకుంటాం అని ఓ ఏడాది క్రితం మాట యిచ్చినాయన అందుగ్గాను తను తీసుకున్న 250 రూపాయలు తిరిగిస్తాను



తను తన కొడుక్కి ఆమెను చేసుకోనన్నాడట. అతని కొడుకు కూడా [illegible] అన్నాడట. దాంతో ఆమె కాబోయే, ఆగిపోదల్చుకున్న మామగారింటికి వెళ్ళి భైఠాయించి, 'మీ అబ్బాయికి నన్ను చేసుకోవాలి. లేకపోతే యీ యిల్లు వదిలేది లేదు' అని కూర్చుందట. పిల్లాడి తండ్రి పోలీసు రిపోర్టిచ్చి, అనక పంచాయితీ పెట్టించినా ఆమె చలనం లేకుండా ఏడాది క్రితం తన తండ్రికి మాటిచ్చి తన వివాహాన్ని నిశ్చయం చేసి, యీనాడు వుత్తినే తల అడ్డంగా [illegible] వాదించిందట. దాంతో పంచాయితీలో కూడా ఏమీ చెప్పలేక పోయారట. చివరికి పిల్లాడి తండ్రి పిల్ల తండ్రికి 'మీ అమ్మాయిని నేను చేసుకోలేము. లేనిచో ఆమె భోజనాది ఖర్చులకు నెలసరి యాభై రూపాయలు యివ్వవలసి వుంటారు.' అని ఓ లాయరు నోటీసిప్పించాడట. ఆన కేమయ్యిందో తెలీని యీ విపరీతం లక్నోకి చెందిన జాన్పూర పోలీసు సర్కిలు ప్రాంతంలోని కపూర్‌బర్ గ్రామంలో జరిగిందట.




## బట్టతల మీద వెంట్రుకలు....!

బట్టతలమీద వెంట్రుకలు రాబట్టవచ్చు అనే సత్యం యిటీవల నిజమయ్యింది. ఎడిలాయిడ్ (దక్షిణ ఆస్ట్రేలియా)లో మెల్ఫోర్డ్‌కు చెందిన ఓ శస్త్రచికిత్స నిపుణుడు యీ విషయం తెలియజేశాడు. ఆయన 32—49 మధ్య వయస్కులను ముగ్గుర్ని పట్టుకుని, వారిమెడ మీద, పక్క వెంట్రుకలూ తీసి నడినెత్తి మీద అతికారట. ఈ రకంగా 60 రోజులు, 120 రోజులు అమర్చారట. అదే విధంగా ఓ నాల్రోజులు శస్త్ర చికిత్స చేస్తే సరిపోతుందని, సామాన్యమైన బట్టతల మీద వెంట్రుకలు రప్పించడానికి సుమారు 642 డాలర్లు అవుతుందని ఆయన అన్నారట...ఇటీజ్ వర్త్.....ఈజిట్ !

## కీలు గుర్రం

న్యూయార్కులో ఒక కీలుగుర్రాన్ని కనిపెట్టారట. 10 అడుగుల ఎత్తున్న యీ గుర్రం 1300 కిలోల బరువుంటుందట. దీనికి హైడ్రాలిక్ కండరాలూ అవీ వుంటాయట. ముందుకాలి డెక్కతో 230 కిలోల బరువును ఎత్తి పక్కనున్న ఓ మాదిరి వంతెన ప్రదేశంలో పెట్టగలదట.

## పగ!

మధురకి 40 మైళ్ళ దూరంలోవున్న తేన్ని అనే గ్రామానికి సమీపంలో వున్న వరుసనాడు అనే గ్రామంలో ఒక కుటుంబాన్ని పగవల్ల సర్వనాశనం చేశాడట పాండియన్ అనే అతను. అనంతప్పన్ అనే అతను ఒక కేసులో పాండియన్‌కి ఎదురు సాక్ష్యం యిచ్చాడట. దాంతో పాండియన్ తన పలుకుబడిని వుపయోగించి అనంతప్పన్ కుటుంబాన్ని ఆ గ్రామములో ఎవరితోనూ సంబంధం లేనిదిగా చేశాడట. గ్రామంలో జరిగిన ఒక పండుగకు అనంతప్పన్, అతని సోదరుడూ విరాళం యిచ్చేసరికి, పుచ్చుకున్నా ఆ డబ్బుని తిరిగి యిచ్చేయాలని పాండియన్ అన్నాడట. దాంతో అనంతప్పన్‌కి కోపం వచ్చి ఇంకో కేసులో యిరికిస్తానని బెదిరించాడట. పాండియన్‌కి ఆవేశం వచ్చి ఓ ముగ్గురు చుట్టాల సహాయం తీసుకుని అనంతప్పన్ని, అతని సోదరుడు రామస్వామిని, భార్య వేలమ్మాళ్‌ని, సోదరి పళనిఅమ్మాళ్‌ని రెండేళ్ళ కొడుకునూ—మొత్తం ఐదుగురిని చంపి, ఓ పాకలో శవాలను పెట్టి, ఆ పాకకు నిప్పు అంటించారట. ఈ విషయం పోలీసులకు తెలియకూడదని వూరివాళ్ళను భయపెట్టాడట కూడా పాండియన్.

* * *



## గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥







# ఒకవారం విపరీతం

గండసా అనే ఒక ఆయుధాన్ని తీసుకుని నిద్రపోతున్న ఓ ఏడుగుర్ని పొడిచాడటొ మహనీయుడు ఇది నానక్‌పూర్ కాలనీలో జరిగింది. ఆరుగురు వ్యక్తులు గల ఆ కుటుంబానికి చుట్టపు చూపుగా వచ్చిన అతనికి వారితో ఏదో వ్యాపార సంబంధపు గొడవలొచ్చాయట దాంతో వారు నిద్రపోయాక, వారందర్నే గాక, ఇంటి పనివాడిని కూడా పొడిచేశాడట. ఒక పెళ్ళయినతను, అతని తమ్ముడూ మరణించారట. వారి తలిదండ్రులు, ఇద్దరు చెల్లెళ్ళు ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో వున్నారట.

# బావిలోనుంచి విషవాయువు

నిజామాబాద్‌కి చెందిన నయలకల్ (పలకడం అంతేనా) అనే గ్రామంలో యిటీవల పూడిక తీయించిన ఒక బావిలోంచి విషవాయువు వంటిది ఒకటి బయటికి వచ్చి ముగ్గురు మరణించారట. బహుశా యీ బావిలో ఏదో ఆ సంబంధమైన ఖనిజం వుండి వుండాలని భావిస్తున్నారు.

# అక్రమ సంబంధం

పెట్టి తిరుకోణం అనే వూళ్లో 25 ఏళ్ళ వెళ్ళయ్యన్‌కి తన మామ భార్య (రెండో పెళ్ళి)తో అక్రమ సంబంధం వుందట. దానితో ఆమె భర్త మైకేల్ ఆమెను దండించబోయేసరికామె తన పుట్టింటికి వెళ్ళిపోయిందట. అక్కడే (కేరళయమ్మాళ్) వెళ్ళయన్‌తో కలిసి వుంటోందట. తన స్నేహితునింట్లో పెళ్ళికి, కున్నత్తూర్ వెళ్ళిన మైకేల్‌కి తన స్నేహితులంతా భార్యను గురించి చెప్పిన మాటలకు కోపం వచ్చి, దిగమింగి ఆనక వెళ్ళయ్యన్‌ను సినిమాకి పిలిచి దారిలో అతని నోట్లో గుడ్డలు కుక్కి పీక నులిమి చంపేశాడట. శవాన్ని వేపచెట్టుకు వేళ్ళాడదీశాడట కూడా.

# హోటల్ గదిలో శవం

ఢిల్లీలో రామ్‌నగర్ హోటల్లో ఓ 19 ఏళ్ళ కుర్రాడి శవం వుందట. తాళం వేసున్న రూముని చూసి ఆశ్చర్యపోయిన నౌకరు (తాళం కన్నంలోంచి) చూసి యజమానికి చెప్పాడట. పక్క మీద ఏడున్నతని శవం మెడ మీద పెద్దకత్తి వేటుందట. ప్రాణాలు పోయేముందు పెనుగులాడినట్టు పక్కంతా నలిగి కూడా వుందట. ఆ క్రితం రాత్రి అతని రూముకు వచ్చిన ఒకవ్యక్తి (?) చంపి వుండాలని ఆ వ్యక్తి కోసం వెతుకుతున్నారు.

* * *

మహోళి పోలీసు సర్కిల్‌కు చెందిన ఒక గ్రామములో వున్న ఓ అనాథ శరణాలయంలోంచి ఒక బ్రాహ్మణ స్త్రీని ఆ శరణాలయం అధికారి పద మూడు వందలకు అమ్మేశాడట. ఈ సంఘటనలో ఇద్దరు కపోలీసు కాన్‌స్టేబుల్సు కూడా వున్నారట. వంద రూపాయలు యీ పుణ్యకార్యానికి పుచ్చుకున్న ఆ అధికారి వెంటనే అమ్మాయి కనుపించుటలేదు, అని రిపోర్టిస్తే దురదృష్టవశాత్తూ వారు పట్టుకున్నారుట.

# నెలకు 5 హత్యలు

బారబాంకి అనే జిల్లాలో జనవరి నుండి ఏప్రియల్ వరకూ ఇరవై హత్యలు జరిగాయట అనగా సరాసరి నెలకు ఐదు హత్యలని అధికార రీత్యా వార్త బయల్పడింది.

# జనవాక్యం

మహమ్మద్‌పూర్ పోలీసు సర్కిలుకు చెందిన టాండా అనే గ్రామంలో పోలీసు స్టేషనుకు కొంచెం దూరంలో నివసిస్తున్న ఒక 40 ఏళ్ళ వితంతువును పట్టపగలు దైనరాయ్ భరోసి అనే అతను ఓ ఇరవై మంది బలగంతో వచ్చి, ఎత్తుకుపోయాడట. పోలీస్టేషను దగ్గర్లో వున్న యింట్లో ఏకాకిగా వుంటున్న ఓ స్త్రీని పట్టపగలు ఎత్తుకుపోడమేమిటంటే 'ఆ పోదురూ ఇలాంటివి. ఆడవారిని ఎత్తుకుపోడం, చెరచడం వంటి వాటిలో యీ పోలీసులకూ వాటా వుంది' అన్నారట ప్రజ..

* * *

ఢిల్లీలో కమలానగర్‌లో శ్యామ్‌ప్రసాద్ కపూర్ ఫ్యాన్సీ షాపుకు ఒక వ్యక్తి వచ్చి టూత్‌పేస్ట్ కొనుక్కొని వెళ్ళాడట. అంతలో మరో వ్యక్తి వచ్చి ఒక చేతి రుమాలు కొని ముప్పై పైసలు తక్కువ యిచ్చి గమ్మున వెళ్ళిపోబోతుంటే షాపు యజమాని టక్కున లేచి అతన్ని వెంబడించాడట, గల్లాపెట్టె వదలి. అంతలో మరో వ్యక్తి వచ్చి అవలీలగా గల్లాపెట్టెలో వున్న ఓ 2400 రూపాయలు తీసుకుని అంతర్ధానమైపోయాడట.

# నయానా భయానా

55 ఏళ్ళ అనూప్‌లాల్‌ఝూ అనే నవయువకుడు పదేళ్ళ అమ్మాయిని వివాహం చేసుకోవాలనే వుత్సాహంతో మైలాస్‌పూర్‌కు విజయం చేసి విడిది చేశాడట. తీరా ముహూర్తం దగ్గరకు వచ్చేసరికి ఆ ఊరి యువకులంతా చేరి 'అంత చిన్నపిల్ల జీవితం నాశనం చేయవద్దు' అని నయాన్న చెప్పారట. వినకబోయేసరికి భయాన్న చెప్పి వూరొదిలి పారిపోయేలా చేశారట— యువకులు వర్ధిల్లా గాక!



# మేనెలలో అందిన దీపావళి శుభాకాంక్షలు!

అక్టోబరు 28 వ తేదీన గోండాల్‌లో పోస్టు చేయబడిన ఓ దీపావళి శుభాకాంక్షల లేఖ తన సొంతదారునికి మే 14 న చేరిందట. జూనఘడ్‌లో సేల్స్‌టాక్సు ఆఫీసులో పని చేస్తున్న ఆ చిరునామాదారుడు మే నెలలో వచ్చిన దీపావళి శుభాకాంక్షను చూసి అబ్బురపడి వుండి వుండాలి—ఈజ్నాటిట్!

*  *  *

తన భార్య చేస్తున్న ఒక పండుగికి రమ్మని సురేంద్రనగర్ - రాన్‌పూర్‌కు చెందిన దామోదర్‌లాల్ హెూటు అనే ఆయన పోప్పట్‌లాల్ జగజ్జీవన్ అనే ఆయనకి రాసిన ఒక వుత్తరం 50 మైళ్ళ దూరం ప్రయాణం చేయడానికి 22 సంవత్సరాలు తీసుకుందట. ఐదవ జార్జి రాజుగారి తపాలా బిళ్ళ వున్న యీ కార్డు 1947 వ సంవత్సరంలో పోస్టు చేసినదట. విచిత్ర మేమిటంటే యిప్పుడా ముగ్గురూ కూడా లేరట. అంతా చనిపోయారట. థాంక్సు పోస్టల్ డిపార్ట్‌మెంట్ ఫర్ సిన్సియారిటి యట్..

*  *  *



కోయంబత్తూరుకు చెందిన కుర్మియతూర్‌లో 70 ఏళ్ళ నిండిన ఓ పుష్కల యవ్వనవంతుడు ఎనిమిదేళ్ళ ఓ అమ్మాయిని పట్టుకుని ఆమెతో అసభ్యంగా (?) ప్రవర్తించాడట. ఈయనకు న్యాయశాస్త్రం ఏడు ఏళ్ళ శిక్ష వేసింది—

*  *  *

తన భార్యను కలుసుకోడానికి హాస్టలుకు వస్తే కాలేజి ప్రిన్సిపాలు వీల్లేదంటోందని, తన భార్యను పుంపుడుకత్తెగా వాడ్చడానికి ఆ ప్రిన్సిపాలు, ఊళ్ళోని మంచి వ్యక్తి ప్రయత్నిస్తున్నారని ఒకాయన పోలీసు రిపోర్టిస్తే పోలీసు అతని భార్యను తమ అధీనంలోకి తీసుకుని అనక ఆమె తలిదండ్రులకు వప్పగించారట. ఇది బిజ్‌నూర్‌లో జరిగింది.

*  *  *

తన కొడుకును చంపి, కోడలిని విధవ చేసిన హంతకుణ్ణి వెంటాడి చంపిందట కన్నతల్లి. పరవాకోట్టై అనే గ్రామానికి చెందిన 58 ఏళ్ళ కాళియమ్మాళ్ కొడుకు పన్నీర్ (26 ఏళ్ళు)ను 29 ఏళ్ళ రాఘవ్ అనే అతను ఏదో భూమి తగాదాల్లో వచ్చిన ఆవేశంలో చంపేశాడట. కోర్టు (మద్రాసు) వారు అతనిని విడుదల చేసేశారట (శిక్షించకుండా). ఆ రోజు నుంచి కాళియమ్మాళ్ సేరాళన్ మీద పగబట్టిందట. పరవాకోట్టై పొన్నియమ్మన్ వుత్సవం జరుగుతుండగా ఆ వుత్సవానికి వచ్చిన సేరాళన్‌ను చీరలో దాచుకున్న కత్తితో వెంబడించిందట. సేరాళన్ గుడిలో దేవుడికి దండం పెట్టుకుంటుండగా గబుక్కున అతని పొట్టలో పొడిచి చంపేసి పోలీసులకు లొంగిపోయిందట.



"విచిత్ర కుటుంబం"లో విజయనిర్మల, సావిత్రి,

చిత్రసమీక్ష:

# విచిత్ర కుటుంబం

తారాబలంతోపాటు చక్కని కథ, సహజంగా ఉన్న సంభాషణలు, కంటికింపైన చిత్రీకరణ చిత్ర విజయానికి తప్పకుండా దోహదం చేస్తాయన్నదానికి ప్రత్యక్ష నిదర్శనం శ్రీ రాజ్ ఆర్ట్ ఫిలింస్‌వారి 'విచిత్ర కుటుంబం.'

దాయాది అయినా తోడబుట్టిన తమ్ముడైనా తన దారి కడ్డొస్తే 'ప్రయాణానికి' సిద్ధం చేయించే ధనాశాపరుడు నాగరాజు. అంత ధనవంతుడు కాకపోయినా పలుకుబడికి కొదువలేని న్యాయవాది, ఉత్తమ ఆదర్శాలుకల వ్యక్తి రాజశేఖరం. నాగరాజు అన్యాయాలని రాజశేఖరం సాగనీడు. ఫలితంగా వారిద్దరిమధ్యకి పచ్చిగడ్డి తెచ్చుకున్నవాళ్లకి కూడా నిప్పుకి కొదవుండదు. లాయర్ రాజశేఖరం తన తెలివితేటలతో ధైర్యంగా నాగరాజు ఆట కట్టించి కథని సుఖాంతం చేస్తాడు.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, కృష్ణ, శోభన్ బాబు, నాగభూషణం, రాజ్‌బాబు, ప్రభాకరరెడ్డి, సావిత్రి,విజయనిర్మల, శీలా,పుష్పకుమారి, మీనాకుమారి, సంధ్యారాణి మొదలగువారు నటించారు.

లాయర్ రాజశేఖరంగా ఎన్ టి. రామారావు ఆ పాత్రకి జీవం పోశారు, లాయర్ భార్య కమలగా సావిత్రి ప్రదర్శించిన నటన ప్రేక్షకుల హృదయాల్లో కలకాలం నిలిచిపోతుందనడంలో అతిశయోక్తి లేదు. నాగరాజుగా నాగభూషణం నటన ప్రతిభావంతంగా ఉంది. శోభన్‌బాబు, శీలా వారి పాత్రలకి న్యాయాన్ని చేకూర్చారు. నాగరాజు భార్యగా పుష్పకుమారి నటన మెచ్చదగినది. అల్లరి జంటగా విజయనిర్మల, కృష్ణ లు ప్రేక్షకుల్ని అలరిస్తారు. నాగరాజు చెప్పుచేతల్లో ఉండి దారుణాలు జరిపే వ్యక్తిగా ప్రభాకరరెడ్డి నటన ప్రశంసనీయంగా ఉంది.

శ్రీ కె. ఎస్. గోపాలకృష్ణన్ కథకి శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలను రాశారు. దర్శకత్వాన్ని శ్రీ కె. ఎస్. ప్రకాశరావు, సంగీతాన్ని శ్రీ టి. వి రాజు. ఛాయాగ్రహణాన్ని శ్రీ సంపత్ నిర్వహించారు శ్రీ ఎస్. ఎస్. లాల్ రూపొందించిన 'టైటిల్స్' ప్రారంభంలోనే ప్రేక్షకుల్ని గిలిగింతలు పెడ్తాయి.

శ్రీ వి. కె. పి నుంకవల్లి నిర్మించిన ఈ చిత్రం మే 28 న ఆంధ్రప్రదేశ్‌లో విడుదలయింది.

—మాధవ్

# సినిమా

ప్రయోజనాత్మక సాంఘిక చిత్రాలను ప్రేక్షక జనరంజకంగా నిర్మించడంలో సిద్ధహస్తులైన శ్రీ ఏ. వి. సుబ్బారావు నాగేశ్వరరావుగారి రజతోత్సవ చిత్రంగా 'ఆదర్శ కుటుంబం' చిత్రాన్ని శ్రీ ప్రత్యగాత్మగారి దర్శకత్వంలో నిర్మించి మే 9 కి (విడుదలకు సిద్ధంచేసారు) కాని తెలంగాణా అల్లర్ల కారణంగా రజతోత్సవ సంరంభం వాయిదా వెయ్యబడింది. దాంతో చిత్రం విడుదల కాలేకపోయింది. మే 16 లేక 23 తేదిన యీ చిత్రాన్ని రిలీజ్ చెయ్యాలనుకున్నారట. కాని ఆంధ్రలో ఏర్పడ్డ తుఫాన్ భీభత్సం వీరి పుత్సాహాన్ని వెనక్కి నెట్టింది.

'ఎవరి కాళ్లపై వాళ్లు నిలబడాలంటే ఎవరికివారు శ్రమించి తమ జీవితావసరాలను సమకూర్చుకోవాలి.'

ఈ ఇతివృత్తంపై 'ఆదర్శకుటుంబం' కథను శ్రీ ప్రత్యగాత్మ రాయగా శ్రీ ఆత్రేయ కథా వైశిష్ట్యాన్నీ త; సంభాషణా చాతుర్యంతో తీర్చిదిద్దారు. ప్రజలలో ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సుకు ఒ



'ముహూర్త బలం'లో జమున

ప్రత్యేక స్థానమున్నది. ఈ సంస్థ నిర్మించిన చిత్రాలను చూడడానికి ప్రేక్షకులు వేచివుంటారు. అన్నితరగతుల సినీ ప్రేక్షకులకు నచ్చేవిధంగా తయారు చేయబడ్డ ఆదర్శ కుటుంబం' ఈ నెల 6 వ తేదీన' విడుదలవుతున్నది.

## వైవిధ్యంగల రెండు పాత్రలలో ఎన్. టి. రామారావు

మంచి పేస్టుగల నిర్మాతలలో తారక రామా పిక్చర్సు అధినేత శ్రీ పుండరీ కాక్షయ్య ఒకరు. వీరు శ్రీ రామ బ్రహ్మంతో కలిసి నిర్మించిన 'మహా మంత్రి తిమ్మరుసు' విజయనగర సామ్రాజ్య వైభవాన్ని చాటిచెప్పిన కళాత్మక చిత్రం అని మీచే కీర్తించబడింది. వీరి రెండవ చిత్రమైన 'కృష్ణావతారం' పండిత పామరులకు, ఆబాల గోపాలానికి నచ్చింది. ఇపుడు నిర్మించబడిన 'భలే తమ్ముడు' మీచే భలేగా వుందిలే అని ప్రశంసించబడే విధంగా తయారు చెయ్యబడింది. విధిచే విడదీయబడ్డ సోదరుల విచిత్రగాధయే 'భలే తమ్ముడు' వైవిధ్య స్వభావాలు గల్గిన యీ రెండు పాత్రలను శ్రీ ఎన్. టి. రామారావు విశిష్టంగా పోషించారు, శ్రీ యస్. యస్. లాల్ ఛాయాగ్రహణం రెండవపాత్ర కదలికను, మెదలికను, వ్యత్యాసాన్ని విడమరచి చెప్పగల్గింది. శ్రీ టి. వి. రాజుకు మహమ్మద్ రఫీగారిచే పాడించుకొనే అదృష్టాన్ని, అవకాశాన్ని నిర్మాత కల్గించారు. శ్రీ బి. ఏ. సుబ్బారావు తన దర్శకత్వం అనుభవాన్నంతా యీ చిత్రానికి వుపయోగించి 'భలేతమ్ముడు' చిత్రంలోని ప్రతి సన్నివేశాన్ని రక్తికట్టించారు. భారీఎత్తున నిర్మించబడ్డ యీ చిత్రం విజయా పిక్చర్సుద్వారా అతి త్వరలో విజయ విహారం చేయడానికి వురకలు వేస్తోంది.

## కొత్త సంగీత దర్శకుడు

'బంగారు సంకెళ్లు' దర్శకుడు శ్రీ గుత్తా రామినీడు లలితా ఆర్ట్సు నిర్మించనున్న సాంఘిక చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు. 'బంగారు సంకెళ్లు' చిత్రంలో శ్రీ చాంద్ అనెడి సంగీత దర్శకుని పరిచయంచేసిన రామినీడు యీ చిత్రంద్వారా శ్రీ చక్రవర్తి అనెడి నూతన



'భలేరంగడు'లో పద్మనాభం, విజయలలిత, వాణిశ్రీ

సంగీత దర్శకుని ప్రవేశబెట్టబోతున్నారు. చక్కటి కథాంశంగల యీచిత్రంలో శ్రీయుతులు కృష్ణ, వాణిశ్రీ, విజయనిర్మల, చలం, అల్లు రామలింగయ్య ప్రధానపాత్రలను పోషిస్తారు. శ్రీ రాజేంద్రకుమార్ కళను, శ్రీ అంకిరెడ్డి కూర్పును, కె. స్వామి కెమెరాను, శ్రీ కె. ఛటర్జీ నిర్మాణ బాధ్యతను నిర్వహించే యీ చిత్రాన్ని శ్రీ మధు, శ్రీ శేషు నిర్మిస్తున్నారు. ఈ చిత్రంయొక్క షూటింగ్ జూన్ మాసంలో ప్రారంభించబడుతుందని తెలుస్తుంది.

* * *

శ్రీ పింజల సుబ్బారావు స్వయంకృషితో పరిశ్రమలోని పెద్ద, చిన్నల అభిమానాన్ని సంపాదించారు. ప్రస్తుతం శ్రీ ఎన్. టి. రామారావును నూతన చిత్రంలో నాయకుడిగ అంగీకరింపజేసారు. ఇంతవరకు చిన్న చిత్రాలనే నిర్మించిన శ్రీ పింజల సుబ్బారావు జూన్ 6 న ప్రారంభించబోయే జానపద చిత్రాన్ని భారీఎత్తున నిర్మించడానికి నిశ్చయించారు. జానపద చిత్రదర్శకులలో జగజ్జెట్టి అని అనిపించుకొంటున్న శ్రీ విఠలాచార్య యీ చిత్రానికి దర్శ



'కదలడు వదలడు'లో ఎన్. టి. రామారావు, జయలలిత

కులు శ్రీ హెచ్. వి. సుబ్బారావుచే వ్రాయబడ్డ ఈ కథలో శ్రీయుతులు ఎన్. టి. ఆర్. కె. ఆర్. విజయ సత్యనారాయణ, బాలకృష్ణ, రాజశ్రీ ముఖ్య పాత్రధారులు. శ్రీ కె. నాగేశ్వరరావు కథను, శ్రీ కోదండపాణి సంగీతాన్ని విన్పించనున్న యీ చిత్రం సెప్టెంబర్‌కు రెడీ అవుతుందని తెలుస్తొంది.

**సంబరాల రాంబాబుగా చలం**

కథానాయకుడిగ ప్రవేశించి హాస్యనటుడిగ స్థిరపడిన శ్రీ చలం శ్రీరమణచిత్ర నిర్మిస్తున్న 'సంబరాల రాంబాబు' అనే సంపూర్ణ హాస్యచిత్రాన్ని సవినయంగా మీకు సమర్పిస్తున్నారు. తమిళంలో 'ఎదిర్ నీచ్చల్' పేరిట విజయఢంకా మ్రోగించిన చిత్రం యొక్క తెలుగురూపమే 'సంబరాల రాంబాబు'. 'పాపకోసం' చిత్రాన్ని ప్రతిభావంతంగా డైరెక్టుచేసిన శ్రీ శేషగిరిరావు యీ చిత్రం ద్వారా ప్రేక్షకులకు మరింత దగ్గర కాగలరని వూహించబడ్తుంది. 'హాస్యం, శోకం అనురాగం, ప్రేమానుబంధం'—యీ రసాలను శ్రీ చలం తన నటనతో రంజింప చేశారు. అలాగే కుమారి గీతాంజలి ఆండాల్‌మామి పాత్రను సమర్థనీయంగా రక్తి కట్టించింది. ఆండాల్ భర్తగా శ్రీ పద్మనాభం అందించిన హాస్యం మిమ్మల్ని చక్కిలిగింతలు పెడుతుంది. ప్రతిభవున్నా తెలుగు దర్శక నిర్మాతల ఆదరణ లభించని శ్రీమతి శారద నటనా వైశిష్ట్యానికి ఈ చిత్రం గీటురాయి అని రషెస్ చూసినవారు అభిప్రాయ పడ్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ రాజశ్రీ సంభాషణలను శ్రీ కుమార్ సంగీతాన్ని శ్రీ భాస్కర్‌రావు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. శ్రీ మోహన్‌రావు నిర్మిస్తున్న యీ చిత్రంలో యితర ముఖ్యపాత్రలను శ్రీయుతులు ఎస్. వి. రంగారావు, గుమ్మడి, మనోరమ, పోషిస్తున్నారు.

* * *

అన్నపూర్ణా సంస్థ ప్రతిష్టకు కారకులు శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు అనడం సమంజసం. ఒకటికి పదిసార్లు తాము నిర్మించనున్న చిత్రకథను పరిశీలించి కట్టుదిట్టమైన స్క్రీన్‌ప్లేను తయారుచేసికొని కథాపాత్రలకు సరితూగగల నటీనటులను నిర్ణయించి చిత్ర నిర్మాణానికి వుపక్రమించడం వల్లనే అన్నపూర్ణా సంస్థ నిర్మించే



'నాటకాలరాయుడు'లో కాంచన

ప్రతి చిత్రం మిమ్మల్ని ఆకర్షించి మీ అభిమానాన్ని చూరగొంటూంది. శ్రీమతి సులోచనారాణికథకు శ్రీ డి. వి. నరసరాజు సంభాషణలను సమకూరుస్తున్న ఒక వుత్తమ సాంఘిక చిత్రాన్ని శ్రీ యోగానంద్ దర్శకత్వంలో జూన్‌లో ప్రారంభించనున్నారు. ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను శ్రీయుతులు నాగేశ్వరరావు, గుమ్మడి, నాగభూషణం, పద్మనాభం, కృష్ణంరాజు కుమారి జయలలిత, చంద్రకళ, శ్రీమతి సూర్యకాంతం పోషించగలరని తెలుస్తుంది.

**కార్య దీక్ష**

ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ విఠలాచార్య నిర్మించిన లేక దర్శకత్వం వహించిన చిత్రాలకు తూర్పు ఆశియాలో విపరీతమైన డిమాండ్ వున్నది. ఇటీవల తమ దేశానికి రావలసినదిగా శ్రీ విఠలాచార్యను ఆహ్వానించారట. 'నేను రాలేకపోతున్నందుకు అన్యథా భావించకండి. నేను పెద్దవాడ్నయ్యాను. చిత్రాల ఒత్తిడివల్ల విశ్రాంతి కరువైంది. కాబట్టి నా కుమారుడు, వృద్ధిలోకి రావలసినవాడు, దర్శకుడు అయిన శ్రీనివాస్‌ను ఆహ్వానించండి' అని సమాధాన మిచ్చారట. శ్రీ విఠలాచార్యను

## సినిమా డైరీ

- అజంతా మూవీస్ నిర్మిస్తున్న జానపద చిత్రం యొక్క షూటింగు భరణిలో జరిగింది. శ్రీ కాంతారావు, రాజబాబు, ప్రభాకరరెడ్డి గార్లకు సంబంధించిన దృశ్యాలను శ్రీ హరినారాయణ చిత్రీకరించారు.
- సురేష్ మూవీస్ వారి సాంఘికంలో శ్రీ ప్రభాకరరెడ్డి, రావి కొండలరావులు నటించిన సన్నివేశాలను వాహినిలో శ్రీ జి. వి. ఆర్. శేషగిరిరావు చిత్రించారు.
- శ్రీరామకృష్ణా అండ్ ఎన్. ఎ. టి. కంబైన్స్ శ్రీ ఎన్. టి. రామారావు దర్శకత్వంలో నిర్మిస్తున్న 'తల్లా—పెళ్లామా' చిత్రంయొక్క షూటింగు మే 26 వ వాహినిలో ఉదయం సరిగ్గా గం. 11—40 ని.లకు ప్రారంభమయింది.
- మహాలక్ష్మి మూవీస్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో శ్రీయుతులు కృష్ణ, విజయనిర్మల పాల్గొన్న సన్నివేశాలను శ్రీ నందనరావు ప్రసాద్ స్టుడియోలో చిత్రీకరించారు.
- ప్రసాద్ ఆర్టు పిక్చర్స్‌వారి 'ఆదర్శకుటుంబం' జూన్ 6న నవయుగ ద్వారా విడుదలౌతుంది. శ్రీ ఎ. వి. సుబ్బారావు నిర్మించిన యీ చిత్రానికి శ్రీ ప్రత్యగాత్మ దర్శకులు.
- శ్రీ రాజ్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'విచిత్ర కుటుంబం' మే 28 వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యకేంద్రాలలో విడుదలయింది.
- జయలక్ష్మి ఆర్ట్సు నిర్మిస్తున్న 'తాళిబొట్టు' షూటింగు మే 29 వ రాత్రి 9 గంటలకు ప్రసాద్‌లో ప్రారంభమైంది. శ్రీ మాధవరావు దర్శకత్వంలో శ్రీ కృష్ణంరాజు, విజయలలిత నటించారు.



'మామంచిఅక్కయ్య'లో విజయ, పుష్పకుమారి

దర్శకునిగ పెట్టుకొన్న ప్రతి నిర్మాతకు చిత్రం విడుదలకుముందే బిజినెస్ అయిపోతుంది అని ప్రముఖ నిర్మాతలెందరో చెప్పగా విన్నాను. ఇంత పేరు, డబ్బు, హోదా సంపాదించినా, శ్రీ విఠలాచార్య దర్శకుడిగ తన ధర్మాన్ని సక్రమ పంథాలో నిర్వర్తిస్తూ పుదయం 7 గంటలనుండి రాత్రి 9 గంటల వరకు సెట్‌లో శ్రమించడం ఆశ్చర్యాన్ని గలిగిస్తుంటుంది.

## సినిమా

ప్రస్తుతం శ్రీ రామారావు నాయికుడిగ ఆరుచిత్రాలకు దర్శకుడిగ పుండడానికి కార్యదీక్షే కారణం.

### తెనాలిరామకృష్ణుడుగా పద్మనాభం

దాగుడు మూతలు, పూలరంగడు, అదృష్టవంతులు, మూగనోము, చిత్రాలలో విభిన్నమైన పాత్రలలో వైవిధ్యమైన హాస్యాన్ని చిందించి ప్రేక్షకులలో తనకొక విశిష్టస్థానాన్ని ఏర్పరచుకొన్న శ్రీ పద్మనాభం తన అభిమాన ప్రేక్షకులకు చక్కటి చిత్రాలను అందించడానికి నిశ్చయించి ఆ చిత్రాలకు తానే దర్శకత్వం నిర్వహించడానికి పుపక్రమించి నాలుగైదు చిత్రకథలను రెడీచేసి పుంచారు.

శ్రీ ఇంటూరి రచించిన 'కుమ్మరి మొల్ల'ను నిర్మించడానికి ఎందరో పూనుకొన్నా కార్యరూపం ధరించలేక పోయింది. 'ప్రతి వ్యక్తికి ఎప్పుడో ఒకప్పుడు కాలం కలిసి వస్తుంది' అన్నట్లు శ్రీ ఇంటూరి పడ్డ శ్రమ వృధాపోలేదు—ఇన్నటికి ఆయన కృషికి తగ్గ ఫలితం



'జన్మభూమి'లో కాంతారావు, వాణిశ్రీ

లభించడమేగాక 'కుమ్మరి మొల్ల'ను చిత్రంగా నిర్మించాలి అనేడి ఆయన కోరిక ఋజాదేరింది. ఆ కమనీయ కావ్యకన్యను మీకు చూపించే బాధ్యతను శ్రీ పద్మనాభం స్వీకరించి చిత్ర నిర్మాణాని కుపక్రమించారు. వికటకవి తెనాలి రామకృష్ణుడిగా శ్రీ పద్మనాభం, కుమ్మరి మొల్లగా కుమారి వాణిశ్రీ రచయిత వ్రాసిన పాత్రలకు పరిపూర్ణ న్యాయం చేకూర్చగలరని ఆశించవచ్చు. చిత్రంలోని యితర ముఖ్యభూమికలను శ్రీయుతులు గుమ్మడి, నాగభూషణం, సత్యనారాయణ,



'ఏకవీర'లో రామారావు, కె. ఆర్. విజయ



'జరిగిన కథ'లో విజయలలిత, రామలింగయ్య

రాజబాబు. అల్లు రామలింగయ్య, గీతాంజలి, హేమలత ధరిస్తారు. సంగీతాన్ని శ్రీ కోదండపాణి, కళను శ్రీ అనంతరామ సింగ్ నిర్వహించే ఈ చిత్రం యొక్క షూటింగు జూలై మొదటి వారంలో ప్రారంభమవుతుంది.

# సినిమా

## వేసవి విడిదికి కాశ్మీర్ వెళ్ళిన విజయ

నటి శ్రీమతి కె. ఆర్. విజయ తన భర్త శ్రీ వేలాయుధంతో మే 24 న మద్రాసునుండి విమానంలో బయల్దేరి కాశ్మీరుకు వెళ్ళారు. మద్రాసులో మండు టెండల తాకిడికి తట్టుకోలేక పదిరోజుల పాటు కాశ్మీరులో విశ్రాంతి తీసుకునేం దుకై వెళ్ళారు. మే 23 వరకు పద్మ ఫిలింస్‌వారి 'ఏకవీర' షూటింగులో పాల్గొని మే 24 న కాశ్మీరుకు బయలు దేరి వెళ్ళిన శ్రీమతి విజయ జూన్ 4 న మద్రాసుకు తిరిగి వస్తారని, ఆవిడ కార్యదర్శి శ్రీ రాధాబాబు వెల్లడించారు.

* * *

మన తెలుగు చిత్ర కథానాయకులు శ్రీ నాగేశ్వరరావు, శ్రీ ఎన్. టి. రామారావులు



'ప్రేమకానుక'లో హరనాథ్, విజయనిర్మల



'తారాశశాంకము'లో దేవిక

ఆంధ్రలో తుఫాను భీభత్సంతో తల్లడిల్లి పోతున్న బాధితప్రజ సహాయార్థమై చెరివక పదివేల రూపాయలను ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డికి సమర్పించారు

## నాగేశ్వరరావు ప్రేమించే యువతిగా వాణిశ్రీ

శ్రీ ముళ్ళపూడి వ్రాసిన కథను, శ్రీ భట్ 'భలేరంగడు' పేరిట సారథి స్టుడియోలో నిర్మిస్తున్నట్లు మీకిది వరలో తెలిపి వున్నాను. ఆ చిత్రంయొక్క షూటింగు (ఒక్కపాట చిత్రీకరణ మినహా) పూర్తయినట్లు, చిత్రనిర్మాణం యంత

# మీకు తెలుసా?

మళయాలదేశానికి చెందిన శ్రీ ఎం. జి. ఆర్. మద్రాసులో సత్యా స్టూడియోను నడుపుతున్నట్లే తమిళ దేశస్థుడయిన శ్రీ సుబ్రహ్మణ్యం తిరువనంతపురంలో మెర్రీలాండ్ స్టూడియోను నడుపుతున్నారు.

'అర్ధరాత్రి' నాయిక కుమారి భారతి ప్రస్తుతం శ్రీ సత్యజిత్‌రాయ్ నిర్మించే చిత్రంలో శ్రీ ఉత్తమ కుమార్‌తో నటిస్తున్నదట.

శ్రీ రాజకపూర్ నిర్మించిన 'జిస్ దేశ్‌మే గంగా బహతీ హై' చిత్రంలో నృత్యాలకుగాను సుమారు 12 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారట.

ప్రముఖ నటి శ్రీమతి వైజయంతిమాల 'చండాలికా' అనెడి నృత్యనాటికను ప్రదర్శిస్తూంది.

మన హీరో నాగేశ్వరరావు లాగే తమిళదేశపు ఉత్తమనటుడు శివాజీ గణేశన్‌కూడా ఆదిలో నాటకాల్లో ఆడవేషాలు ధరించేవారట.

త్వరగా పూర్తయినందుకు శ్రీ నాగేశ్వరరావు యిచ్చిన సహకారమేనని యిటీవల నిర్మాతను కలసినప్పుడు వెల్లడించారు. ఇటీవల 'భలేరంగడు' రష్ చూసాను శ్రీ తాతినేని రామారావు దర్శకత్వ ప్రతిభ అడుగడుగునా కనిపిస్తుంది. శ్రీ అక్కినేని యిప్పుడే నవయువకుడిగా వెండితెరను ప్రవేశించారా అనిపించేవిధంగా ఆయన ఆకారం ఆహార్యం అమరింది అంటే అతిశయోక్తిలేదు. హుషారుగా, భలేరంగడి పాత్రను తేలికగాతన విశిష్టమైన నటనా చాతుర్యంతో రక్తికట్టించారనే చెప్పాలి. శ్రీ గొల్లపూడి మారుతీరావు మాటలు మిమ్మల్ని ఒకవైపు ఆకట్టుకుంటే మరొకప్రక్క శ్రీ మహదేవన్ సంగీతం మిమ్మల్ని అలరింపచేస్తుంది. ఈచిత్రంలో శ్రీ అక్కినేని మేనకోడలుగా కుమారి విజయ లలిత, శ్రీ నాగేశ్వరరావును ప్రేమించే యువతిగా కుమారి వాణిశ్రీ నటించారు. మిగతా ముఖ్యపాత్రలను శ్రీయుతులు పద్మనాభం, గుమ్మడి, నాగభూషణం, ధూళిపాళ, సత్యనారాయణ, రావి కొండలరావు, కె. వి. చలం, సాక్షి రంగారావు, ప్రసాద్, సూర్యాకాంతం, పుష్పకుమారి పోషించారు. రాజశ్రీ పిక్చర్స్ ద్వారా జులైలో విడుదలకానున్న యీ చిత్రం యొక్క ఛాయాగ్రహణాన్ని శ్రీ రామకృష్ణ, కళను శ్రీ జి. వి సుబ్బారావు, నృత్యాలను శ్రీ తంగప్ప, కూర్పును శ్రీ కృష్ణస్వామి, నిర్మాణ నిర్వహణ బాధ్యతలను శ్రీ శ్రీనివాసరావు, కృష్ణమూర్తి, సహకార దర్శకత్వాన్ని శ్రీ జగన్మోహనరావు నిర్వహించారు. వీరి తదుపరిచిత్రం కూడా సాంఘికమేనని, యిందులో శ్రీ అక్కినేని నటించడానికి అంగీకరించారని, నిర్మాత శ్రీ భట్ వ్యక్తపరిచారు.

## స్త్రీజాతి ఔన్నత్యాన్ని ఇనుమడింపజేసే చిత్రం

శతదినోత్సవ చిత్రాలను నిర్మించి ప్రేక్షకలోకంలో తమకొక ప్రత్యేక గౌరవాన్ని యేర్పరచుకున్న చిత్ర నిర్మాణసంస్థ జగపతి పిక్చర్స్, వీరు తమ చిత్ర నిర్మాణాన్ని 'అన్నపూర్ణ' నుండి ప్రారంభించారు. ప్రతిచిత్రంలో యేదేని కొత్తదనాన్ని చూపిస్తూ ప్రేక్షకుల అభిమానాన్ని సంపాదించుకోగలిగారు. ఇటీవల విడుదలయిన 'అదృష్టవంతులు' చిత్రం తెలుగుచిత్ర కథనంలో నూతనత్వాన్ని యేర్పరచగలిగింది. ఇపుడు 'అక్కాచెల్లెలు' అనెడి సముజ్వల సాంఘికాన్ని నిర్మించే ప్రయత్నాలను పూర్తిచేసారు. స్త్రీజాతి ఔన్నత్యాన్ని యినుమడింపచేసే యితివృత్తంగల యీ చిత్రకథను వెండితెరపై యెవరెవరు యేయే రూపాల్లో మీకు తెలుపగలరనెడి విషయాన్ని త్వరలో మీరు తెలుసుకుంటారు.

## ప్రయోజనాత్మకమైన మరో ప్రపంచం

శ్రీ అక్కినేని, శ్రీ ఆదుర్తి కలసి నిర్మించిన 'సుడిగుండాలు' వారి ఆశయాలను ప్రతిఫలింపచేసి, మీ అభిమానాన్ని చూరగొన్నది. పత్రికల, ప్రాజ్ఞుల ప్రశంసల నందుకుంది. అనేక బహుమతుల నందుకుంది. వీరి ద్వితీయ కానుకగా 'మరో ప్రపంచం' రూపొందుతూ వుంది. ఈ చిత్రంలో సావిత్రి, నాగేశ్వరరావు భార్యాభర్తలుగా నటిస్తున్నారు. ఈ చిత్రం ప్రయోజనాత్మకంగానూ, ప్రబోధాత్మకంగాను వుండగలదని వూహించబడుతుంది. ఈ చిత్రంలో చాలామంది కొత్త తారలు పరిచయం అవుతారు. శ్రీ గుమ్మడిమల్లిక ముఖ్య భూమికను ధరించే యీ చిత్రానికి శ్రీ భాషా కథకుడు, శ్రీ మహదేవన్ సంగీత నిర్దేశకుడు, శ్రీ ఆదుర్తి దర్శకుడు, శ్రీ మోదుకూరి జాన్సన్ సంభాషణలను సమకూర్చిన యీచిత్రం ప్రస్తుతం హైద్రాబాదు సారధిలో షూటింగు జరుపుకుంటూంది. —శ్రీనివాస్

# పుస్తకాలు

## పూలతెరలు

(నవల రచయిత్రి శ్రీమతి కోమలాదేవి ఎమెస్కో ప్రచురణ ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాదు వెల 2—00)

ఊర్మిళ అనే పేరులో సౌందర్యమూ, మార్దవమూ కోమలత్వమూ ఉన్నాయి టాగూర్ ఒప్పుకొంటాడు అయితే ఆ పేరు ఏ వ్యక్తికీ ఉన్నట్లు వినలేదు ఉంటే ఉండవచ్చు ఏ ఎవరికయినా పేరు పెట్టవలసి వస్తే ఊర్మిళ పేరు పెట్టటానికి రామాయణం తెలిసినంతర్వాత సంకోచిస్తారు ఈ రచయిత్రికి ఆ సంకోచం లేదు

'అనాథ' అని పేరు పెడితే నవలకు బాగుండేదేమో అనిపిస్తుంది పద్మ, కల్యాణ, హేమ, వసుంధర చాలామంది అనాథలు "దురంత దుఃఖం" వాళ్ళకుంది

"కృతజ్ఞతా స్తుతులు చెల్లించు" "పరిభాగస్థులు", "రిక్త హస్తాలు" తెలుగు బైబిల్ ప్రభావం తెలుపుతాయి

ఊర్మిళ అంత అందమయిన అమ్మాయి, ఊహామయ సౌందర్య స్వప్నలోకాల ప్రతీక 'పద్మనయన' 'సరజనయన' పాత్రల పేర్లు కవితా హృదయ నిదర్శనాలు

ఈ రచయిత్రి కవయిత్రి అయితే బాగుంటుంది తెలుగులో కవయిత్రులు లేని లోపం తెలిసిందే కదా!

ప్రేమమయ హృదయాలకు ఎంత బాధామయ జీవితం కలిగిందో నవల చదువుతుంటే దిగులు కలుగుతుంది

నవలలో ఫేడిన్ ఫేడవుట్ లెక్కువ జాగ్రత్తగా చదవకపోతే పూర్వాపరాలర్థం కావు పద్మ పాఠకుల హృదయాల్లో నిలిచిపోతుంది రచయిత్రులకు సహజమయిన పురుష పాత్ర నింద ఈ నవలలోనూ కించిన్మాత్రంగా గోచరం కాకపోదు

నవల ఆరంభంలో 20 పేజీలు లాగా నవల అంతా వుంటే యువతీయువకులే నవల పడీపడీ చదివేవాళ్ళు కరుణరస ప్రధాన రచనలు ఇష్టపడే అందరూ చదవదగినదీ నవల

—మనోరాణి

## వివాహాలు

శ్రీ కె ఎస్ నరసింహన్ గారి కుమార్తె చి వేదవల్లికి శ్రీ ఎస్ రామస్వామి అయ్యంగార్ కుమారుడు శ్రీ ఎస్ ఆర్ నరసింహన్‌కి మే 29వ తేదీ మద్రాసులో వైభవంగా వివాహం జరిగింది పలువురు ప్రముఖులు వివాహానికి విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు

*  *  *

శ్రీ యర్రంశెట్టి నారాయణరావుగారి కుమారుడు, కథారచయిత అయిన యర్రంశెట్టి శాయికి శ్రీ శీలంశెట్టి జగన్మోహన్‌రావు నాయుడు గారి కుమార్తె చి సౌ రమాదేవికి మే 18వ తేదీన వైభవంగా వివాహం జరిగింది

## వనితాలోకం...

(49 వ పేజీ తరువాయి)

పడ్డావు' అంటాడు ఇంకొంచెం నాగరీకుడైతే 'జాన్లీ నేను కొనమన్న చీర నువ్వెందుకు కొంటావు? నువ్వు కట్టుకునేది నాకోసమా నా ఆనందం కోసమా?' అంటూ సాగదీస్తాడు

అంతే తప్ప మీ చామనచాయ రంగుకు అలాంటి ముదురు రంగులు నప్పవనీ, అవి కట్టుకుంటే మీ అందం వాటి అందం కూడా చెడిపోతుందనీ గ్రహించుకునే శక్తి ఆయనకుండదు. చెప్పినా అర్థం చేసుకుంటానికి ప్రయత్నించడు కారణం మరేం లేదు అహంభావం! మగవాడినన్న అతిశయం అంతే! తను చెప్పిందల్లా భార్య చెయ్యాలి అది మంచిగనీ, చెడుగానీ ఇదీ మగవారి సిద్ధాంతం.

ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో విషయాలుంటయ్ మీ యిళ్ళల్లోని మగవాళ్ళంతా ప్రతి చిన్నవిషయంలోనూ ఎలా తమ ఆధిక్యతను చూపెట్టేదీ మిమ్మల్ని ఎలా అణచివేసేదీ, పైపెచ్చు మిమ్మల్నే దెప్పిపొడిచేది యివన్నీ చెప్తే కొన్నిరోజులు పడుతుంది అయితే ఆవివరాలన్నీ మీకు ఎటుపడీ తెలుసు కనుక యిప్పుడు నేను చెప్పదల్చుకోలేదు

ఈ మగవాళ్ల అతిశయాన్ని అణచివేసి, వాళ్లను లొంగదీసుకుని, అరచేతిలో వైకుంఠాన్ని, వంటింట్లో కైలాసాన్ని చూడగలిగే ఉపాయాలనుమాత్రం చెప్తాను.

(వైవారం భర్తలలో రకాలు)





Edited Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# లిప్టన్ రూబీ డస్ట్ టీ

## చక్కని రంగు, మంచి రుచి, కమ్మదనము వీటన్నిటితో నిండినది అతి త్వరలో తయారగును

మంచి టీని మెచ్చేవారికి లిప్టన్స్ రూబీ డస్ట్. పైగా రూబీ డస్ట్ ప్రతి పొట్లానికి ఎన్నో కప్పులు ఎక్కువ టీని ఇస్తుంది. బలమైన పానీయ లక్షణంగల టీ. ఘుక్కలి రుచి. హాయి గొల్పించే సువాసన. రూబీ డస్ట్ టీని త్రాగడ ఆహ్లాదకరం ఎక్కువ పొదుపు కూడ యిచ్చును




లిప్టన్స్ అంటే
మంచి టీ




LRDC-1 TEL

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

శ్రీ రాజ్ ఆర్ట్ ఫిలింస్
సవినయంగా సమర్పించు

# విచిత్ర కుటుంబం

దర్శకత్వం: కె.ఎస్.ప్రకాశరావు

నిర్మాత: వి.కె.పి.సుంకవల్లి




మాటలు:
భమిడిపాటి రాధాకృష్ణ

పాటలు:
డా॥ సి. నారాయణరెడ్డి

సంగీతం:
టి.వి.రాజు

కెమెరా:
ఆర్.సంపత్

ఆంధ్ర-సీడెడ్: విజయా నైజాం: ఉషాఫిలింస్